శ్రీ

# మత్స్యపురాణము.



ఇది

హరిభట్టారక ప్రణీతము.




మొదటికూర్పు 600.

కాకినాడ,

సుజనరంజనీముద్రాక్షరశాలయందుఁ

చోతాప్రగడబ్రహ్మానందరావుచే ముద్రింపఁబడి

కవితాపత్రికాధిపతులచేఁ బ్రకటింపఁబడినది.

1912

వెల 0-14-0 లు.

# ఉపోద్ఘాతము.



మత్స్యపురాణము నాంధ్రీకరించిన కవి హరిభట్టారకుఁడు. ఇతఁడింతకుమున్ను వరాహపురాణముఁదెలిఁగించి కొలిపాక యెఱ్ఱన యను కరణమున కంకితము చేసెను. నరులకుఁ గృతియిచ్చుటఁ గలిగిన పాపముఁ బరిహరించుకొను తలంపుతో నీతఁడీమత్స్యపురాణమును రచించిన ట్లీక్రిందిపద్యముచే నూహింపఁబడుచున్నది.

సీ. ఆయురారోగ్యని • త్యైశ్వర్యములుగల్గి
విభవంబుతో ధాత్రి • వెలయుకొఱకు
ధనమునకై నరా • ధముల పన్నుతిసేయఁ
బొడమిన పాపముల్ • చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశు • పదపంకజములందు
నిశ్చలవృత్తితో • నిలుచుకొఱకు
రౌరవమ్ములఁబాసి • రయమున వైకుంఠ
సదనంబునకు వేడ్కఁ • జనెడుకొఱకుఁ

గీ. బరమవైష్ణవజనులెల్లఁ • బ్రస్తుతింప
మత్స్యకృతంబయి హరికథా • మాన్యమగుచు
నుత్తమంబగు విష్ణుధ • ర్మోత్తరంబు
రంగనాథున కర్పింతు • రాణ మెఱసి.

ఇక్కవి తన 'కష్టఘంటావధానపరమేశ్వరబిరుద' మున్నట్లుగ్రంథాంతగద్యమునందుఁజెప్పుకొనియెను. దీనిచే నాకాలమునందష్టావధానమే మిగుల నపురూపముగా నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈతనికవిత్వము ధారాశుద్ధి గలిగి మృదుమధురముగా నున్నది. ఈతనికాలమింకను జరిత్రకారులచే సరిగా నిర్ణయింపఁబడలేదు. కాని యపూర్వమగు గ్రంథోపక్రమమునుబట్టి చూడ నీతఁడు మిక్కిలి ప్రాచీనుఁడయినట్లు తోఁచుచున్నది.

ఈగ్రంథము బ్రహ్మశ్రీ మ. రా. రా. మానవల్లి రామకృష్ణకవిగారి
వలన బ్రహ్మశ్రీ మ. రా. రా. చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు గ్రహించి
ప్రకటింపఁదలంచిరి. ఇంతలోఁ బ్రాచీనకృతుల ముద్రింపించి జగదుపకృతి
యొనరించు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురపు రాజుగారి సముద్యమము తెలియవచ్చుట
యు శ్రీవారికా గ్రంథము నొసంగిరి. శ్రీసూర్యారావుబహద్దరువారును దమ
పండితులలో నొకరగు బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిలవారిచే
నాగ్రంథమును బరిష్కరింపించి శుద్ధగ్రంథలేఖకులగు భాస్కరరామమూర్తి
గారిచే వ్రాయించిరి. అంత మాచే నభ్యర్థింపఁబడి మాకవితకు దయాపూర్వక
ముగా నొసంగిరి. ధనసాహాయ్యముతోఁ బాటు గ్రంథసాహాయ్యముఁ గూడఁ జేసి
మాకవితను బోషించు శ్రీవారికభ్యుదయపరంపరాభివృద్ధిగా దీవించుచు
న్నారము.

పత్త్రికాధిపతులు.



శ్రీరస్తు.

# మత్స్యపురాణము.



## ప్రథమాశ్వాసము.

క. హరికి సమర్పిత మగు కృతి,
సరళం బగు శుక్తిమధ్య • జలబిందుక్రియన్
హరి కసమర్పిత మగు కృతి,
విరసం బగుఁ దప్తలోహ • వృతజలముగతిన్. ౧

వ. అని మనంబున వితర్కించి. ౨

సీ. జలజసంభవునకు • నిలువేలు పై మించెఁ
జర్చింప నే వేల్పు • జగములోన,
తారకబ్రహ్మమై • తనరు రాముని చేతఁ
బూజితుం డయ్యె నే • పుణ్యమూర్తి,
వీక్షింప నుభయకా • వేరీజలాంతరం
బున నిల్చె నే దేవుఁ • డునికిఁ గోరి,
విభవంబుతోడ నే • విభుఁ డొసంగును భక్త
జనులకు వైకుంఠ • సదనముఖము,

వట్టి నిర్మలనిరవద్య ♦ యజ్ఞతత్వ
సచ్చిదానందరూపబ్ర ♦ హ్మిష్ఠుఁ డైన
రంగపతిమీఁద బుద్ధిఁ జే ♦ రంగఁ బూన్చి
యమ్మహాత్ముని పోఁడుగా ♦ నాత్మ నిల్పి.

చ. లలితమనోజ్ఞవర్ణసద ♦ లంకృత మై సరసాంతహృద్య మై
దళగణతుల్య మై శ్రవణ ♦ ధారణవాంఛిత మై నవీన మై
నలఁకువ నొంద కచ్యుత గు ♦ ణప్రకరంబులతోడ యుక్త మై
పొలు పగు కావ్యపుష్పతతిఁ ♦ బూజ యొనర్చెద రంగభర్తకున్.

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నా ♦ పస్తంబుఁడన్ దిమ్మమాం
బారాజద్వరగర్భసంభవుఁడ రా ♦ మక్ష్మాసురానేకజ
న్మారూఢాధికపుణ్యలబ్ధహరినా ♦ మాంకాప్తసత్పుత్రుఁడన్
శ్రీరామానుజపాదపద్మయుగళీ ♦ చింతాసమాయుక్తుఁడన్.

క. ఈరీతి గోత్రనామాఁ,
కారూఢుఁడ నైన యేను ♦ యత్నముతోడన్
శ్రీరంగపతిఁ గృతీశ్వరుఁ
గా రయమునఁ బాదుకొలిపి ♦ కౌతుక మొదవన్.

సీ. ఆయురారోగ్యస ♦ త్త్వైశ్వర్యములు గల్గి
విభవంబుతో ధాత్రి ♦ వెలయుకొఱకు
ధనమున కై నరా ♦ ధముల సన్నుతి సేయఁ
బొడమినపాపముల్ ♦ చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశ ♦ పదపంకజములందు
నిశ్చలవృత్తితో ♦ నిలుచుకొఱకు
రౌరవంబులఁ బాసి ♦ రయమున వైకుంఠ
సదనంబునకు వేడ్కఁ ♦ జనెడుకొఱకుఁ
బరమవైష్ణవజను లెల్లఁ ♦ బరిస్తుతింప
మత్కృతం బయ్యె హరికథా ♦ మాన్య మగుచు
నుత్తమం బగు విష్ణుధ ♦ ర్మోత్తరంబు
రంగనాథున కర్పింతు ♦ రాణ మెఱసి.

గీ. తలఁచి చూడ విష్ణు • ధర్మోత్తరమునకు
నాయకుండు రంగ • నాథుఁడైన
సన్నుతింప హేమ • సౌధంబునకు రత్న
కలశ మెత్తినట్టి • క్రమము గాదె! 8

వ. ఇట్లు నిర్మితం బగు మదీయకావ్యంబునకు రంగభర్తను నాయకునిఁగా
నొనరించి. 9

క. సురతాత్మజుఁ డౌ విభీషణ
వరదునకును సకలదివిజ • వర్ణితసుగుణా
కరునకుఁ బరమదయారస
పరిపూరితహృదయునకును • భావజ్ఞునకున్. 10

క. పంచశరాహితసఖునకు
సంచితకలుషౌఘతిమిర • జలజాప్తునకున్
జంచత్త్రిభువనభవనున
కంచితశ్రీరంగమంది • రావాసునకున్. 11

క. వరశంఖచక్రకీలిత
కరునకు మునియోగిహృదయ • కంజాంతరసు
స్థిరునకు శతకోటిదివా
కరతేజున కంబురాశి • గాంభీర్యునకున్. 12

క. ధారాధరసమవిశదా
కారసమేతునకు సకల • కర్మఠమతికిన్
శ్రీరంగవిభునకును నర
సీరుహదళనయనునకును • శ్రీనాథునకున్. 13

వ. అర్పితంబు గా నా రచియింపఁ బూనిన పురాణంబునకుఁ బ్రారంభం బెట్టి
దనిన. 14

ఉ. కారణకార్యరూప! గుణ • కర్మసమూహవిహీన! సచ్చిదా
కార! పరాపరా! ప్రకృతి • కల్పితదోషలతాలవిత్ర! దు
ర్వారసురారిఖండన! భ • వత్రిదశాధిపముఖ్యదేవతా
ధార! జగన్నివాస! రిపు • దర్పవినాశక! రంగనాయకా. 15

వ. అవధరింపు మంత శౌనకుండు విష్ణురాతునివలన షడంగయుక్తంబు లై విధ్యర్థవాదమంత్రాత్మకంబు లైన ఋగ్యజుస్సామాథర్వణంబు లనంబరఁగు నాల్గువేదంబు లభ్యసించి తద్గీతార్థంబు లెఱింగి తదనుష్ఠానప్రకారంబులు వివిధంబు లైనం జూచి మనంబున సంశయించి సద్గురుముఖంబున ముక్తిప్రాప్తికరం బగు గర్మానుష్ఠానంబు తెలియంబూని. 16

శా. వేదంబుల్ వివిధార్థజాలరచనా • విఖ్యాతముల్ గానఁ ద
ద్వేదంబుల్ వివరింప వెయ్య దగయే • దీపించుఁ గైవల్యమం
గాదివ్యాకృతిఁ గానుపింప దగినా • కజ్ఞానశైథిల్యముం
గా దింకెవ్వఁడు దీనిఁ దెల్పఁ గలఁడే • కం బైన మార్గంబునన్. 17

క. ఆవేదార్థము లోకోట్టక
టే వివరింపంగ నొకట్ట • టికి నొకట్టి వై
రావాస మగుచుఁ బరఁగఁగఁ
దావళి మెట్లాదవునందుఁ • దలపోయఁగన్. 18

తరళ. అని మునీశ్వరుఁ డివ్విధంబున • నాత్మలోపల వేదసం
జనితవాక్యగతార్థసారవి • చారరూఢమనస్కుఁ డై
వనధితీరసువేలశైలని • వాసవర్జితుఁ డయ్యెఁ దాఁ
జనియె శిష్యసమేతుఁ డై మణి • సానుమద్వనవీధికిన్. 19

వ. ఇట్లమ్మునివరుండు శిష్యసమన్వితుం డై దేశంబులు గడఁచి పుణ్యవనులు దాఁటి శైలంబు లతిక్రమించి మేరుమహీధరప్రాంతంబున కరిగి యచట భోగవతీనదీతీరంబునఁ బల్లవితంబులు, కోరకితంబులు, పుష్పితంబులు నైన నగంబులనుమ విలసిల్లు సహకారపనసకదళీఖర్జూరనారికేళబిల్వకపిత్థజంబీరమాతులుంగపున్నాగకురువిందలవంగశతపత్రమధూకమల్లికాజాతికరవీరచంపకవకుళప్రియంగుకురువకపిచుమందమందారాదితరులతాసంజాతప్రసవగుచ్ఛగళితమకరందధారాసంపాతపంకిలతన్మహీరుహమూలశీతలచ్ఛాయాసమాశ్రితకస్తూరిమృగనాభివాసనాసంసక్తహేలామధూమామోదమోదితంబును హంసకారండవాదిజలపక్షులకు నాందోళికలచందంబున డోలాయమానంబు లైన కనకమయకమలషండంబులవలన నిష్యందంబు

లగు సుమనోరసంబులపరిమళంబులకు నిలయంబు లై శీతలపానీయపూరితంబు లైన సరోవరంబులచేతనలంకృతంబును మునికుమారులకు సహశ్రోతలనం బరఁగు శుకశారికలచేతఁ బఠితంబు లైన వేదాంతవాక్యంబుల రచనావిశేషంబుల శ్రవణమనోహరంబును నిర్వైరంబునఁ బర్ణశాలాంగణంబున సంచరించు మృగస్తోమంబులచేత దర్శనీయంబును బాలతరుమూలకల్పితంబు లగు నాలవాలంబులసేచనంబునకు నై జలపూరితంబు లగు కలశంబులు కరంబులం గీలించి వనమధ్యంబునఁ దద్వనదేవతలో యనఁ బరిభ్రమించుచు నిండుజవ్వనంబున విఱ్ఱవీఁగు మునికన్యకలచేత నభినుతంబును వివిధయోగిజనసమాజసంకులంబును హరిభక్తసమేతంబును సకలమంగళాశ్రయంబును సర్వపుణ్యనిలయంబు నగు నారాయణాశ్రమంబు చేరంజని

సీ. వ్యాఖ్యానముఖరవే • దాంతవాక్యంబుల
 శ్రవణయుగ్మమున కు • త్సాహ మొదవ
ఫలితపుష్పితనూత్న • పాదపప్రకరంబు
 వెడపక కన్నుల • కింపుఁ జూపఁ
దుదిముట్టఁ జను హోమ • ధూమగంధంబులఁ
 దనువునకును శుచి • త్వంబు నిగుడఁ
దత్పుష్పపరిమళో • ద్యతమారుతంబున
 మార్గసంజాతశ్ర • మంబుఁ దొలఁగ
శౌనకుం డంత సంతోష • సహితుఁ డగుచు
నట్టి సన్నుతనారాయ • ణాశ్రమప్ర
వేశ మొనరించి యందు సం • విష్టుఁ డైన
మునివరేణ్యుని దర్శించి • ముదితుఁ డగుచు. 21

గీ. అంతఁ దత్కృతంబు • లగు నాతిథేయంబు
లంది యంచితాస • నాంతరమున
నతిముదంబుతోడ • నాసీనుఁ డై యుండి
పలికె శౌనకుండు • భక్తి మెఱసి. 22

క. నారాయణరూపంబున
నీ రీతిని సకలలోక ♦ హితమున కై ల
క్ష్మీరమణ ! సంభవించితి
వారూఢచరిత్ర ! దేవ ♦ తాధిపవంద్యా. 23

క. వేదంబులు భవదభినవ
పాదములకు భూషణములు ♦ భావింపఁగ బ్ర
హ్మాదుల కైన నశక్యము
మీదివ్యవిభూతిఁ దెలియ ♦ మిత్రశతాభా ! 24

మ. సనకాదుల్ భవదంఘ్రిభక్తియుతు లై ♦ సంసారదావానలం
బున సంతప్తులు గాక విత్తగృహస ♦ త్పుత్రాదిదుర్మోహసం
జనితాత్మీయవికారముల్ గెలిచి మో ♦ క్షశ్రీసమాయుక్తు లై
వనజాతాక్ష ! భవత్స్వరూపధరు లై ♦ వర్ధిల్లి రెల్లప్పుడున్. 25

వ. అదియునుం గాక భవన్మంగళగుణంబులు నిర్ణయించి వర్ణింపఁ బద్మసంభవాదు లైనను శక్తులు గారు. అట్టియెడ జగద్రక్షణంబుకొఱకును వేదమార్గాచారంబుకొఱకును బృధివ్యాదిభూతంబులసంతుష్టికొఱకును నారాయణరూపంబు నైకొనిన మిమ్ము సాధారణజనంబులు తెలియంగలరే ? యని పలికి శౌనకుండు మఱియు నిట్లనియె.

క. మనమునఁ బెక్కువిధంబుల
ననుమానము లుద్భవింప ♦ నవియణఁగుట కై
పనివింటిని మిము దర్శిం
పనులోకశరణ్యానిత్య ♦ పావనచరితా ! 27

చ. చదివితి వేదశాస్త్రములు ♦ సాంగపదస్వరవర్ణరూఢి నం
దొదవినమార్గముల్ వివిధ ♦ యోజ్యము లై విలసిల్లు వానిలో
నెదిరినకర్మకాండము న ♦ హింసయుజ్ఞానమునం దకర్మమున్
వదలక పలుకుచుండును బ్ర ♦ వాదనులన్ విపరీతవృత్తు లై. 28

గీ. పాపరూప మగుచు ♦ బలసి యుండెడు హింస
పాపరహిత మగుచుఁ ♦ బరఁగు టెట్లు
కర్మసరణిఁ గాని ♦ కలుగదు బ్రాహ్మణ్య
మట్టి కర్మసరణి ♦ యణఁపఁ దగునె. 29

సీ. వరుస మంత్రంబె వే • దతయని వర్ణించు
నుచితార్థ మీక్షించి • యొక్క చోట
యొత్తఁగా నిత్యనై • మిత్తిక కామ్యక
ర్మముల నొక్కొక్కచోటఁ • బ్రస్తుతించు
దురితనాశం బని • దూఁకొని యొకచోట
విధినిషేధంబులు • విస్తరించుఁ
బలుకు నొక్కొక్క చోటఁ • బరమార్థరూఢిగా
సరవిఁ దత్కర్మవి • సర్జనంబు
నట్టి విధ్యర్థవాదమం • త్రాదికస్వ
రూపవేదంబు శ్రీవిష్ణు • రూప మనుటఁ
జేసి సన్మార్గములలోన • సిద్ధమైన
యర్థ మెఱుఁగరు సుజ్ఞాను • లైన ననఘ! 30

క. ఈ వేదంబులలోపల
భావింపఁగ సకలధర్మ • పావనమై మో
క్షావాసహేతు వగు నది
ధీవర! వినిపింపవలయుఁ • ద్రిదశేంద్రనుతా! 31

ఉ. ఎవ్వనిచేత నీ జగము • లెల్లను సృష్టము లయ్యె రక్షకుం
డెవ్వఁడు వీని కబ్జజమ • హేంద్రదిశాధిపు లాత్మభీతితో
నెవ్వని యాజ్ఞ సేయుదు ర • ధీశ్వరులయ్యును ముక్తిదాయకుం
డెవ్వఁడు తన్మహాత్ముని ము • నీశ్వర! తెల్పుము మాకు వేడుకన్. 32

చ. అరయ మదీయమైన హృద • యంబున మోహమదాంధకారమిల్
గురువుగ నిల్చి యున్న యవి • ఘోరతదీయవికార మంతయున్
సరసభవద్వచోవిమల • చంద్రికచే విదళించి సంతత
స్థిరకరుణార్ద్రదృష్టి నభి • షిక్తునిఁ జేయుము నన్ను ధీవరా! 33

వ. అని యిట్లు శౌనకుం డంతఃప్రపత్తిపూర్వకంబుగాఁ బలికినవచనంబులకు
సంతసించి నారాయణముని యిట్లనియె. 34

క. పలికితివి మంచిమాటలు
వలనుగ నిట్లడుగనారుల ♦ వశ మగునె తుదం
దెలియఁగ వలసినవన్నియుఁ
దెలిపెద నే విస్తరించి ♦ తేటపడంగన్. 35

చ. జగదుదయావ్యయంబులును ♦ సంస్కృతిలక్షణ మాత్మయోగముల్
భగవదుపాసనావిధియు ♦ భక్తివినోదము గర్మమార్గముల్
సగుణవిశేషముం దెలిపె ♦ నారదమౌనికిఁ బద్మజాతుఁ డ
ప్పగిదిని నీకుఁ దత్కథలు ♦ భాతిగ నే వినుపింతు వేడుకన్. 36

సీ. ఒకనాఁడు పర్వత ♦ యుక్తుఁడై నారదుఁ
డమరలోకంబున ♦ కరిగి యచట
నమరేంద్రపూజితుం ♦ డగుచు వారుణలోక
మున కేగి కైలాస ♦ మునకు నడచి
తద్గిరీంద్రంబుపై ♦ ధరణీధరాత్మజా
సహితంబు నాగభూ ♦ షణునిఁ గొలిచి
యంతఁ బంకజసంభ ♦ వాగణ్యలోకసం
ప్రాప్తుఁడై యాశార ♦ దాధిపునకు
నభినుతంబుగ వందనం ♦ బాచరించి
మహతి యను వీణె సారించి ♦ మంద్రమధ్య
మాదిభేదకరాగముల్ ♦ పాడు కొలిపి
చతురగానమ్ములను దృఢ ♦ స్తుతు లొనర్చి. 37

మ. ధీసంపన్నుఁడు తన్మునీంద్రుఁ డట సు ♦ స్నిగ్ధస్వరావృత్తితో
నానాసంగీతవినోదవాద్యముల బ్ర ♦ హ్మానందసంపన్నయో
గాసక్తుండుగఁ దత్సరోజభవు న ♦ త్యంతంబు హర్షాధిక
శ్రీసంయుక్తునిఁ జేసి తత్కరపరి ♦ స్పృష్టాంగుఁడై యిట్లనున్. 38

సీ. ఏ రీతి నుదయించె ♦ నీచరాచరరూప
మై ప్రవర్తించు బ్ర ♦ హ్మాండకుహర
మిందున కాధార ♦ మెయ్యదికర్తృత్వ
శక్తి యెవ్వనియందు ♦ సంక్రమించుఁ

కైవల్య మన నెద్ది ♦ కాలంబు క్రియ లెవ్వి.
తత్త్వరూపం బైన ♦ ధర్మ మెట్లు
35 వశ్యాదివిశసన ♦ ప్రారంభసంయుతా
ధ్వరము లే క్రియ దేవ ♦ తలఁకుఁ దృష్టి
జ్ఞానమును జ్ఞేయమును నన ♦ జగతి నెవ్వి
సాక్షిరై నిల్చు నెవ్వాఁడు ♦ సకలదిశల
36 బహువిధంబుల శాస్త్రముల్ ♦ ప్రబలు టెట్లు
తేటపడ నిట్టి సూక్ష్మముల్ ♦ దెలుపవలయు. 39

వ. అనిన నారదునకుఁ బద్మసంభవుండు వికసితస్వాంతుండై యిట్లనియె. 40

చ. వినుము మునీంద్ర పూర్వమున ♦ వేడుకతో సనకాదు లెల్ల ని
ర్జన మగు కాననంబునఁ బ్ర ♦ శస్తతపంబులు సల్ప మెచ్చి యే
ననయము హంసరూపమున ♦ నచ్చటి కేగిన వార లందఱున్
నను హృదయంబునం దెలిసి ♦ నమ్రత నొందన వారి కయ్యెడన్. 41

క. నీ వడిగిన ప్రశ్నలు సం
భావితవాక్ప్రౌఢితోడఁ ♦ బలికితి నవి నీ
కావిర్భవించు నట్లుగ
ధీవర వినిపింతు నాత్మ ♦ తేటపడంగన్. 42

చ. కలఁ డొకఁ డాదివేలుపు జ ♦ గన్నుతుఁ డై శతకోటిభాస్కరో
37 జ్జ్వలఘనమూర్తిచేఁ దనరి ♦ వర్ణితుఁ డయ్యును రూపహీనుఁడై
తలకొని విశ్వసంజనన ♦ తత్పరిపాలనశాసహేతు వై
కొలఁది యెఱుంగరాక జన ♦ గోచరనిశ్చిత వర్ణశూన్యుఁ డై. 43

38 వ. అట్టి నిర్మలనిరవద్యనిరతిశయసచ్చిదానందస్వరూపసమేతుం డగు తత్తే
జోమయమూర్తి స్వేచ్ఛావిహారసమన్వితుం డగుటం జేసి యపరప్రేష్యబుద్ధి
సంయుక్తుం డై యాదిని జలతత్త్వంబు సృజియించి యంత బాహ్యావరణ
సమేతంబు గా నొక్క సువర్ణమయం బగు బ్రహ్మాండంబు నిర్మించి తత్ప
యోరాశిమధ్యంబునఁ గీలుకొలిపిన నది పాదుకొన నాధారంబు లేక ము
నింగాడు సమయంబున. 44

క. సేరుపు దలకొనఁగఁ దదా
ధారం బై యట్టి తోయ • తత్త్వములోనన్
దారుకొని నిలువ నతనికి
నారాయణనామ మపుడు • నాఁ జెంబయ్యెన్. 45

వ. తత్ప్రకారంబున జలమధ్యసంస్థాపితం బగు నట్టి బ్రహ్మాండకరండంబపాయంబునఁ బడకుండుట కై తదాధారరూపంబు గైకొనిన యట్టి నారాయణమూర్తి నిజతేజంబున బాహ్యాంతరంబు లాక్రమించి యంత విరాడ్రూపంబు గైకొని పుండరీకవిశాలనయనుండును, గంబుకంధరుండును, విశాలవక్షస్సముజ్జ్వలుండును, గరచతుష్కోపశోభితుండును, సర్వలక్షణసమేతావయవపరిపూర్ణుండును, రత్నకిరీటాంగదహారకుండలగ్రైవేయక కౌస్తుభాభరణుండును శ్రీవత్సవనమాలాంగుళీయక పీతాంబర హేమరశనావిభూషితుండును నై జలతత్త్వం బగు శంఖంబును, తేజస్తత్త్వం బగు సుదర్శనంబును, నభస్తత్త్వం బగు నందకంబును, వాయుతత్త్వం బగు శార్ఙ్గంబును, గర్మమయంబు లగు బాణంబులును ధరియించి కాలపురుషరూపం బగు గదఁ గేలం బూని నిత్యానపాయిని యైన లక్ష్మీరూపం బగు యోగమాయకు నాశ్రయం బై సర్వవ్యాపకుం డగుటం జేసి విష్ణునామంబుఁ గైకొని ఛత్త్రంబును జామరంబును శయనంబును నాసనంబును నుపధానంబును నుత్తరీయంబును బాదుకంబులును నై నిజశరీరభేదంబున శేషనామంబు గల పన్నగేంద్రభోగం బను దివ్యమంగళతత్త్వంబున శయానుండై పరబ్రహ్మనామంబున నట్టి హిరణ్మయాండాభ్యంతరంబుననుండి తత్పయోరాశిమధ్యంబున యోగనిద్రావశుం డై యుండె నాసమయంబున 46

క. ఆవిష్ణుని నిర్మలనా
భీవనరుహమందు భువన • బీజాంకురజ
న్మావాసహేతు వన నే
నావిర్భూతుండ నైతి • నాత్మభవుఁడ నై. 47

వ. అయ్యవసరంబున. 48

క. ఆపరమమూర్తి నిజమా
యావరిషిక్తాత్ముఁ డగుచు • నతిముదమున ని
ద్రాపరవశుఁ డై యుండ స
మాప్లుతతత్కర్ణయుగళ • మలసంభవు లై. 49

క. మధుకైటభు లను రాక్షసు
లధికబలోద్దాము లగుచు ♦ నంతట నస్మ
ద్వ్యథసేయఁ జూని నప్పుడు
విధివశమున నిద్రఁ దెలిసి ♦ విష్ణుం డచటన్. 50

గీ. పవ్వళించియుండి ♦ బాహుద్వయంబున
వారితోడ యుద్ధ ♦ వైభవంబు
సలుపు నంత దివ్య ♦ సంవత్సరంబులు
నూఱుపదులు చనియె ♦ నూత్నచరిత! 51

శా. ఆరాత్రించరవీరఘోరకదన ♦ వ్యాపారసత్వోద్ధత
శ్రీరాజత్కరపంకజోజ్జ్వలుఁడు ల ♦ క్ష్మీనాథుఁ డాదైత్యులన్
వారింపంగ నుపాయముం దలఁచుచో ♦ వా రాత్మలన్ మెచ్చి కో
పారంభంబులు మాని సత్యవచన ♦ వ్యాహర్తలై రిట్లుగన్. 52

క. వెయ్యేఁడులు బహుబలమునఁ
గయ్యంబొనరించు నీదు ♦ ఘనవిభవముతో
నెయ్యముగ వరము నొసఁగెద
మెయ్యది వాంఛింపవలయు ♦ నిచ్చెద మిర్వున్. 53

మ. అనినన్ వారలతోడ నిట్లనియె న ♦ త్యంతంబు తత్పుండరీ
కనవాక్షుం డసురేంద్రులార మహిత ♦ ఖ్యాతిన్ మదీయాయుధం
బునమీరల్ మృతినొందఁగావలయు స ♦ న్మోదంబుతో వాంఛితం
బన నీ యొక్కటియే వరం బడిగెదన్ ♦ వ్యక్తంబుగా నియ్యెడన్. 54

క. ఈరీతిని వర మడిగిన
నారాయణమూర్తితోడ ♦ నయమొప్పఁగ నా
ఘోరాసుర వరు లిట్లని
రార్యాభాషిని మాట దిరుగ ♦ నాడక దృఢులై. 55

క. వర మిచ్చెద మని పలికిన
వర మడిగితి మనఘ నీకు ♦ వలసిన యట్లా
వర మొసఁగితి మిఁక నీ వొక
వర మియ్యగవలయు మాకు ♦ వనజదళాక్షా! 56

మ. మెఱుఁగుల్ గ్రాలెడి వేఁడిశస్త్రములచే ♦ మిన్నందుచున్ జ్వాలలన్
దఱుచై మండెడు వహ్నిచే నొరులచే ♦ తంగాక సంప్రీతితో
నెఱి నస్మద్వధ సేయఁగావలయు ని ♦ ర్నీరప్రదేశంబునన్
వర మిట్లియ్యఁగఁజాలితేని యశముల్ ♦ వర్ధిల్లు నీకియ్యెడన్. 57

వ. ఇట్లు మధుకైటభులు ప్రార్థించిన నంత నారాయణుం డట్ల చేసెద నని తదీయశిరంబులు కరంబులం బట్టికొని యంతరిక్షంబున నొండొంటితోఁ బట్టు వగులం దాఁకించిన నాక్షణంబ తద్దనుజవీరులు మృతిఁ బొంది సందియంబు లేక విష్ణుసాయుజ్యంబు నొందిరి. అంతఁ దచ్ఛిరంబులవలన నుడుగక వెడలు మేదోరక్తంబు జలమధ్యంబునం బడి తెట్టువ గట్టిన నది మేదిని యనం బరఁగె నయ్యెడ నప్పరమపురుషుండు కూర్మాకారంబు ధరియించి తదాధారం బై నిలిచి యండమధ్యభారభరణంబునకు నిజాంశం బైన శేషాకారంబును తదోర్వీభారభరణంబునకు నణిమాదిగుణాంశనిర్మితంబు లగు నెనిమిది దిగ్గజంబులను నియమించి యమ్మేదినీమండలంబు చలనంబు నందకుండెడు నట్లుగా హృదయాంశంబు లగు మేరుమందరహిమాచలమాల్యవత్పారియాత్రగంధమాదనవింధ్యాదిపర్వతంబులు కీలాభావంబునఁ గీలుకొలిపిన నంత నమ్మేదినికి నచల యను నామంబు గలిగె మఱియును. 58

గీ. అట్టి మధుకైటభాసుర ♦ హననసమయ
విపులతామససంజాత ♦ విష్ణురోష
మణఁగ నేరక తద్దేహ ♦ మందు వెడలి
రుద్రుఁ డనఁ బరఁగెను ఘోర ♦ రూప మంది. 59

క. ఆరుద్రుఁడు నిజరౌద్రా
కారంబు ధరించి వివిధ ♦ గర్జనముల ది
గ్దారుణి వణఁకఁగ నప్పుడు
నారాయణమూర్తిఁ గాంచె ♦ నతకంధరుఁడై. 60

క. హృదయంబున సుజ్ఞానం
బొదవఁగ నారుద్రుఁ డంత ♦ యుక్తవయస్సం
పదఁ బొదలుచుఁ దన్మూర్తిని
గదిసి నుతింపం దొడంగె ♦ ఘనవాక్ప్రౌఢిన్. 6

చ. పరమపరాపరార్ధపర ♦ పారగ సర్వనివాస సంతతా
పరిమితసద్గుణాకర కృ ♦ పారసపూరితనేత్ర పద్మభూ
వర బహురూపభక్త జన ♦ వత్సల నిత్యవిహారవైభవా
కర దురితౌఘనాశక వి ♦ కారవిహీన జయాతినిర్మలా! 62

సీ. అలఘుపాపౌఘతూ ♦ లాచలంబులకును
ననలంబు మీ నామ ♦ మఖిలజనక
గతజన్మసంచితా ♦ ద్భుతకర్మలతలకు
నవలవిత్రంబు మీ ♦ నామ మనఘ
చిరకాలజనితదు ♦ ష్కృతతమిస్రములకు
నరుణుండు మీ నామ ♦ మబ్ధిశయన
దారుణసంసార ♦ నీరదంబులకును
ననిలంబు మీ నామ ♦ మంబుజాక్ష
యనయమును యుష్మదీయనా ♦ మామృతంబుఁ
గ్రోలియును దృప్తి నొందని ♦ రూఢమతులు
సంతతాపాయరహితులై ♦ సత్యమైన
పదము నొందుదు రధికప్ర ♦ పత్తిఁ బొదలి. 63

క. పరతత్త్వ మనిన నీవే
పరమేశుఁడ వనిన నీవె ♦ బ్రహ్మాండములన్
బరిపూర్ణుఁ డనిన నీవే
పరమజ్ఞానస్వరూప ♦ భాసురచరితా! 64

క. ఏఁ జేయవలయు కార్యం
బీజగమున నెద్దియాన ♦ తీయఁగవలయున్
దేజోమయ సర్వాత్మక
రాజితపద్మదళనేత్ర ♦ రమ్యచరితా! 65

వ. అని యిట్లు రుద్రుండు విన్నవించు సమయంబున నప్పరమపురుషుం డగు నారాయణుని దివ్యమంగళదేహంబువలన నొక్క తేజంబు వెడలి తమోవికారం బగు నది కాంతావికారంబుఁ గైకొని భృకుటిదంష్ట్రాకరాళవదనయు దివ్యాయుధసమేతయు రక్తచందనమాల్యాంబరభూషణధారిణియు శంఖచక్రశూలడమరుపాశాంకుశశరచాపసముజ్జ్వల కరాంబుజయు నై ఘోరాకారంబున నిలిచె నిలిచిన నట్టి మహాశక్తి నవలోకించి యప్పుండరీకాక్షుండు రుద్రున కిట్లనియె. 66

సీ. అతిరౌద్రరూపని ♦ ర్గతుఁడ వైతివి గాన
రుద్రనామమునీకు ♦ రూఢమయ్యెఁ
బరఁగ మన్నామజా ♦ పకుఁడ వై వర్తింప
నలరెదు మృత్యుంజ ♦ యత్వమనఘ!
సంభవించిన చరా ♦ చరరూపవిశ్వంబు
నియత మై నీచేత ♦ లయము నొందు
నీతమోమయదేహ ♦ మే కాంత యై భవ
ద్దేహార్ధమున నిల్చుఁ ♦ దెల్వి మెఱయఁ
త్రిజగదుదయావనవ్యయ ♦ త్రితయరూఢ
గతిరజస్సత్త్వతమములం ♦ దతిశయిల్లు
నట్లుగావున సర్వల ♦ యంబులకును
గర్త వై మెలఁగవలయు ♦ గరిమ రుద్ర! 6

క. అనయంబును దామసగుణ
మునఁ బొదలక సాత్త్వికప్ర ♦ ముదితాత్ముఁడ వై
యనిమిషులు గొల్వఁ గాఁ ద్రిభు
వననాథుఁడ వగుచుఁ దిరుగ ♦ వలయు మహేశా!

గీ. ఏను నీవు ననఁగ ♦ నీభేద మాత్రయం
దనువుపడదు గుణము ♦ లందుఁ గాని
బాహ్యభేద మేమి ♦ భావింప హృద్భేద
మెడలకుండు మైక్య ♦ మీక్ష సేయ.

వ. అది గావున నీవు మేరుశైలంబునకు రజతశృంగంబై విలసిల్లు కైలాసనగంబున నివాసంబు సేయవలయు నని విష్ణుం డానతిచ్చి యారుద్రునకుఁ దేజస్తత్త్వం బగు మహాశూలంబును, ఆకాశతత్త్వం బగు డమరుకంబును, వాయుతత్త్వం బగు వృషభవాహనంబును నొసంగె నంతఁ దత్తమోమాయారూపంబై రుద్రాణి యనం బరఁగిన సంహారశక్తి యోగవశంబున సహస్రరూపంబులం బొంది తద్రుద్రశరీరభవంబు లగు రోమకూపంబులం దావిర్భవించిన యంతన మృత్యుంజయుండు శక్తిసమేతుండగుటం జేసి జగత్సంహారకారణబలపరాక్రమసమేతుండై తదాజ్ఞ నంగీకరించి నారాయణనామస్మరణంబు సేయుచుఁ గైలాసపర్వతంబునకుం జనియె నయ్యవసరంబున నేనును దన్నాభిసరోరుహకర్ణికామధ్యంబున నాసీనుండనై తేజోమయం బగు తద్విష్ణుదేహంబు నిరీక్షింప నశక్తుండనై పరితాపంబు నొందుచు భారంబునం దదీయనామస్మరణంబు సేసి.

క. జయ జయ కైటిభమర్దన
జయలోకశరణ్య సర్వ ♦ జగదవనపరా
జయ సతతపరమపావన
జయ భాస్కరకోటితేజ ♦ జయ సర్వేశా. 71

గీ. సూక్ష్మమునకుమిగుల ♦ సూక్ష్మంబవగుచును
ఘనతరంబునకును ♦ ఘనమవగుచుఁ
గట్టు వడని నిన్నుఁ ♦ గనఁ కతో మాయాభి
బద్ధుఁ డందు రెట్లు ♦ పరమపురుష! 72

క. కారణ కార్యసమేతుఁడ
వైరూపిగఁ ద్రిభువనముల ♦ నతివేగమునన్
నీరధినడుమను నిలిపిన
నేరుపు లోరులకును గలవె ♦ నీకుం దక్కన్. 73

క. మృగనాభి గంధసహితం
బగు వస్తుచయంబు లెల్ల ♦ నతిశయనిజగం
ధగరిమఁ బొదివిన క్రియ నీ
జగములు నీవలన వికృతిఁ ♦ జనుఁ బరమేశా! 74

మ. జలతత్వంబు సృజించి యందును నిజే ♦ చ్ఛావేశసంసృష్టిని
ర్మలహేమాండము నప్రయాసమున సా ♦ మర్థ్యంబుతో నిల్పి యు
జ్జ్వలరూపాకృతిఁ బొంది శేషశయనా ♦ వాసుండ వై యుంటి వీ
బల మెవ్వానికి నైనఁ గల్గునె దయా ♦ పారీణ లక్ష్మీశ్వరా! 75

సీ. సిరికి నాథుండ వై ♦ చెలఁగి యుండెడు చోట
నైశ్వర్య మేమని ♦ యభినుతింప
నఖిలలోకములు నీ ♦ యాత్మలోపల నుండఁ
బౌరుషం బేమని ♦ ప్రస్తుతింప
శతకోటిభానుతే ♦ జస్సమేతుఁడ వైన
నీ తేజ మేమని ♦ నిర్ణయింప
నమితభూతాధార ♦ మై ప్రవర్తించు మీ
ప్రాభవం బేమని ♦ పలుకరింప
మృద్వికారంబు లెల్లను ♦ మృద్భవంబు
లయ్యు నంతర్గతంబు లై ♦ యణఁగు మాడ్కి
నిట్టి యావిర్భవాపాయ ♦ హేతురూప
మైన నిను నన్నుతించెద ♦ నంబుజాక్ష! 76

శా. జాతివ్యక్తుల మాడ్కి ద్రవ్యగుణముల్ ♦ సంధిల్లు చందంబునన్
సాతత్యంబుగ నీవు విశ్వ మన నా ♦ శబ్దప్రభేదంబుతోఁ
జేతోవృత్తులఁ గానుపింతువు తుదిన్ ♦ జిహ్మంబు గావింతు వి
మ్మై తత్వస్థితి నొంది యుండుదువు నీ ♦ వన్యక్రియాశూన్యతన్. 77

ఆ. ఈ జగంబులోన ♦ నింతైనఁ బరికింప
సూది మొనకు మోపఁ ♦ జోటు లేక
నిలిచి వివిధమైన ♦ నీమహాతేజంబు
నొరుల కెఱుఁగ వశమె ♦ దురితహరణ! 78

చ. కఱకున ఘోరదానవులు ♦ గ్రక్కున వార్ధి జనించి వచ్చినన్
హరివరరమ్యభోగశయ ♦ నాంతరమందునె పవ్వళించి యో
గరసనిషేకసంభవసు ♦ ఖశ్రితమానససంయుతుండ వై
కరముల నప్రయాసమునఁ ♦ గయ్యము సేయుచు నంతలోపలన్. 79

క. అధికు లగునట్టి దనుజుల
వధియించితి వీశ యింక ♦ వసుధను జనులున్
మధుకైటభారియని మి
మ్మధికృతులు తలంచి చనుదు ♦ రర్హస్థితికిన్. 80

వ. దేవా! భవదీయగుణంబు లనంతంబగుటం జేసి యస్మదాదులకు వర్ణింప మనోవాగ్గోచరంబులు గావు. ఇట్టి యెడం బాషాణంబులు తేజోవిశేషంబులం బొదుగుడువడి మణులనం బరఁగి మహారాజమాన్యంబు లగు చందంబున జీవులు హేయంబు లైన పార్థివశరీరంబులు ధరియించి భవత్పాదాంబుజాద్వితీయనిశ్చలభక్తిచే వన్నెయ కెక్కి భాగవతు లనం బరఁగి భవన్మాన్యు లై వర్తింతు రఖిలభూతానివాసా శతకోటిభాస్కరప్రభాసమేతుండ వయ్యును ద్రిభువనోత్పాదనార్థంబు సారాకారం బగు లీలామానుషవిగ్రహంబు ధరియించిన యుష్మదీయాకారంబు దర్శింప సమర్థం బగు దివ్యదర్శనంబు దయసేయు మని ప్రార్థింప నిజ రూప దర్శనప్రభావసమేతంబగు దివ్యదృష్టి కృప సేసిన నే నప్పుడు మదనశతకోటిరూపలావణ్యవిలాసవిభ్రమ సముద్భాసితంబును గటక కేయూర కంకణాంగుళీయక హార కౌస్తుభ శ్రీవత్సమకరకుండలరత్నకిరీటదివ్యభూషణభూషితంబును, పీతాంబరరశనావిరాజితంబును దివ్యచందనచర్చాసమన్వితంబును, శంఖగదాపద్మశార్ఙ్గాదిదివ్యాయుధసమేతకరచతుష్కపశోభితంబును నగు తద్రమాకాంతు దివ్యమంగళాకారంబు విలోకించి తదీక్షణసంజనితసుఖపారవశ్యంబున దేహంబు మఱచి తదాయత్తమానసుండ నై యున్న యెడ నప్పరమమూర్తి పుత్రభావంబుగ నన్నుఁ బరమదయావాత్సల్యంబున నీక్షించి యిట్లనియె. 81

క. పంకజసంభవ నీ విఁక
శంకారహితుండ వగుచు ♦ సకలజగంబుల్
సంకోచింపక నిలుపుము
పొంకంబునఁ దత్ప్రబుద్ధ ♦ బుద్ధినుతుఁడ వై. 82

క. తారుకొని యేనె జగములు
నారూఢి సృజించువాఁడ ♦ నందు సహాయ
ప్రారంభములకుఁ దలఁపఁగఁ
గారణమాత్రంబు నీవు ♦ కమలజజన్మా. 83

క. పరముఁడ నేఁ బూర్వుఁడ నై
పరగఁగఁ దచ్ఛబ్దపూర్వ ♦ పరరహితుఁడ నై
పరిపూర్తిఁ బొంది త్రిజగ
త్పరితృప్తిగ నిల్వ వలయుఁ ♦ వాగ్విభవ మెప్పన్. 84

గీ. బ్రాహ్మమానమునను ♦ బరిపూర్తి నూరేండ్లు
వృద్ధిఁ బొంది యంత ♦ సృష్టినాశ
సమయ మందు భూత ♦ సంఘంబు గెడిగూడి
క్రమ్మఱంగ మమ్ముఁ ♦ గలయవలయు. 85

క. పొడవుల కెయ్యది మిక్కిలి
పొడ వగు బ్రహ్మాండమందుఁ ♦ బొలుపుగ నచటన్
గడువేడ్క నిల్వ వలయును
నెడపక సదసద్వివేక ♦ హితవాగ్విభవా ! 86

క. సర్వజ్ఞుఁడ నై త్రిజగ
న్నిర్వహణసమర్థశక్తి ♦ నియతుఁడ వగుచున్
సర్వాంతరస్థితుండును
సర్వాతీతుం డనంగఁ ♦ జనియెదు పుత్రా. 87

క. ఏ కార్యం బెచ్చోటను
నీకును శక్యంబు గాక ♦ నిలుచును జగమం
దా కార్యం బచ్చోటను
జేకొని యేఁ దీర్చువాఁడ ♦ సిద్ధము తనయా ! 88

క. ఆయతగతితో నాదవెడి
మాయలకును లోను గాక ♦ మహనీయము లై
నీ యందు మద్విభూతులు
పాయక వర్తించుఁ గాక ♦ పరమార్థము లై. 89

క. ఏ వంక నైన జగముల
భావింప నశక్యకార్య • భారము లొదవన్
రా వలసిన పని గలిగిన
రా వలయును బుధులఁ గూడి • ప్రాముఖ్యమునన్. 90

వ. అని పుండరీకాక్షుం డాన తిచ్చి యంతర్ధానంబు నొందిన నంత మహాంధ
కారంబు దోఁచె నప్పుడు జ్ఞానవిహీనుండ నై యా వృత్తాంతంబు స్వప్న
ప్రాయంబుగాఁ దలంచుచు నజ్ఞునిమాడ్కిఁ బట్టు నూఁకువ యెఱుంగక త
న్నామస్మరణంబునందుఁ దలఁపు వెట్టి తత్తిమిరకబళితం బగు పయోరాశి
మధ్యంబునఁ బరిభ్రమించుచు నతిశ్రాంతుండ నై కొంత కాలంబునకు. 91

సీ. కనుఁగొంటి నొక చోటఁ • గాంతిచే విలసిల్లు
మణిమయప్రాకార • మండలంబు
నట విలోకించితి • నభ్రంలిహంబు లై
దీపించు నవరత్న • గోపురములు
చూచితి నంతను • జొక్కంబు లై మించు
తోరణోపరిగృహ • ద్వారతతులు
నీక్షించితిని బుణ్య • దీక్షావశాక్షీణ
మానవమాత్రిక కేతు • మాలికలను
వీక్ష చేసితి నవపుష్ప • వివిధగంధ
సన్నుతానేకకల్పభూ • జాతసహిత
విమలవనవాటికాసమ • న్వితమగుచు
నుదధినడుమను జెలు వొందు • నొక్క పురము. 92

వ. అయ్యుడం బ్రాకారసౌధతోరణధ్వజకేళీవనవిరాజితం బై యానందకందం
బై సొంపులగు సంపదలకుఁ దానకం బై విభవంబుల కాలయం బై మంగ
ళంబులకు నివాసం బై సౌభాగ్యంబులకు మనికిపట్టై పుణ్యంబులకు నికేత
నం బై తెలివొందు నట్టి పట్టణంబుఁ జేరం జను నంత సహస్రవర్షపర్యం
తంబుగఁ గాలంబు దోఁచె నంతఁ దత్పురప్రవేశంబు చేసితిఁ దత్సౌభా
గ్యం బెట్టి దనిన. 93

సీ. సౌధకీలితరత్న ♦ శకల మొక్కటి చాలు
భాస్కరతేజంబు ♦ పరిహసింపఁ
బోలుపొందు నవజాత ♦ భూజ మొక్కటి చాలు
నఖిలలోకముల కి ♦ ష్టార్థ మొసఁగ
నభినుతింపఁ గను వా ♦ మాక్షి యొక్కతె చాలుఁ
గ్రతుభోజనాంగనా ♦ గర్వ మడఁపఁ
బరికింప నచ్చోటి ♦ పురుషుఁ డొక్కఁడు చాలు
నస్మదాదుల కని ♦ త్యతను దెలుప
మహిమతో ని ట్లలోకసా ♦ మాన్యధర్మ
ములకుఁ దానక మయ్యుఁ బ్రి ♦ మోద మొదవ
వివిధపరిపూర్ణ మై నిత్య ♦ విభవములకుఁ
దానకం బన విలసిల్లుఁ ♦ దత్పురంబు.

క. అతులితముగ నిజమణిబిం
బితజగములచేత నందుఁ ♦ బృథుతరపురముల్
వితతరమాధిపసారూ
పతతు లాలయ వెలయు సర్వ ♦ పరిపూర్ణము లై.

వ. మఱియును.

సీ. ఎచ్చోటఁ జూచిన ♦ న చ్చోట వేదాంత
పరమరహస్యముల్ ♦ వలుకువారు
నే వంకఁ బరికింప ♦ నా వంక లక్ష్మీశు
సద్గుణంబులగోష్ఠి ♦ నలుపువారు
నే వీథి వీక్షింప ♦ నా వీథి సంగీత
ములఁ బుండరీకాక్షుఁ ♦ గొలుచువారు
నే వేదిఁ బరికింప ♦ నా వేదికలయందు
శ్రీరమావిభునిఁ బూ ♦ జించువారు
నగుచుఁ దత్పురనిలయు లై ♦ నట్టి జనులు
శంఖచక్రాబ్జశార్ఙ్గహ ♦ స్తములతోడ
సర్వకాలము సంతోష ♦ సహితు లగుచుఁ
జెలఁగు చుందురు విభవప్రి ♦ సిద్ధితోడ.

క. నిరుపమ వైభవ శోభా
కర మై సన్మంగళప్ర • కరరాజిత మై
హరిభక్త పూజితం బై
తిర మగు తత్పట్టణంబు • దివ్యమునీంద్రా! 98

మ. తరుణుల్ తత్పురపుష్పవాటికలలోఁ • దారస్వరం బొప్ప సు
స్థిరలీలన్ హరిఁ బుండరీకనయనున్ • శ్రీమానినీనాయకున్
బరమప్రీతినిఁ బాడుచున్నయెడఁ దత్ప్రాసాదశాఖాగ్ర సం
తరభృంగావళి స్వేయు గానములు త • త్తద్వాక్య సంపన్న మై. 99

క. కదియవు తత్పురవాసుల
మదమును లోభంబు క్షుధయు • మాత్సర్యంబున్
మదనవికారముఁ గ్రోధము
నదలును నను పరికృతిజంబు • లగు దుర్గుణముల్. 100

వ. మఱియును. 101

సీ. ప్రాకారగోపుర • ప్రాసాదనవరత్న
దీప్తు లంబరముపైఁ • దేజరిల్ల
వర్ణితమందార • వనపుష్పవాసనల్
ఘుమఘుమాయితము లై • గుబులుకొనఁగ
నాట్యక్రియాసను • న్నతమృదంగధ్వనుల్
సౌధాగ్రగృహముల • సందడిలఁగ
సాధిష్ఠశీతల • చ్ఛాయాకరంబు లై
గరుడకేతనములు • గ్రందుకొనఁగ
మాసపక్షర్తుదివసప్ర • మాణసహిత
మగుచుఁ బరిపూర్ణవిభవాశ్రయంబు శోభ
నాలయంబును నిత్యంబు • ననఁగ జగతి
నిరుపమం బయి వెలయుఁ ద • త్పురవరంబు. 102

క. కనుగొంటి నట్టి పట్టణ
మున వివిధమణిప్రభాస • మూహంబులచే
తను మిన్నుముట్టి తనరెడు
ఘనశైలము లొకట నాల్గు • కమనీయములై. 103

వ. ఇట్లఖిలమంగళాశ్రియం బై యతివిస్తృతం బగు తత్పురంబునం గలుగు విశేషంబులం గలయ నవలోకించి తత్పురవాసులచేత జాతివిహీనునిచం దంబున నసంభాషితుండ నై హృదయజనితసంతాపంబునం గుందుచు నంత నొకట విజనప్రదేశంబున సమాసీనుండ నై క్రమ్మఱం దత్పుండరీకాక్షప్రసాదంబున సుజ్ఞానంబు నొంది నయనంబులు ముకుళితంబు సేసి బాహ్యంబు మఱచి హృదయపద్మంబునం బూర్వదృష్టం బగు నప్పరమపురుషుని దివ్యమంగళవిగ్రహంబు ధ్యానంబుసేయుచుం దిదాయత్తచిత్తుండనై.

సీ. ఓ పుండరీకాక్ష! • యోజగన్నాయక!
యోసుదర్శనహస్త! • యోముకుంద!
యో రమాధీశ్వర! • యోభక్తమందార!
యో నిత్యకల్యాణ! • యో కృపాత్మ!
యో సత్యసంకల్ప! • యో సర్వలోకేశ!
యో కౌస్తుభాంకిత! యో పరేశ!
యో కైటభాంతక! • యో మంగళాకార!
యో వైభవాశ్రయ! • యో పవిత్ర!
యో సదానందమయరూప! • యో గుణాఢ్య!
యో సహస్రార్కసమతేజ • యో నిధీశ!
యోధరాధరధారణా! • యో విశాల!
భక్తుఁ డగు నన్ను దిగనాడఁ • బాడి యగునె? 105

చ. తిరమున మీగుణంబులను • తింపక మోహవిమోహితుండనై.
తిరిగితిఁ బెక్కు వర్షములు • దీనుఁడనై విపులాంధకారసా
గరమున ఘోరసాధ్వసవి • కారసమన్విత మానసుండనై
సిరులు దలిర్ప నింక దయ • సేయుము నన్ను రమామనోహరా! 106

క. శరణాగతరక్షకుఁ డను
బిరుదుం గలవాఁడ వండ్రు ♦ పృథులచరిత్రా
శరణాగతుండ నగు నను
స్థిరముగఁ గరుణింప వలయు ♦ శేషశయానా !. 107

వ. అని యిట్లార్తుండ నై తద్గుణంబులు గొనియాడి నయనయుగంబులు తెఱ
చి నప్పుడు తొల్లింటియట్ల యేనుఁ దన్నాభీసరోజంబునఁ బద్మాసనాసీనుం
డ నై పొడుకొని క్రమ్మఱ నప్పరమపురుషు నవలోకించి తద్దర్శనామృత
ధారాసిక్తశరీరుండ నై గతశ్రమంబున నొకచ్చెరు వంది. 108

చ. పరమపరార్థరూప ! గుణ ♦ భాసుర ! నిత్యనివాసవైభవా
కర ! కరకాంతచక్రరవి ♦ ఖండితశత్రుసమూహ ! వార్ధిజా
వర ! వరమంగళాశ్రయ భ ♦ వప్రియ కౌస్తుభభూషణావళీ
ధర ! ధరణీశ ! నీ విపుల ♦ తత్వము నన్యు లెఱుంగ నేర్తురే. 109

క. నిరుపమ వైభవ కరుణా
పరిపూరితనయన లోక ♦ పాలక లక్ష్మీ
వర భక్తవరద యెవ్వఁడ
నురవడి మీ మాయఁ దెలియ ♦ నొరులకవశమే. 111

సీ. గాఢాంధకారసా ♦ గరమునఁ బెక్కేండ్లు
దృఢసాధ్వసంబునఁ ♦ దిరిగితిరిగి
శోకమోహంబుల ♦ నుడిఁగొని చిత్తంబు
కలఁగి పొడుకురాగఁ ♦ గళవళింప
శాంతుఁడ నై యుండి ♦ సౌధగోపురమణి
ప్రాకారతోరణ ♦ ప్రాజ్య మైన
పురరాజ మొకటి ♦ పొలుపుతో నీక్షించి
తన్మధ్యమంబునఁ ♦ దరణికోటి
కాంతిసందీప్తమణిగణో ♦ త్కరము లైన
శైలములు నాల్గు గనుఁగొంటి ♦ సత్యచరిత
దీని వృత్తాంత మంతయు ♦ వివరపట్టఁ
దెలుపవలయును లోకేశ ♦ జలధిశయన. 110

వ. ఇవ్విధంబున స్తుతిపూర్వకంబుగా నే విన్నవించిన వచనంబు లాకర్ణించి మందస్మితవదనుం డై దశనద్యుతు లధరంబుపైఁ దళుకొత్తఁ గూర్మినలు పుచు నట్టి పరమతేజోమయమూర్తి నన్నవలోకించి యిట్లనియె. 112

సీ. కమలజ విలసిల్లు • గాఢాంధకారసా
గరమునఁ దిరుగ నా • కఱటి క్షణంబు
కాలంబు చనియెఁ ద • తాత్కాలంబు నీకును
వేయేండ్లు నై తోఁచె • విస్మయముగ
నాత మోరూపమై • నదియె యన్మాయాప్ర
భావంబు దాననే • ప్రబలె జగము
మోహాంధమై నాశ • మును నుద్భవంబును
నొందు నకుంఠితో • ద్యోగసరణి

గీ. నచట నీచేత దృష్టమై • నట్టి పురము
మన్నివాసంబు వైకుంఠ • మందిరంబు
చతురతత్పురమధ్యమాం • చితము లైన
ధరణిధరములు నాల్గు వే • దంబు లనఘ! 113

శా. నీ వీ తత్వ మెఱుంగు మబ్జభవ యే • నీకుం బ్రపంచించెదన్
భావంబందు మదీయపాదయుగళీ • భక్తిప్రసన్నాత్ములై
ధీవర్యుల్ గతపాపు లై యమరు లై • దివ్యాకృతిప్రఖ్యులై
యా వైకుంఠపురంబు నొందుదురు ని • త్యానందసంపన్ను లై. 114

క. ఆ దివ్యనగరి నడుమను
చాదుగ విలసిల్లు రత్న • పర్వతములు నా
వేదంబులు నీ విఁక విను
ప్రాదుర్భూతంబు లందుఁ • బద్మజ జగముల్. 115

గీ. అట్టి వేదరాసు • లగు సత్స్వరూపంబు
లందు నిశ్చితార్థ • మాచరించి
చనఁగ నేర్చు మనుజు • లనిమిషాధిపవంద్యు
లగుచు ముక్తిఁ బొంద • నరుగువారు. 416

వ. అని యానతిచ్చి పుండరీకాక్షుండు మఱియు నిట్లనియె. 117

మ. అదెదర్శింపుము సర్వలోకములక ♦ గ్రగ్యంబై మహావైభవా
స్పదమై యొప్పెడు బ్రహ్మలోక మచటన్ ♦ బ్రఖ్యాతితో నిత్యసం
పదలం బొందుచు సృష్టికర్త వగుచున్ ♦ మద్భక్తియుక్తుండవై
విదితప్రజ్ఞను సిల్వఁగావలయు భా ♦ వింపంగ నీ వాత్మజా! 118

క. నారాయణనామము నీ
వారూఢిగఁ దలఁపవలయు ♦ నది మద్రూపం
బై రచితములకు నెప్పుడుఁ
గారణమై వెలయుచుండుఁ ♦ గమలజనిలయా! 119

క. ప్రణవాదిచేసి నారా
యణనామచతుర్థి తుదిగ ♦ నట మధ్యమునన్
బ్రణతిప్రకాశకం బగు
మణిమయశబ్దంబు చొనుప ♦ మంత్రము పుత్రా! 120

క. ఈ యష్టాక్షరిమంత్రము
ధీయుతులై పఠనసేయు ♦ ధృతిమంతులు మ
త్సాయుజ్యముక్తిఁ బొందుదు
రాయాసవిహీను లగుచు ♦ నతిమోదమునన్. 121

గీ. మత్సహాయమైన ♦ మహనీయశక్తియు
సర్వవేదవిదిత ♦ సారమతియు
విభవపూర్ణమైన ♦ విశ్రుతాయుష్యంబు
గలుగవలయు నీకుఁ ♦ గమలజన్మ. 122

వ. అని యానతిచ్చి యప్పుండరీకాక్షుండు నిజమహత్వంబు నాకు దృష్టంబు సేయుటకై విశ్వపూర్ణరూపంబుఁ గైకొని సహస్రవదనుండును, సహస్రనయనుండును, సహస్రపాదుండును సహస్రశిరస్సమేతుండునై పదతలంబువలన శేషఖండ, సాఖండ, కూర్మఖండ, శ్వేతఖండ, బిలఖండంబులను పంచఖండసమేతం బగు పాతాళలోకంబును, నంఘ్రులవలన మార్దవంబు గల యొనిమిదవ మండలంబునకు గంధకాఠిన్యగుణంబులును, లవణేక్షు మధుక్షీరదధ్యాజ్యపానీయాదిసప్తసాగరంబులును, జంబూద్వీపకుశద్వీప శా

ల్మలిద్వీపప్లక్షద్వీపక్రౌంచద్వీపశాకద్వీపపుష్కరద్వీపంబులను సప్తద్వీపంబులును శైలకాననవిశేషంబులును, నాభివలన దారకాగ్రహనక్షత్రసమున్నతం బగు నంతరిక్షంబును శిరంబువలన గోలోకపితృలోకతపోలోకజలలోక తేజోలోక నరకలోక వాయులోక సాధ్యలోకంబులను నుపరిలోకంబులతోడ సముజ్జ్వలం బగు స్వర్గలోకంబును, మఱియుఁ బ్రాణంబులవలన సప్తమారుతంబులును ముఖంబులవలన ననలంబులును సృజియించి యంతఁ బాతాళలోకంబునకుఁ దామ్రికంకటవిశ్వకేతుదందశూకకరాళకేతుధూళికాపన్నగేంద్రులను భూలోకంబునకు ముఖంబువలన నరుల నలనఖంబులవలనను బిపీలికామశకాదులను హాసంబువలన గిరిభూరుహాదిస్థావరంబులను సృజియించి యంత స్వలోకంబునకు ముఖతేజంబువలనఁ జత్వారింశత్ప్రభేద దేవతాగణసహాయు లగు పురందరాది దిక్పాలకులను, మనంబువలన నిశాకరమండలంబును హర్షంబువలన మీనకేతనగంధర్వకిన్నరకింపురుషాప్సరోగణంబులను నిర్మించి యిట్లు పరిపూర్ణంబుగా స్థావరజంగమాత్మకం బగు మనస్సృష్టిఁ గావించిన నందు జంగమరూపంబు లగు జీవంబులు క్రమ్మఱయును మనోమయం బగు సృష్టినిర్మింప నుపాయం బెఱుంగక. 124

క. గగనమహీతలపాతా
ళగిరిజలాంతరములందు • లం దిరిగెడి త
త్ఖగమృగకీటకపశుప
న్నగములు వైరంబుతోఁ జె • నంగుచు సమసెన్. 124

వ. అంత. 125

సీ. వరుసతో విప్రాది • వర్ణసంభవు లైన
మానవోత్తములును • మాన్యు లైన
సురలు దిగ్వరులు కిం • పురుషులు సాధ్యులు
నప్సరోగణములు • యక్షతతులు
తల్లిదండ్రులమీఁదఁ • దనయులు మోహంబు
విడనాడలేని య • ట్లెడపకెపుడుఁ

దము సృజించిన రమా ♦ ధవుని పైఁ జిత్తంబు
నమకొల్పి సుజ్ఞాన ♦ సహితు లగుచు
బాహ్యవస్తుమోహ ♦ భావంబు విడనాడి
కామమదము లందుఁ ♦ గట్టువడక
ముదముతోడ నెనసి ♦ ముక్తులై తద్విష్ణు
దీప్తిఁ గలసి చనిరి ♦ ధీవరేణ్య! 126

వ. ఇట్లు పుండరీకాక్షు మనస్సృష్టినిర్మితులై లోకత్రయంబునం గలుగు నాగ మనుష్యసురేంద్రాదులు భక్తియోగంబున ముక్తులై తన్నుం గలిసిన.

గీ. మఱలఁ బురికొనఁగ ♦ మజ్జనకుం డగు
భగవదాఖ్యుఁ డైన ♦ పరముఁ డాది
విష్ణుమూర్తి నన్ను ♦ వీక్షించి ముదమునఁ
బలికెఁ గూర్మి మెఱయ ♦ భవ్యచరిత! 128

సీ. ఇలలోన ఖగమృగా ♦ దులు నిజాంశమ్ముల
మించసర్గంబు ని ♦ ర్మించలేక
వైరానుబంధప్ర ♦ వర్తనంబుల నవి
సమసెఁ గాలంబున ♦ సత్వ ముడిగి
నరదేవనాగకి ♦ న్నరముఖ్యు లెల్లను
హృదయముల్ ♦ మిక్కిలి పదిలపఱిచి
మత్పాదభక్తిమై ♦ మఱగంగ నడుకొల్పి
మఱి యన్యమెఱుఁగక ♦ మాన్యు లగుచు
జలము లెల్లను జలరాశిఁ ♦ గలయునట్లు
యత్నమున మత్సముద్భవు ♦ లగుటఁ జేసి
వారు బాహ్యప్రపంచసం ♦ చార ముడిగి
క్రమ్మఱను మమ్ముఁ గలసిరి ♦ కంజనిలయ. 129

క. పాయక యిట్లఖిలము మ
త్సాయుజ్యము నొందు నంత ♦ సకలజగంబుల్
శ్రీయుతము లగుచు శూన్యము
లై యున్నవి తమముచేత ♦ నాశాంతములై. 130

క. తొల్లింటియట్ల లోకము
లెల్లను బరిపూర్ణముగను • నింకను నీవు
ద్యల్లలితమతివిశేషతఁ
దెల్లమి సృజియింపవలయుఁ • దిరుగం బ్రజలన్. 131

క. నేరుపున సకలకార్యము
లారసికొని యేను దత్ప్రి • యత్నము లెల్లన్
సారసమ చేసి నిలిపెదఁ
గారణమాత్రంబు నీవు • కాంచనగర్భా. 132

క. అని యివ్విధమున లక్ష్మీ
వనితావరుఁ డానతిచ్చు • వాక్యము లెల్లన్
విని యా జగములు సృజియిం
పను వెఱ వెఱుఁగంగ లేక • భయసహితుఁడనై. 133

శా. ఈరీతి న్వచియించు నవ్విభునితో • నిట్లంటి నేనప్పుడ
త్యారూఢప్రతిభావిశేషమున హ • స్తద్వంద్వముల్ మోడ్చి యో
కారుణ్యాకర యేను బాలుఁడను స • ర్గప్రోద్భవాధారమై
సారస్యం బగు బుద్ధి యెట్లొదవుఁ ద • త్సామర్థ్యసంపన్నమై. 134

వ. అని పలుకు నెడ నప్పు డప్పరమనివాసుని దివ్యమంగళశరీరంబువలన నొక్క మహాతేజంబు వెడలి మదీయవదనద్వారంబులు ప్రవేశించి యిట్లనియె. 135

శా. ఏనెట్లెట్లన నీవు సర్వభువనా • ధీశుండవై సర్వవి
ద్యానంతప్రతిభాసమన్వితుఁడవై • యక్షీణమత్ప్రాప్తను
జ్ఞానాపూరితమానసుండవగుచున్ • సర్వజ్ఞతం బొందు ని
త్యానందప్రకృతిన్ సృజింపు మిఁక రే • తస్సృష్టి సర్వాత్మకా. 136

క. ఆ రేతోమయసృష్టికి
గారణ మగుఁ గర్మసమితి • కర్మములందుం
దారుకొని దేవమానవు
లారూఢిగఁ గట్టువడుదు • రంభోజభవా! 137

క. జననంబునకును మరణం
బునకును తత్కర్మసరణి ♦ మునుకొని రాఁగా
రణమున సుఖదుఃఖప్రద
మన వెలయును జీవకోట్ల ♦ కదిరభసముగన్. 138

క. ఆకర్మంబులఁ జెందక
లోకంబుల మత్పదాబ్జ ♦ లోలుపులయ్యున్
నీకును దలఁకక సంతో
షాకారులు చనుదు రవ్య ♦ యస్థలమునకున్. 139

క. జననముఁ బొందినఁ ద్విజగ
జ్జనమెల్ల మదీయనామ ♦ సంకీర్తనచే
సినమాత్రిన వసుధాతల
మునఁ దిరుగ జనింప రఖిల ♦ మునిజనవినుతా! 140

గీ. అట్టి జను లెల్లి వసుధాత ♦ లాంతరమున
మించి యెప్పుడుఁ దిరుగజ ♦ న్మించ కుండి
రపుడె సృష్టికి విఘ్నంబు ♦ లరుగు దెంచు
నట్లుగావున నిట్టివృ ♦ త్తాంత మెఱిఁగి. 141

సీ. దేవతాంతరమార్గ ♦ దీప్తంబు లగు నట్టి
పెక్కుశాస్త్రములఁ గ ♦ ల్పించి యందుఁ
జతురతతోడ న ♦ న్మద్విరోధకరంబు
లగు యుక్తు లెల్లను ♦ దగ నొనర్చి
మవిచూచి ఘనసంశ ♦ యాత్ములై జను లెల్ల
మోహంబు నొందియు ♦ ముక్తిమార్గ
కారణం బగు మమ్ముఁ ♦ గన నెఱుంగక దుఃఖ
వశమున దుర్గమ ♦ వసతులందుఁ
జేరి కర్మానుభవములు ♦ చేసి పిదపఁ
బుత్త్రదారాది మాయాభి ♦ పూర్ణులగుచు
సారవిరహితసంసార ♦ సాగరమునఁ
దిరుగుచును జన్మలయములఁ ♦ దెమలువారు. 142

క. ఈరీతి వివిధమతములు
చేరికగాఁ జేసి జనుల ♦ చిత్తము లెల్లన్
మీఱి కలఁగంగఁ జేయుము
వారికిఁ జననవ్యయము ల ♦ వశ్యము గలుగున్.

చ. అనవరతంబు సద్గుణము ♦ లాత్మఁ దలంచుచు జిహ్వలందు మ
ద్వినుతము లైన నామములు ♦ వేడుకతోఁ బఠియించునట్టిస
జ్జనులు గతాఘు లయ్యు సుర ♦ సన్నుతు లయ్యు జగంబులోఁ బున
ర్జననము లేక నిల్తు రిట ♦ సంతతనిత్యవిహారసక్తులై. 144

సీ. బాహ్యసంభవము నా ♦ భ్యంతరసంభవం
బన రెండువిధములఁ ♦ దనరు దుఃఖ
మందును రోగశ ♦ స్త్రాదిసంజాతంబు
బాహ్యదుఃఖం బది ♦ భౌతికంబు;
ఆభ్యంతరంబు పు ♦ త్రాదివియోగజం
బదియ భౌతికదుఃఖ ♦ మనఁ గఁ బరఁగు
నేతద్ద్వయాభావ ♦ మీక్షింప వారక
సుఖము సర్వేంద్రియ ♦ శుభకరంబు
వరుసతో నిట్లు దట్టమై ♦ వచ్చునట్టి
వివిధసుఖదుఃఖంబులు ♦ వీక్ష చేసి
వట్టిమోహంబు నొందక ♦ వలసి మమ్ముఁ
దలఁచువారలు మన్మూర్తిఁ ♦ గలయువారు. 145

గీ. సుఖము వచ్చిన మత్తిల్లి ♦ చొక్కపడక
దుఃఖ మొందిన దురపిల్లి ♦ తొట్రుపడక
నిర్మలం బగు బుద్ధిచే ♦ నిలిచి మమ్ముఁ
దలఁచు పుణ్యుండు నిలుచు మ ♦ ద్వసతియందు. 146

వ. మఱియు సాలోక్యసాకారసామీప్యసాయుజ్యంబు లన ముక్తి నాల్గువిధము లై పర్యవసించు నందు సమానలోకనివాసంబు సాలోక్యంబును, సుదర్శనపాంచజన్యాదిచిహ్నంబులు గలిగి మత్సమానరూపంబు గైకొనుట సాకారంబును మత్సన్నిధానంబునఁ గైంకర్యపరుం డై వెలుంగుట సామీప్యంబును మదీయతేజంబునం గలిసికొనుట సాయుజ్యంబు నగు న ట్లధికారవిశేషంబున మద్భక్తుండు తత్తత్పదంబులఁ బొందు నందు. 147

క. వాలాయం బగు భక్తిని
నాలుక తుద మమ్ముఁ బొగడు • నామాంకధరుల్
సాలోక్యముక్తిఁ బొందుదు
రాలస్యవిహీను లగుచు • నతిరభసమునన్. 148

శా. ఏకాలంబును మమ్ముఁ గూర్చి ఫలమం • దెందున్ విరక్తాత్ము లై
లోకాచారము లైన కర్మముల నా • లోకించి తత్కర్మముల్
సేకూరన్ వెస నాచరించు సుజనుల్ • శృంగారపుణ్యాత్ము లై
సాకారం బను ముక్తిఁ బొందుదురు రా • జత్పంకజాంతర్భవా ! 149

శా. కామక్రోధమదాదులం గెలిచి దు • ష్కర్మక్రియాశూన్యు లై
ప్రేమన్ వహ్నిజలాదులం దొనర మ • త్ప్రీత్యర్థ మై వేడ్కతో
ధీమంతుల్ మముఁ బూజసేసి గతసం • దీప్తాంగు లై మాన్యు లై
సామీప్యం బను ముక్తిఁ జెందుదురు భా • స్వన్మూర్తిసంపన్ను లై. 150

సీ. అనయంబు మన్నామ • మాత్మలోఁ దలఁచుచు
సత్యంబు వదలక • సాధువృత్తిఁ
దిరుగుచు దానంబు • దీనార్థితతులకు
నొసఁగుచు నత్యాశ • నొదుగువడక
సంతుష్టినొందుచు • శాంతు లై సర్వంబు
మునుకొని మద్రూప • మని యెఱింగి
పలుద్రోవ వీక్షించి • భావంబులోపల
సందియంబుల నొంది • చౌకపడక
గురుముఖంబున సద్భక్తిఁ • గుదురుపఱిచి
ధ్యానయోగప్రబలు లైన • యట్టిజనులు
జలము జలరాశిలోపలఁ • గలయునట్లు
తెలివి సాయుజ్యముక్తి నన్ • గలయువారు. 151

సీ. యజ్ఞాదినిత్యక • ర్మాచారవిధియును
దానంబు సత్యంబు • దమము శమము
దేవతాభజనంబు • తీర్థజలస్నాన
మాత్మశుద్ధియు నింద్రి • యముల గెలుచు

టనృతంబు విడుచుట ♦ హర్షంబు నొందుట
చేరి సజ్జననిందఁ ♦ జేయకుంట
గోవిప్రభక్తిసం ♦ భావితుం డగుచుంట
సర్వసమత్వంబు ♦ జరుపుచుంట
తఱచుగను వేదకౄలోదవ మ ♦ తకౄథలు వినుట
క్రోధభయము లణంగంగఁ ♦ గుదియఁ దిగుచు
టప్రియాసనసంప్రాప్తవ్య ♦ మందుకొనుట
కణఁకతో విను సుజ్ఞాన ♦ కారణములు. 152

గీ. ఈ జగం బెల్ల మిథ్యగా ♦ నైజిఁగికొనుట
జ్ఞాన మన నొప్పి నట్టి సు ♦ జ్ఞానగమ్య
మైనవస్తువ యని నన్ను ♦ నాత్మఁ దెలియఁ
బుణ్యమతు లెల్ల మత్పురిఁ ♦ బొందువారు. 153

క. నీ వఖిలభువనములకును
బావనుఁడవు మతకృపావి ♦ భాసితుఁడవు నే
నీవని చెరయం దొణఁగితి
నీవాక్యములఁ బరిగ్ర ♦ హింపుము తనయా! 154

క. రంగేశ! రంగసంగత
రంగప్రియ! రంగరాజ! ♦ రంగవిహారా!
రంగాధినాయక! శ్రీ
రంగాధిప! రంగనిలయ! ♦ రంగావాసా! 156

మాలినీవృత్తము.

కరధృతదరచక్రా! ♦ ఖండితారాతిచక్రా!
సురవినుతచరిత్రా! ♦ శోభితశ్రీకళత్రా!
దురితతిమిరమిత్రా! ♦ ధూపితారాతిగాత్రా!
పరిహృతఖలజాతా! ♦ భాగ్యవత్పారిజాతా! 156

గద్య.

ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాద సహజసారస్వతచంద్ర
నామాంక రామవిద్వన్మణికుమారాష్టఘంటావధాన వరవే-
శ్వర హరిభట్టారకవిరచితం బైన మత్స్యపురాణ
ఖండం బగు విష్ణుధర్మోత్తరంబునందుఁ
బ్రథమాశ్వాసము.



శ్రీ

# మత్స్యపురాణము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీరామానుజ మునివచ

నారూఢమత ప్రకాశ! యతులితవేదా

చారప్రసిద్ధరక్షా

పారీణకటాక్ష! రంగ పట్టణరాజా! 1

వ. అవధరింపు మిట్లు పుండరీకాక్షుం డానతిచ్చినఁ దదాజ్ఞ యే నంగీకరించి యప్పుడు తద్వేదపర్వతంబులు చేరంజని నాల్గుహస్తంబుల ముష్టిగ్రాహ్యం బులగు వేదంబులు గ్రహించిన నవి ఋగ్యజుస్సామాథర్వణంబు లయ్యె నంత నప్పరమమూర్తి దివ్యశరీరంబువలన లింగశరీరంబులు ధరియించి న జీవకోట్లనంతంబులై జనించిన. 2

క. మునుకొన్న యట్టి జీవులఁ

గనుఁగొని లక్ష్మీశుఁ డంతఁ గౌతుక మొదవన్

ననుఁ జూపి వానితో ని

ట్లనియెను దరహాసవికసి తాననుఁ డగుచున్. 3

గీ. ఇతఁడు పద్మభవుఁడు చతురాననుం డాత్మ

సముఁడు సర్వలోక శాశ్వతుండు

జీవులార! మీరు చిరకాల మితనిచేఁ

జోష్యు లగుచు మనుఁడు పోలుపుమిగిలి. 4

వ. అని యిట్లానతిచ్చి యా పరతత్త్వరూపంబగు కైటభమర్దనుండును వేద పర్వతసమేతం బగు వైకుంఠపురంబును నంతర్ధానంబు నొందె నంత నేను ను దత్ప్రసాదంబున నీ బ్రహ్మలోకంబున కరుగుదెంచి రేతోమయం బగు సృష్టి నిర్మింపం బూని భూబీజమిశ్రణంబున న్బుద్బుదజంబులై తరుగుల్మాదిరూ

పంబు లైన శరీరంబులను, నత్యుష్ణధరణిసంపర్కంబున స్వేదంబు లై క్రి
మిదంశకాదిరూపంబు లైన దేహంబులను, నండజంబు లైన పక్ష్యాదిశరీ
రంబులను జరాయుజంబు లైన మనుష్యాదిశరీరంబులను, సృజియించిన
యంతన జీవరాసులు చతుర్విధంబు లగు నాకారంబులం బొంది ఖేచరభూ
చరజలచరపాతాళచరాదిరూపంబులఁ బ్రవర్తించె నిట్లుసాంతత్యంబున రే
తోమయసృష్టి సమకూరె నని చెప్పిన విని నారదుం డిట్లనియె. 5

క. నరమృగపశుగర్భంబులఁ
దరబడి నీ జీవకోట్లు ♦ తోదూరిపములన్
దిరుగ జనించుట చిత్రము
సరసంబుగ నానతిమ్ము ♦ జలజాతభవా! 6

గీ. శుక్లబిందుపతిత ♦ శోణితంబువలన
శల్యరక్తమాంస ♦ చర్మరూప
సహిత మగుచుఁ దనువు ♦ సంభవించుట యెట్లు
తెలుప వలయు దీని ♦ జలజనయన! 7

వ. అని పలికిన మునీంద్రునకుఁ జతురాననుం డిట్లనియె. 8

సీ. జీవుఁ డవేధ్యుఁ డ ♦ చ్ఛేద్యుఁ డక్లేద్యుండు
నిత్యుఁ డత్యధికుండు ♦ నిర్వికారి
నిర్మలుం డాద్యుండు ♦ నిరతిశయానంద
సహితుండు నగుచు వి ♦ శ్వంబు లోనఁ
బటికంబుపై వర్తి ♦ పాదుగా నిల్చినఁ
దద్గుణయుక్త మై ♦ తనరుమాడ్కి
నతఁడు దేహస్థితుం ♦ డగుచు నద్దేహజ
కామమోహవికార ♦ కలితుఁ డగుచు
నింతమాత్రనె తన్నుఁ దా ♦ నెఱుఁగ లేక
కలుషసంచయములచేతఁ ♦ గట్టువడుచుఁ
బుత్త్రదారాది సంభ్రాంతిఁ ♦ బొదలి పొదలి
యంత్యంకాలమునఁ దనదే ♦ హంబు విడిచి. 9

గీ. యాతనాదేహసంగతుం ♦ డగుచు నంత
నట్టి జీవుండు పాపసం ♦ ప్రాప్తి ఘోర
తీవ్రనరకానుభవములఁ ♦ దెమలితెమలి
మించ దుఃఖము తన్నుఁ నిం ♦ దించుకొనుచు. 10

వ. మఱియు నజ్జీవుండు పాపఫలానుభవానంతరంబునఁ గర్మపాశకర్షితుం డగుచు వారుణలోకంబున కేతెంచి వర్షధారామార్గంబున భూలోకగతుం డై తృణగుల్మలతాదులయందు సంక్రమించి యన్నరూపంబునఁ బురుషుని దేహంబు ప్రవేశించి రేతోరూపం బై ఋతుకాలంబున స్త్రీగర్భంబు సొచ్చి తద్రక్తంబునఁ బొందుగుడువడి, ప్రథమమాసంబున బుద్బుదాకారం బై రెండవమాసంబునఁ బిండరూపం బై మూఁడవమాసంబున శిరఃకరపాదాంకురసంభవంబును, నాలవమాసంబున నవివ్యక్తంబు లగుటయు నైదవమాసంబున మాంసశోణితపరిపూర్తియు శిరఃపాణిపాదసంభవంబును, నాఱవమాసంబున నస్థిస్నాయుసిరాకేశాంగుళినఖశ్రుతినేత్రనాసాభ్రూపక్ష్మజిహ్వారోమోదయంబును, సప్తమమాసంబున నంగసంధిలక్షణరేఖాసమన్వితత్వంబును, నెనిమిదవమాసంబున సర్వాంగపరిపూర్తియుఁ గలిగి యోజోహీనం బగు దేహంబు జననంబు నొంద వృద్ధిఁబొందు నంత నవమాసంబున సువ్యక్తం బగు దేహంబు వొదలుచు నుండు మఱియు నద్దేహంబున మాతృజంబులును పితృజంబులును రసజంబులును నాత్మజంబులును నగు గుణంబులు గలవు. శరీరోపచయంబును దద్వర్ణంబును వృద్ధియుఁ దృప్తియు బలంబును దోలు సత్వంబును నుత్సాహంబు మొదలైనవి రసజాతంబులును, నిచ్ఛయు ద్వేషంబును దుఃఖంబును ధర్మాధర్మలక్షణంబులును జ్ఞానంబును నింద్రియవ్యాపారంబులును నాత్మసముద్భూతంబు లైన గుణంబు లింద్రియంబులకు మనంబు వశపడక సత్వరజస్తమోరూపంబు లగు మార్గంబులఁ బ్రవర్తించు నమ్మార్గంబులయం దాస్తిక్యంబును ధర్మంబును శమదమాదిగుణంబులును గలుగు నది సాత్వికమార్గంబును గామక్రోధనిద్రాలస్యాదు లైన భావంబులు గలది రాజసమార్గంబును, గ్రోధహింసానప్రమాదాదులు గలది తామసమార్గంబు నై పరగు. మఱియుఁ బ్రాణాపానవ్యానోదానసమాననాగకూర్మకృకరదేవదత్తధనంజయంబు లను దశవాయువులును దద్దేహాధిష్ఠితంబు లై ప్రవర్తించు నందుఁ బ్రాణపవనంబు స

ర్వాధారం బై వ్యానంబుతోఁ గూడి పరిభ్రమించు నిట్లు పృథివీజలతేజఃప వమానాకాశాదిపంచభూతనిర్మితం బగు దేహపంజరంబున వలయంబుల న దశవాయువులును, ధారణంబులును గలకంబులు నను నస్థిభేదంబులు పంచవిధంబులై సహస్రత్రయసమ్మితంబులును మాంసరజ్జువులు నాల్గును నాడులు పదమూడును జీవసిరావిశేషంబులు మూఁడును, రోమంబులు సార్ధకోటిత్రయంబును గూర్చి లాఱునుం గలిగి యుండు నిట్లు శుక్లశోణిత సంయోగంబున సంకలితం బై సంతతాపాయం బై మలద్వారనవకసమే తం బై మూత్రపురీషాలయం బై దుర్గంధిలం బగు పార్థివదేహంబుఁ బొం ది దేహి గర్భకోటరంబున మాతృభుక్తంబు లగు. రూక్షలవణకట్వామ్ల పదార్థంబులచేతఁ దప్తుండగుచు నొకక్షణంబు సంవత్సరకాలప్రమా ణంబుగాఁదలంచుచు సంకుచితావయవుండై యనుభూతంబు లైన వివిధజ న్మపాపప్రాప్తనరకంబులయందు స్మృతి గలిగి పశ్చాత్తాపంబు నొందుచు నిల్చి యంతజననకాలంబరుగు దెంచిన సూతిమారుతంబుల్ల చేత యోనిమార్గం బున బహిర్గమితుం డై బాహ్యమారుతంబున జ్ఞానంబు చెడి యాయాపట్ల మోహితుఁ డై నామరూపాదిచిహ్నితుం డై బాలుం డై. 11

సీ. సమవయస్సంప్రాప్త్య • షాధులతోఁ గూడి
బాల్యఖేలనమునఁ • బ్రబలుచుండి
సంపూర్ణయౌవన • స్తబకితదేహి యై
సాత్వికకర్మముల్ • సలుప లేక
విద్యాకులాచార • విభవశౌర్యసురూప
మదముల నజ్ఞాన • విదితుఁ డగుచు
సాధవిహీనసం • సారసౌఖ్యములంత
సుస్థిరం బగు బుద్ధిఁ • జొనిపిచొనిపి
పుత్త్రదారార్థవాంఛాభి • పూర్ణుఁ డగుచు
మిథ్య యగు నట్టి సంసృతి • తథ్య మనుచుఁ
గర్మవశమునఁ బాపసం • క్రాంతుఁడగుచుఁ
బ్రాప్తకాలాన దేహి దే • హంబు విడిచి. 12

గీ. యాతనాదేహసంగతుఁ ♦ డగుచు నతఁడు
నిబిడసమవర్తికింకరా ♦ నీతుఁ డగుచు
బహువిధంబుల నరకకూ ♦ పంబులందు
నాత్మకృతపాపఫలముల ♦ ననుభవించి. 13

సీ. అయ్యెడ సంతాపి ♦ తాత్ముఁ డై క్రమ్మఱఁ
బురికొని భూమికి ♦ నరుగుదెంచి
యే పాతకంబున ♦ నేది జన్మం బగు
నా జన్మమును బొంది ♦ యజ్ఞుఁ డగుచు
సారవిహీనసం ♦ సారకూపములందుఁ
బడి పుత్త్రధనవధూ ♦ భ్రాంతిఁ బొదలి
యదియె భోగ్యంబు గా ♦ నాత్మఁ జింతించుచు
జాతియు సంతతా ♦ చార ముడిగి
కలుషనాశకుఁ డైనట్టి ♦ జలజనయనుఁ
దలఁప నొల్లక విపరీత ♦ ధర్మములకుఁ
గాలుఁ జాపుచుఁ దుద విధి ♦ గ్రస్తుఁ డగుచు
నట్లు కడలేని జన్మంబు ♦ లందు వాఁడు. 14

క. ఈ రీతి జన్మలయముల
నారూఢిగఁ బొంది జీవు ♦ లతిదుఃఖములన్
మీరుచు నొక పతి యైనను
శ్రీరమణీవిభుని జింత ♦ సేయరు తనయా! 15

క. ఈ లోకంబులలోపల
భూలోకము కర్మభూమి ♦ బుధు లచ్చట నే
కాలంబుఁ దృప్తిఁ బొందుదు
రాలీల మఖంబులన్ హు ♦ తాశను లగుచున్. 16

గీ. దేవనాయకాది ♦ దివిజులు మదిలోన
నాత్మచే భవంబు ♦ లస్థిరంబు
లని తలంచి ముక్తి ♦ కరుగుట కై వాంఛఁ
జనుదు రుర్విమీఁద ♦ సంభవింప. 17

సీ. అఖిలలోకనివాసు • లగు సురేంద్రుల కైన
వసుధ జన్మించిక • వనజనాభు
పదము నొందఁగ రాదు • పరికించి చూచిన
నచటలక్ష్మీశ్వరు • నాత్మలోనఁ
దలఁచి నంతనె ముక్తి • గలిగి యుండెడిచోట
భూజనుల్ మాయాభి • పూర్ణు లగుచు
సుజ్ఞానహీను లై • యజ్ఞానసహితు లై
పుత్త్రదారేషణ • స్ఫూర్తిఁ బొదలి
భుక్తిమైథుననిద్రాది • సక్తులగుచుఁ
దెలివిఁ జిత్తంబుఁ గుదియంగఁ • దివియ లేక
వివిధమార్గములఁ దిరిగి • దెవికి నడవఁ
గడగు మార్గంబు లరయంగఁ • గాన రెచట. 18

వ. ఇట్లు రేతస్సృష్టిసంభవు లగు ప్రాణికోట్ల కన్నమూలంబునఁ బ్రాణంబులు నిలచుఁ దత్ప్రాణంబులవలన బలంబును, బలంబువలనఁ దపంబును, దపంబువలన శ్రద్ధయు, శ్రద్ధవలన మేధయు, మేధవలన శాంతియు, శాంతివలనఁ దమంబు నొదవు నాదమంబువలనఁ జిత్తస్థైర్యంబును నందువలన సమ్యజ్ఞానంబును, సమ్యజ్ఞానంబువలనఁ బరమార్థదర్శనంబును గలుగు నట్లగుటం జేసి తదన్నంబే బ్రహ్మస్వరూపంబుగా నెఱుంగుము. అట్టి యన్నంబు భగవత్ప్రీతిగా విప్రులకు దానంబు సేయు గృహనివాసుండు విష్ణులోకంబున కరుగు నని చెప్పి నారదునకు మరియు నిట్లనియె. 19

క. సుకుమార ! వినుము నైమి
త్తిక మనఁగను మఱియుఁ బ్రాకృ • తిక మన నాత్యం
తిక మనఁగను ద్రివిధము లై
యొకవీఁకను లయము లొదవు • నురవడితోడన్. 20

క. కాలపరిమాణ మెఱుఁగఁ గఁ
గాలాత్మున కైన వశము • కాదు లయంబుల్
కాలంబుకతనఁ దలఁకొను
నా లీలనె జగము లుదయ • మందును దనయా. 21

క. మానమునఁ బరిమితములై
ధీనుత ! మాసర్తుపక్ష • దినరూపములై
భానూదయాస్తమయములు
గానఁగ నట్లవియ యగును • గాలక్రమముల్. 22

సీ. ఆక్రియఁ దద్భాస్కర • రాసోదయంబులు
దినమునఁ బరగుఁ ద • ద్దినములైదుఁ
బదియుఁ గూడఁగ నొక్క • పక్షంబు పక్షద్వ
యంబు మాసం బన • నల్లరుచుండు
నది పితృమాసమ • య్యాదను దివసంబు
వరుస నద్దివసంబు • లరువదియును
మున్నూఱు బుధమాన • మున నొక్క వర్షంబు
పరువడి దివ్యవ • త్సరము లయుత
సంఖ్యఁ బోలు పొందు యుగరూప • సహిత మగుచు
నదియు డెబ్బది యొకటి మ • న్వంతరంబు
తచ్చతుర్దశ మనుసంఖ్య • ధరణిఁ జనిన
నదియ మాకును దినము స • త్యంబు తనయ. 23

ఉ. ఆ దివసావసానమున • నంబుధులెల్లఁ గలంగి మ్రోయుచున్
బాదులు మించి దేవనర • పన్నగలోకము లాక్రమింపఁగా
ఖాదితరూపముల్ గలిగి • సర్వమహీముఖపంచభూతముల్
ప్రదతాగపారనీరధిజ • లంబులలోఁ గలయంగ నత్తఱిన్. 24

చ. సురమునికిన్నరాదు లతి • శోకముఁ బొందుచు నాకలోకను
స్థిరభవనంబు బద్ధముగ • సేయఁగ శక్యము గాక సద్వ్రతా
కరము నపాయశూన్యము న • కామమదంబును నైన సత్యనా
మరుచిరలోకమందుఁ బర • మస్థితి నుండుదు రార్యసేవితా. 25

వ. ఇవ్విధంబున నద్దివసావసానమున లోకంబులు జలనిమగ్నంబు లగుట యది దైనందిననామకంబై నైమిత్తికప్రళయంబనం బరఁగు వసుమతిపైఁ జతుర్విధంబులగు తనువులు ధరియించిన జీవంబుల ప్రకృతులు నిత్యలయం

బుఁ బొందు నదియె ప్రాకృతికప్రళయంబనం దనరు నింక నాత్యంతికప్ర
ళయంబు చెప్పెద నాకర్ణింపుము. 26

సీ. బ్రహ్మాండపేటికా ♦ పరిపక్వకాలంబు
చనుదేర నయ్యెడ ♦ జలజనాభుఁ
డఖిలాండసంపూరి ♦ తాత్మతేజంబుల
బలువిడి నూర్ణనా ♦ భంబు కరణి
గ్రసియించి యోగసం ♦ క్రాంతుఁ డై యంత దు
గ్ధంబులు జలములఁ ♦ గలయురీతి
విపులతత్తేజఃప్ర ♦ విష్టుఁ డై చనునప్పు
డాకసంబున వాయు ♦ వవతరించి
వీఁకతో నూఱువర్షముల్ ♦ వీచు నంత
సకలశైలముల్ తూలకం ♦ దుకము లట్ల
తన్మహాలయవాతాహ ♦ తంబు లగుచు
నంబురాశిని మునుఁగు న ♦ య్యవసరమున. 27

శా. పాతాళంబున నాదికూర్మవదనాం ♦ భస్సంభవోద్యత్సమీ
రాత్రిప్రస్ఫుటకల్పవహ్నిఘనకే ♦ లాగ్రస్ఫురద్విస్ఫులిం
గాతీతధ్వనిభీకరం బగుచు బ్ర ♦ హ్మాండాంతరోద్భేదకం
బై తత్తద్భువనంబు లాహుతిఁ గొనున్ ♦ వ్యాకీర్ణరూపంబునన్. 28

వ. ఆ సమయంబున. 29

క. కాటుకకొండల కైవడి
గోటానంగోట్లు మింట ♦ ఘూర్ణిల్లుచు సం
స్ఫోటించు మేఘగణములు
గాటంబుగ వృష్టిఁగురియఁ ♦ గరఁగి జగంబుల్. 30

గీ. నీటిలోనఁ గలయు ♦ నిఖిలభూతంబులు
నుదకమయము లైన ♦ నుర్వి జలము
లందు సంక్రమించు ♦ నాజలంబులు నగ్ని
శిఖలచేత నింకు ♦ సుఖితహృదయ. 31

క. ఆ యనలము లోకంబులఁ
బాయక దహించి యంతఁ • బ్రభ యణఁగి మహా
వాయువునఁ గలయు నదియును
నా యెడ నాకాశలీన • మగు మునివర్యా! 32

వ. బ్రహ్మాండస్వరూపనాశకం బై తమస్సమావృతం బగు నది యాత్యంతికప్రళయంబునాఁ బరఁగు. కొందఱు లయంబులు చతుర్విధలక్షణంబు లని వచింతురు. కొందఱు ద్వివిధంబు లని చెప్పుదురు. ఇట్లొదవు లయంబులు పరమమూర్తిమాయాకల్పితంబు లై ప్రవర్తించు నట్టి తేజోమయమూర్తిగుణవ్యాపారపౌరుషంబులు ప్రత్యహంబును దలంచు పరమభాగవతోత్తములు సంచితప్రారబ్ధకర్మవిముక్తు లై వైకుంఠపురంబు చేరుదు రని చెప్పిన విని నారదుం డిట్లనియె. 33

క. భువిని రసాతలజలముల
దివమునఁ దనువుల్ ధరించి • తిరిగెడి జీవుల్
భవభయము లుడిగి యే క్రియ
నవిరళగతిఁ జనుదు రింది • రాధిపు పురికిన్. 34

క. బల మగు కర్మము లీ జీ
వులకుం బహుజన్మహేతు • వులు దత్కర్మం
బులఁ బాసి యిట్టి జీవులు
ప్రళయంబునఁ బొందు టెట్లు • పద్మజ! ముక్తిన్. 35

క. ఆ ముక్తిఁ బొందు జీవులె
యీ మహిఁ దిరుగం జనించు • టే విధమున సు
త్రామాదివంద్యపదయుగ
ప్రేమంబున నానతిమ్ము • పృథుగుణనిలయా. 36

వ. అని పలికిన తనయునకుఁ జతుర్ముఖుం డిట్లనియె. 37

సీ. సృష్ట్యుద్భవవ్యయ • స్థితులను మూఁడింటి
కధిపతి పుండరీ • కాయతాక్షుఁ
డతని మాయను మగ్ను • లై సురేంద్రాదులు
బాహ్యభాగంబున • భ్రాంతి నొంది

సంచలిఁగను నున్న ♦ సర్వేశుఁడా దేవ
కోట్ల సంరక్షణ ♦ కొఱకు ధాత్రి
నుద్భవం బందె మా ♦ యోపాయముల దైత్య
పతుల మర్దించును ♦ బలిమి మెఱసి
యమ్మహాత్ముఁడు వారిపై ♦ నధిక మైన
కారణము లేని కూరిమిఁ ♦ గలిగి యుండు
నట్లు గావున స్వర్గాదు ♦ లైన లోక
ముల వసించిన సురలెల్ల ♦ ముక్తు లనఘ. 38

క. ఈ లోకంబులలోపల
భూలోకము కర్మభూమి ♦ బుధు లచటను ద
త్కాలోచితాధ్వరంబులఁ
జాలఁగ సంతృప్తిఁ బొంది ♦ చనుదురు తనయా! 39

వ. మఱియు భూలోకంబున జీవులు సంచితప్రారబ్ధకర్మపాశంబులఁ గట్టు వడి తత్కర్మానురూపంబు లగు దేహంబులు ధరించి భుక్తిమైథుననిద్రాదివ్యాపారంబులఁ బొదలుచుఁ బుత్త్రదారధనాదివ్యామోహంబు పడుచు వర్తింతు రట్టి దేహంబులయందు నుద్భిజ్జంబు లగు తరుగుల్మాదివన్యంబు లధమాధమంబులును స్వేదజరిబు లైన క్రిమిదంశాదు లధమంబులు నండజంబు లైన పతంగసర్పాదులు మధ్యమంబులు, జరాయుజంబులయందు గోమహిషమృగాదు లుత్తమంబులును నరాకారంబు లుత్తమోత్తమంబు లనం బరఁగు నమ్మానవులు స్వేచ్ఛ సమాచరిత దుష్కర్మంబుల ననంతంబులగు కుయోనుల సంభవించి లయంబును బొందుచుఁ దత్పాతకానురూప నరకంబులను భవించి క్రమ్మఱి యు గర్భనరకంబులఁ బొందుదు రిట్లు జన్మలయంబులు దేహికి జ్ఞానోదయపర్యంతంబు సంతతం బై ప్రవర్తించు ని ట్లుండ సంస్కారవిశేషంబున నుదితం బగు నిశ్చయజ్ఞానం బను వహ్ని చేతఁ గర్మమయంబు లగు నరణ్యంబులు దగ్ధంబు లైన యంత నిష్కల్మషుం డై దేహి దేహంబు విసర్జించి కైవల్యంబు నొందు నని చెప్పి మఱియు ని ట్లనియె. 40

సీ. భువనంబు లుదకసం ♦ పూర్ణంబు లై భూత
పంచకం బణఁగఁ ద ♦ త్ప్రళయ మందు

వరుస జీవులు కర్మ ♦ వాసనాసహితులై
యెడఁ గని రేణులై ♦ యడఁగి యంత
నా వసుంధరలయం ♦ బందు కాలంబునఁ
దద్భూమితోడ న ♦ త్యంతలయముఁ
బొంది క్రమ్మఱను న ♦ ద్బుద్ధమై జగములు
వివిధంబులై సంభ ♦ వించు నపుడ
యట్టి జీవులు తద్వాస ♦ నావృతాత్మ
లగుచుఁ గర్మానురూప దే ♦ హములఁ బొంది
భోగవశులయి సంసార ♦ సాగరమున
సంచరింత్రుపూర్వజనిసం ♦ స్మరణఁ దొలఁగి. 41

వ. మఱియును. 42

సీ. జలదముల్ బాలభా ♦ స్కరతేజ మణఁగించి
బలిమితోఁ జుట్టి పైఁ ♦ బర్వి మఱియు
నత్యుష్ణతద్భాస్క ♦ రాధికకరజాల
కాంతు లెచ్చిన విచ్చి ♦ కలఁగు నట్లు
జ్ఞాన మజ్ఞానసం ♦ ఛాదితరూప మై
తద్వికారంబు న ♦ ధఃకరింప
శక్తంబు గాక సం ♦ శయసమాసక్త మై
యదియె సత్తామాత్ర ♦ మై చెలంగు
నంతఁ దనుఁ దాన యజ్ఞదా ♦ నాభిషేక
విష్ణుసంస్మృతిపూజాది ♦ విధులచేత
నట్టి సుజ్ఞానదీపకం ♦ బధిక మగుచుఁ
గణఁక నజ్ఞానతిమిరంబు ♦ నణఁచుఁ దనయ. 43

క. జ్ఞానం బొదవినయప్పుడె
మానవులు గతాఘు లగుచు ♦ మఱి దేహములన్
బూనిక ధరియింపక ని
త్యానందపదప్రవిష్టు ♦ లగుదురు పుత్త్రా. 44

క. జ్ఞాన మనఁగ హరిపాద
ధ్యానానుస్యూతభక్తి ♦ నలరుట తుద న
జ్ఞానము నాఁ దదితరసం
ధానము పరికింపఁ బడియెఁ ♦ దత్త్వం బనఘా! 45

చ. అతులితపాపసంకలితుఁ ♦ డైనను జాతివిహీనుఁ డైనఁ గ
ర్మతతులబద్ధుఁ డైనఁ బితృ ♦ మాతృజిఘాంసకుఁ డైన నిందిరా
పతి నతిభక్తితోఁ దలఁచి ♦ ప్రస్తుతిసేయఁ గ నేర్చు మానవుం
డతిముద మంది చెందును బ ♦ రాచ్యుతలోకనివాససౌఖ్యముల్. 46

క. శ్రీనాథుభక్తిఁ బొదలెడు
మానవుఁ డఖిలామరేంద్ర ♦ మానితుఁ డగుచున్
స్వానుభవావేద్యసుఖం
బానిన హృదయమున ముక్తి ♦ కరుగును బుత్రా! 47

సీ. అజ్ఞాన మనెడు గా ♦ ఢాంధకారసమూహ
మంతయుఁ దుదిముట్ట ♦ నణఁచుకొఱకు
వివిధాన్యకృతమార్గ ♦ విధుల దుర్వాక్యముల్
శ్రవణముల్ సోఁకక ♦ చనెడుకొఱకు
బహుజన్మపుణ్యసం ♦ ప్రాప్తలక్ష్మీశ్వర
పాదాబ్జసద్భక్తి ♦ ప్రబలుకొఱకు
నిబిడదుష్కృతజాల ♦ నిలయమై వర్తించు
విదితసంసారేచ్ఛ ♦ వదలుకొఱకు
బ్రదుకుమిధ్యగ మదిలోనఁ ♦ బరఁగుకొఱకుఁ
సజ్జనులతోడి సంసర్గ ♦ జరుగుకొఱకుఁ
బ్రతిదినంబును సంతోష ♦ భరితుఁ డగుచు
వినఁగవలయును దద్రమా ♦ విభుని కథలు. 48

క. హరినామస్మరణకథా
పరిచయమునఁ బ్రొద్దుఁ గడపు ♦ భాగవతులు సు
స్థిరముగ లక్ష్మీరమణుని
పురమున వసియింతు రమర ♦ పూజితు లగుచున్. 49

గీ. సతులతోడఁ బాపి ♦ సుతులను దొలఁగించి
సిరులఁ జెంద నీక ♦ శ్రీవిభుండు
తివిరి యాత్మభక్తి ♦ దృఢముగాఁ బరికించి
భక్తులకు నొసంగుఁ ♦ బరమపదము. 50

క. ఆయువు కొంచెము సిరు లన
పాయంబులు గావు హృదయ ♦ భయభావంబుల్
వాయవు భోగాసక్తుల
కాయాసమె కాని కలుగ ♦ దందు ఫలంబుల్. 51

మ. భువిఁ గర్మంబులు సర్వదేవతలకుం ♦ బొల్పొందఁగాఁ దృప్తిహే
తువు లై యాచరితంబు లయ్యెడియెడన్ ♦ దోరంబు లై విఘ్నముల్
వివిధోపాయబలంబులం దగులు నా ♦ విఘ్నంబు లాత్మక్రియా
నవవృత్తంబులఁ బొంది మోక్షసరణిం ♦ దప్పించు నయ్యెయెడన్. 52

గీ. ఖడ్గధారమీఁద ♦ గమనంబు సేయుచుఁ
పదిలుఁ డైన నరుని ♦ పగిది నాత్మ
యోగసరణిఁ జనుచు ♦ యుక్తుండు నిర్విఘ్న
ముగ వసించు మోక్ష ♦ మున మునీంద్రా. 53

గీ. జ్ఞానకర్మయోగ ♦ సముదయంబు ప్రతిభ
కొలఁది గాని యొరుల ♦ కును నిషిద్ధ
మగును జర్చసేయ ♦ నఖిలాధికార మై
తనరు భక్తియోగ ♦ మనఘచరిత. 54

ఉ. ధీనుత కర్మమార్గము వి ♦ ధిజ్ఞుల కైనఁ బ్రయాస మెట్టిచో
మానవుఁ డప్రమత్తతను ♦ మాధవు నాత్మఁ దలంచి సంతత
స్వానుభవైకవేద్య మగు ♦ సత్యసుఖంబును బొంది రోయుఁ ద
న్మానుషసౌఖ్యసంపదలు ♦ నశ్వరహేతువు లంచు నెయ్యెడన్. 55

శా. ఉత్కంఠావృతు లై మహీసురులు త ♦ ద్యోగక్రియాశూన్యు లై
సత్కార్యప్రియభావినిత్యసుఖవాం ♦ ఛల్ మాని మోహంబునన్
దత్కాలంబునఁ గోర్కె చేపడుట కై ♦ నారాయణప్రీతిగాఁ
దత్కర్మంబులు సేయు టొల్లరు విచి ♦ త్రభ్రాంతచేతస్కు లై. 56

సీ. ఫలకారణోజ్జ్వల ♦ ప్రసవరూపాదులు
తత్ఫలం బొదవునం ♦ దాక వర్ణ
నీయంబు లగు రీతి ♦ నిశ్చయసుజ్ఞాన
మొదవెడుకొఱకుఁ గ ♦ ర్మోదయముల
వేదజాలంబులు ♦ విస్తరించుటె కాని
యవి ముక్తిహేతువు ♦ లనఁగఁ బడవు
తత్కర్మములు ఫలా ♦ ర్థము సేయఁ బడిన వై
వాంఛితం బొసఁగును ♦ వలయు నరుల
కట్లుగావున హరిరూప ♦ మైన వేద
సరణి నీక్షించి మోహిత ♦ స్వాంతు లగుచు
భూసురోత్తముల్ స్వర్గాది ♦ భోగమాత్ర
సాధనము లైన కర్మముల్ ♦ జరపువారు. 57

ఉ. సందియ మింత లేక బుధ ♦ సంఘము వేదక్ర మఖాదికర్మముల్
పొందువడన్ విధానమునఁ ♦ బూర్ణముగా నొనరించి దేవతా
స్పందవిహారమాత్రఫల ♦ సాధకు లై తుద దేవభూములం
జెంది సుఖించి క్రమ్మఱను ♦ జేరుదు రుర్విని సంభవార్థ మై. 58

క. ఈ మర్మము దెలిసి యశో
ధాముఁడ వై తనయ సంత ♦ తంబును లక్ష్మీ
రామాధిపుని గుణంబులు
ప్రేమన్ వినుతింప వలయుఁ ♦ బ్రియ మొప్పంగన్. 59

గీ. ఆవు ప్రేమతోడ ♦ నాత్మీయ మగు క్రేపుఁ
గాచి దాని యొడలి ♦ కల్మషంబు
గడిగినట్ల తాన ♦ గ్రసియించు మాడ్కిని
హరి యణంచు భక్త ♦ దురితచయము. 60

వ. అనినఁ బంకజాసనునకు దేవముని యిట్లనియె. 61

చ. నిమిషములోన లోకముల ♦ నెమ్మి సృజింపను సంహరింపఁ గా
ర్యమున మహాత్ముఁ డైన హరి ♦ రాక్షసకీటములన్ వధింపఁ బూ

ని మహి ననేకరూపముల ♦ నిర్జరకోటి నుతింప దేహముల్
ప్రముదితుఁడై ధరించుటకుఁ ♦ బద్మజ కారణ మాన తీయవే. 62

క. అని పలికిన నారదసుర
మునితో నయ్యబ్జభవుఁడు ♦ ముద మలరఁగ ని
ట్లనియెను దరహసితశుభా
ననుఁడై ధారాళవాక్య ♦ నాదం బొదవన్. 63

సీ. వినుము నారద జగ ♦ ద్విభుఁడైన విష్ణుఁ డ
త్యధికదయాపూర్ణుఁ ♦ డగుటఁ జేసి
నిజజన్మకర్మవ ♦ ర్ణితకథామృతపాన
మునఁ బుణ్యఘను లైన ♦ మనుజవరుల
జన్మముల్ దొలఁగించి ♦ శాశ్వతపదము నొం
దించుట కై ధాత్రిఁ ♦ దెల్వి మీఱ
బహువిధరూపసం ♦ ప్రాప్తుఁడై యుద్భవం
బందుట గాక దు ♦ ష్టాత్ము లైన
దనుజకీటకముల ఘన ♦ దర్పము ణఁపఁ
దద్రమాధీశకరసంగ ♦ తప్రసిద్ధ
చక్రధారాసముచ్ఛలత్ ♦ జ్వాలనజనిత
విస్ఫులింగంబు చాలదే ♦ విమలచరిత. 64

శా. ఆ నారాయణుఁ డాదికాలమున దే ♦ హప్రాప్తిమై నున్న జీ
వానీకంబులు పాపమూలముల సం ♦ ప్రాప్తంబు లైనట్టి నా
నానేకాంతకలోకదుర్గతుల న ♦ త్యంతంబు దుఃఖింపఁ ద
న్మానవ్యాప్తిహరింపఁ బూని జముతో ♦ మధ్యస్థుఁడై యిట్లనున్. 65

సీ. శరణాగతార్త ర ♦ క్షయ మాకు సహజవ్ర
తం బదెయ్యెడ నైన ♦ దండహస్త
వారిఁ బ్రోవఁ గఁ బూని ♦ వసుధలోన జనింతు
కణఁక రక్షస్సంహ ♦ రణమిషమున

వీనుల మత్కథల్ ♦ వేడ్కతో వినువారు
విదితమద్గుణములు ♦ చదువువారు
మత్ప్రీతిగా దాన ♦ మహిమ సల్పెడువారు
బృందావనంబులు ♦ పెంచువారు
నాణెముగ నర్థిపూజ యొ ♦ నర్చువారు
నాదుభక్తులు గాన నా ♦ నరుల నెపుడు
గదియఁ బోవక విపరీత ♦ గతుల మెలఁగు
పాపకర్ముల దండింపఁ ♦ బాడి నీకు. 66

క. హరి యిట్లానతి యిచ్చిన
వెరవున సమవర్తి యంత ♦ వీక్షించి రమా
వరపాదయుగళభక్తుల
తెర వరుగఁడు నాటనుండి ♦ దివిజాళీనుతా. 67

క. అనయము కర్మాచరణం
బున నైగుణ్యములు తఱచు ♦ ముక్తినివాసం
బునకును హేతువు లక్ష్మీ
వనితాధిప నామజపము ♦ వర్ణింపంగన్- 68

క. నారాయణుండె దైవము
నారాయణ నామజపము ♦ నరులకు ఘనసం
సారాబ్ధితరణసాధన
మారయఁ దత్పాద పూజ ♦ నణఁగు నఘంబుల్. 69

సీ- స్వరవర్ణమంత్రసం ♦ జనితలోపంబులు
కర్మయోగంబునఁ ♦ గలుగుఁ గానఁ
దత్కర్మనిష్ఠులై ♦ తనరువారల కెల్ల
విఘ్నముల్ సెందును ♦ వీక్షసేయ
జ్ఞానయోగంబులఁ ♦ జనుమహాత్ముల కైనఁ
దఱచువిఘ్నంబులు ♦ దొఱలు చుండు
నట్టి విఘ్నాత్తయో ♦ గారూఢు లగువారు
చనరు లక్ష్మీనాథు ♦ సదనమునకు

నట్లుగావునఁ బుత్త్రదా ♦ రాప్తవిత్త
పశుగృహప్రాప్తమోహంబుఁ ♦ బరిహరించి
చిత్త మాత్మాధినాథుపైఁ ♦ జేర్చి నరుఁడు
చెడక హరిభక్తికడఁకను ♦ నడప వలయు. 70

గీ. హీనకులజుఁడైన ♦ హింసకుండైనను
బాపసహితుఁడైనఁ ♦ బతితుఁడైన
విష్ణుభక్తిగలిగి ♦ విమలుఁడై వర్తింపఁ
గలుగు నతని కమృత ♦ నిలయ మమర. 71

క. నాలుగుయుగముల లోపల
వాలాయము కలియుగమున ♦ వర్తించు నరుల్
శ్రీలలనావిభునామను
లాలించి భవాబ్ధిఁ గడతు ♦ రమరులు పొగడన్. 72

వ. మఱియు నప్పరమపురుషుని పాదసరోరుహములయందు నిశ్చలభక్తిగల ప్రసన్నుండు ప్రియతమంబు లగు పుత్త్రదారాదులు సమసిపోయిననైనను బహువిధరోగంబు లేతెంచినను బద్మపత్రంబు జలబిందువులచేత లిప్తంబు గాని చందంబునఁ దత్ప్రాప్తంబులైన బాహ్యాభ్యంతరదుఃఖంబులఁ జెందక మాయావాక్యరచనావిశేషంబు లనియెడి విఘ్నంబుల సంభవంబైన సంశయంబులఁ జిక్కుపడక సర్వంబును జన్మాంతరసంస్కారవినోదంబులుగా వితర్కించి శరీరంబు నిత్యంబు గాకుండుట యెఱింగి సమ్యగ్జ్ఞానసమేతుండై పరమతేజోమూర్తిం గలయు నని చెప్పి మఱియు నిట్లనియె. 73

సీ. మృద్వికారము లెల్ల ♦ మృద్విలిప్తంబులై
నిబిడరూపంబుల ♦ నిలుచు నట్లు
పార్థివదేహముల్ ♦ పార్థివాన్నములచే
తనుదృఢాంగస్ఫూర్తిఁ ♦ దనరు చుండు
నట్టి యన్నంబు బ్ర ♦ హ్మస్వరూపంబునఁ
బ్రాణికోట్లకు నెల్లఁ ♦ బ్రాకటముగ
నాధార మగు చుండు ♦ నవియు నన్నంబుల
యందవశ్యంబుగ ♦ నాక్రమించు

నన్నవర్జనసబల మై • యున్న నైనఁ
బ్రకృతి నిలువదు విశ్వంభ • రాజనులకు
ధరఁ దదన్నంబు హుతము ద • త్తంబు నగుచుఁ
దృప్తికారణ మగుచుండు • దివిజులకును. 74

క. బ్రహ్మార్పణముగ నన్నము
బ్రాహ్మణజఠరానలములఁ • బ్రబలినభక్తిన్
బ్రహ్మజ్ఞుఁడు వేల్చినఁ ద
ద్బ్రహ్మస్థానంబు నొందు • బ్రహ్మాత్మకుఁ డై. 75

గీ. అట్టి యన్నభుక్తి • కాస సేయక యోగి
తెలివిఁ బ్రాణ మాత్మ • నిలుచుకొఱకు
గ్రాస మందవలయుఁ • గబళంబు లైదింట
రుచుల కోర్కి విడిచి • రూఢి మెఱయ. 76

వ. మఱియును. 77

సీ. అన్నంబులకుఁ బ్రాతు • లగుదు రాఁకటఁ జిక్కి
చను దెంచి ప్రార్థించు • మనుజు లెల్ల
నందుఁ బ్రాణాగ్నిహో • త్రాధికారసమేతు
లగు భూసురేంద్రు ల • త్యధికు లరయఁ
దద్భూసురేంద్రహృ • ద్గతవహ్ని లోపల
నెట్టివాఁ డైన న • హీనభక్తి
నన్నకబళము ప్రా • ణాహుతిమాత్ర మై
నను వేల్చెనేని య • న్నరవరుండు
కోటిగతజన్మసంచిత • ఘోరకలుష
విరహితుం డయి సుర లెల్ల • వినుతి సేయఁ
బ్రబలసంసారఘనసాగ • రంబుఁ గడచి
ముదితుఁ డగుచును సాయుజ్య • ముక్తి నొందు. 78

గీ. పొదలు సంపదలకు నెల్లఁ • బుట్టి నిల్లు
నిబిడరోగాగ్నులకు నెల్ల • నీరదంబు

వైభవాకర మోక్షని • వాసహేతు
వన్నదానసమాన మ • న్యంబు గలదె? 79

గీ. భక్తితో నైనఁ గణగి య • భక్తి నైనఁ
బ్రీతితో నైనఁ బొదలి య • ప్రీతి నైన
హరిసమర్పితముగ భూసు • రావళులకు
నేయమున నన్నదానంబు • సేయవలయు. 86

వ. అట్టి యన్నదానమహత్వంబు చెప్పెద నాకర్ణింపుము. 81

స్రగ్ధర. ప్రాకారద్వారకేళీ • భవనవిమలహ • ర్మ్యస్ఫురిద్గోపురాళీ
వ్యాకీర్ణం బై మవేభా • యతరథతురగ • వ్యాప్త మై కృత్రిమార
ణ్యాకాలప్రాప్తపుష్పో • ద్యదభివినుతగం • ధాభిసంవాసితం బై
శ్రీకాంతాసంశ్రయం బై • చెలఁగుచు వెలయున్ • సింధురం బుర్విలోనన్.

క. ఆ సింధురాష్ట్రంబున
భూసురవరుఁ డొకఁ డతిథి • పూజాపరుఁ డై
వాసవుఁ డను నామంబున
వాసరములు గడపు విష్ణు • వశహృదయుం డై. 83

వ. అట్టి విప్రపుంగవుండు ధర్మానుకూలభార్యాసమేతుం డై గోధనధాన్య
పుత్త్రబంధుజనపూర్ణసదనుం డై యహంకారంబు పరిత్యజించి తెలివితో
డఁ గాలంబు నడపుచు సముచితాచారయుక్తుం డై యున్నయెడ నొక
నాఁడు లక్ష్మీవల్లభుండు దన్మహీసురుని నిశ్చలభక్తివిశేషపరీక్షఁ జేయం
బూని యతని ధేనువుల నంతర్ధానంబు నొందించినఁ దద్గోపాలకులు జాలిం
బొంది కుయ్యిడుచుఁ బరుగుపరుగున నతని గృహంబునకు నరుగుదెంచినం
జూచి యవ్వాసవుండు వారలతో ని ట్లనియె. 84

శా. ఏలా గోపకులార! కుయ్యిడుచు మీ • రీ రీతి దుఃఖాత్ము లై
జాలిం బొందఁగఁ గుందఁ గావలవ దీ • జాడల్ రమానాథు లీ
లాలంకారము లామహాత్ముఁడు జగ • ద్వ్యాపారపారీణుఁ డై
కాలాకారసమేతుఁ డై యణఁచు ధ • ర్మాలోద్భవార్థంబులన్. 85

క. నాశోదయములకును ల
క్ష్మీశుం డే నాయకుండు • చింతింపఁగ దు

ష్టాశాపరవశత నరుల్
గాసిలి తిరుగుటయె కాని ♦ కలుగవు ఫలముల్. 86

చ. మతియును విత్త మాయువును ♦ మానవనాథుల మెప్పు మిథ్య యా
మృతియును జీవితంబు నిట ♦ మేదినిలోపల జీవకోట్ల క
ద్భుతముగ వ్రాయుఁ బద్మజుఁడు ♦ పొల్పుగ నందుకుఁ దప్ప లేదు సం
పదలు నిజేచ్ఛఁ గల్గునె ర ♦ మాపతి యానతి లేక యుండినన్. 87

గీ. వచ్చునట్టి కీడు ♦ వారింప మగుడింపఁ
బోవుచున్న సిరుల ♦ బుజ్జగింప
హరియుఁదక్కఁ బంక ♦ జాసనగౌరీశ్వ
రాదిసురల కైన ♦ నలవియగునె? 88

వ. అని యిట్లు వానవమహీసురుండు మోహంబు నొందక ధేనునాశంబు విను
పింప నేగుదెంచు గోపకుల నూరడించి తొల్లిటి యట్ల విష్ణుపూజాపరుం డై
యతిథిసంతర్పణ సేయుచు వర్తింపఁ గ్రమ్మఱ లక్ష్మీవల్లభుండు తద్విప్రుని
సదనంబునం గల సకలధనధాన్యాదిపదార్థంబు లణంగఁ జేసిన నతండు
దారిద్ర్యంబును బొందియు విష్ణుపాదభక్తి విడనాడక శాకాహారసమేతుం
డై తన్మూలంబున నతిథిపూజఁ జేయుచు దృఢమనస్కుం డై సంచరించుచు
నొకనాఁడు. 89

సీ. అవనీసురుండు వ ♦ న్యపదార్థసంగ్రహం
బునకు నై కాననం ♦ బులకు నేగి
తద్వనంబంతయుఁ ♦ దప్పక శోధించి
కందమూలాదులు ♦ గానలేక
తీవ్రాతపంబునఁ ♦ దెమలి తృష్ణాతుడై
విష్ణునామస్మృతి ♦ విడువ కెపుడు
నడుపుచు నొయ్యన ♦ నలినమిత్రుఁడు మింట
నపరాంబునిధిచేర ♦ నరుగునపుడు
నిజగృహంబున కేతెంచి ♦ నిర్వికారుఁ
డగుచుఁ దనసతి నీక్షించి ♦ హర్షమొదవ

మానితాసనమధ్యమా ♦ సీనుఁ డగుచుఁ
బలికి నొకమాటఁ దత్పుత్ర ♦ పన్నచరిత. 90

చ. తిరిగితిఁ గాననంబు లతి ♦ తృష్ణఁ జలింపక తద్వనంబులన్
దొరకవు కందమూలములు ♦ తోయజనాభుని యాజ్ఞ గాక యి
ప్పరిజన మెల్ల నన్నపరి ♦ పూరిత మై విహరించుచుండఁ గాఁ
గఱవగునే తదన్నము ల ♦ కాలమునన్ మన మందిరంబునన్. 91

వ. అని పలుకు నవసరంబున దైవప్రేరితం బై యొక్క ఫలంబు కనుపడ
సతితో మఱియు నిట్లనియె. 92

క. లలనా హర్యర్పిత మగు
ఫల మిది భుజియింపు మీవు ♦ పద్మాక్షుఁడే భ
క్తులఁ బ్రోవక దిగవిడుచునె
పొలుపుగ సకలప్రపంచ ♦ పూర్ణుం డగుచున్. 93

వ. అని పలికిన వచనంబులకుఁ జలితహృదయ యై సతి యిట్లనియె. 94

క. సుతు లుండఁగఁ బ్రాణం బగు
పతి యుండఁగ నెట్టు లిట్టి ♦ ఫలము భుజింపన్
మతిలోన హర్ష మొదవును
సతులకు మముబోంట్ల కెన్న ♦ జననుతచరితా! 95

వ. అని యిట్లొండొరులు వితర్కించు సమయంబున నొక్క వృద్ధ మహీసురుండు దృష్ణానలపీడితుం డై శ్రమంబు నొంది వాసవుని సదనంబున కరుగుదెంచినం జూచి యా మహీసురవరుండు సంతసంబున నుప్పొంగి సమాగతుం డగు తద్విప్రవరునకు నర్ఘ్యపాద్యంబులు సమర్పించి యుచితాసనసమాసీనుం గావించి విష్ణుసమర్పితం బగు తత్ఫలంబు భుజియింపం బెట్టిన యతం డది భుజియించి సుఖనిద్రాసమావిష్టుం డయ్యె నా సమయంబున.

సీ. ఆ పుణ్యదంపతు ♦ లట్లాతిథేయకృ
త్యంబులు నడపి హృ ♦ ద్వనరుహములఁ
బదిలంబుగా రమా ♦ పతిఁ దలంచుచు నుండి
యా రాత్రి గడచిన ♦ యంత మీఁద

సూర్యోదయం బైనఁ • జూచి తద్భూసురుం
డాహారమునకు నై • యడవి కరిగి
శాకమూలంబులు • సమకూర్చుకొని యొక్క
వటభూరుహము క్రింద • వసతి సేయ
నంతలోపలఁ దద్భూరు • హమున నున్న
బ్రహ్మరాక్షసు లెనమండ్రు • బ్రహ్మసూక్త
ములు పఠించుచు నేతెంచి • ముదముతోడ
నతనిఁగని యభివందనం • బాచరించి.

మ. అని రిట్లా ధరణీసురోత్తమునితో • నా బ్రహ్మరాత్రించరుల్
విను మత్యున్నతపుణ్యగర్వమున దు • ర్విద్యాభిమానంబునన్
ఘనులన్ వాదములం జయించిన మహా • ఘశ్రేణిమూలంబుగాఁ
గ నమందక్రియ మాకు నిల్వవలసెం • గ్రవ్యాదరూపంబులన్.

గీ. ఇట్టి తనువు లుడిగి • యే రీతి ముక్తుల
నగుచుఁ జనుదు మింక • నట్లు సేయ
వలయు భూసురేంద్ర • వర్ణింప నీకును
సాటి యొన్నఁ గలదె ? • జగములందు.

వ. అనిన వారలకు వాసవమహీసురుం డిట్లనియె.

క. ఏ రీతి మీరు చెప్పిన
నా రీతిన నడపి మిమ్ము • నతిరభసమునన్
జేరికొనఁ జూతు ముక్తి ని
శ్రీరమణీవిభుని యాన • ప్రేమదలిర్పన్.

సీ. భూసురుం డీ చంద • మునఁ బలుక వాక్యంబు
లాలించి యిట్లని • రసురవిప్రు
లధికదయాపూరి • తాక్ష నీ విదటికిఁ
జనుదేర మా కోర్కె • సఫల మయ్యె
నని యొకఁడు భవద్గృ • హాగతుం డైన నాఁ
డతని కాహార మి • చ్చితి తదీయ

పరితృప్తిమాత్రసం • భవఫలం బిచ్చిన
వైకుంఠమున కేగు • వారమనిన
వాసవుం డప్పు డా ధరి • త్రీసురులకు
నక్షతోదకపూర్వమా • నట్లుగాను
దత్ఫల మొసంగ వారలు • తత్క్షణంబ
ముక్తులై రాత్మసంతోష • ములు చెలంగ. 102

వ. ఈ చందంబునన బ్రహ్మరాక్షసులు తత్క్షణంబ రక్షోరూపశరీరంబులు విసర్జించి ముక్తులైనం జూచి ప్రాణాహుతిమాత్రఫలఫలంబున కచ్చెరువంది వాసవుండు నిజసదనంబున కేగుదెంచి స్నానాదికృత్యంబులు దీర్చి నిత్యకర్మానుష్ఠానంబు సమాప్తించి విష్ణుపూజావిధి యొనర్చి యగ్నిహోత్రంబు సేయు సమయంబున లక్ష్మీవల్లభుండు వృద్ధబ్రాహ్మణరూపంబున వాసవుని గృహంబున కేతెంచి యన్నం బడుగ నతని నవలోకించి దయాపరిపూరితహృదయుండై తన భామిని నవలోకించి యి ట్లనియె. 103

క. ఈ విప్రుఁడె లక్ష్మీశుం
డీ విధమున నిప్పు డింటి • కేతెంచెను సం
భావించి శాక మైనను
నీ వసుధామరున కొసఁగ • నీప్సిత మొదవున్. 104

వ. అంత. 105

క. పతి పలికినట్ల యెంతయు 106
నతిముదమునఁ బాద్యమిచ్చి • యా విప్రునకున్
గృతభక్తి నొసఁగె శాకము
మతి గ్రందక తద్వధూటి • మాన్యచరిత్రి.
107

వ. ఆ సమయంబున.

మ. ద్విజరూపంబున నాగతుం డగు రమా • ధీశుండు విఖ్యాతిత
ద్విజగేహంబున శాకమూలఫలముల్ • వేడ్కన్ మహాభక్తితో
భుజియింపన్ వసుధాదిభూతములు సం • పూర్తిం బ్రవర్తిల్లె నీ
త్రిజగంబుల్ పరితృప్తిఁ బొందె విభవ • శ్రీలన్ వినోదించుచున్. 108

వ. ఇట్లు తద్గృహంబున భుజియించి లక్ష్మీకాంతుండు చతుర్భుజధరుండై శంఖ చక్రగదాశార్ఙాదిదివ్యాయుధోపేతుండై శ్రీవత్సకౌస్తుభకుండలకిరీటగ్రైవేయహారాదిదివ్యభూషణసమేతుండై గరుడవాహనారూఢుండై యాద్విజవరునకుఁ బ్రత్యక్షుండై యతని నవలోకించి యిట్లనియె. 109

చ. మొదవులు పోయినన్ సిరులు ♦ ముందుగ నేర్పడ నాశ మొందినన్
సదనములోఁ దరిద్రత వ ♦ శంబుగ నిల్చినయైన మిక్కిలిన్
హృదయములోనఁ గందక మ ♦ దీయపదాంబుజనిత్యభక్తిచే
బొదలుచు వేడ్క నొందితివి ♦ భూసురవర్య దృఢవ్రతంబునన్. 110

క. పరితృప్తిఁ బొందితి నే నిట
మరువున భుజియించు శాక ♦ మునఁ ద్రిభువనముల్
ధరణీసుర నీ వడిగిన
వర మొసఁగెద నడుగవలయు ♦ వైభవ మొదవన్. 111

వ. అని యానతిచ్చిన పుండరీకాక్షునకు సాష్టాంగదండప్రణామం బాచరించి కృతాంజలి యై యమ్మహీసురుం డిట్లనియె. 112

చ. అనయము గర్మయోగమున ♦ నైనను జ్ఞానముచేత నైనఁ బ
ద్మనరుహసంభవాదులు భ ♦ వద్విమలాకృతిఁ గానలేనిచో
దినకరకోటితేజ జగ ♦ తీవర నిన్ను నుఁ గంటి నింతక
న్నను వర మెయ్య దింక భువ ♦ నంబునఁ జూడఁగ నిత్యవైభవా! 113

క. దయసేయుము భవదంఘ్రి
ద్వయభక్తియు ధర్మమందుఁ ♦ దాత్పర్యంబున్
నియతమనోనైర్మల్యము
నయ! నిత్యపవిత్రసంత ♦ తాయతచరితా! 114

వ. అని విన్నవించిన విప్రవరునకు నక్షయం బగు సంపదయును నిజపాదాంబుజములయందు నిశ్చల మగు భక్తియు ననంతం బైన వైకుంఠపురనివాసంబును గృపసేసి యాలక్ష్మీవల్లభుం డంతర్ధానంబు నొందె నట్లు కావున వసుధామండలంబున నన్నదానంబె పరమం బగు దానం బదియె సకల లోకతృప్తికిఁ గారణం బగు నని చెప్పినఁ బద్మజునకు నారదుం డిట్లనియె.

క. ఏ పుణ్యంబునఁ దుదల
శ్రీపతి సంతుష్టుఁ డగుచు • మేదిని నరులం
జేపట్టి యొసఁగు నిజపద
మా పుణ్యక్రమము దెలుపు • కుబ్జ యనినన్. 116

గీ. భువనసమితిలోన • భూలోక మధికంబు
తెలియ నందు మేలు • గలియుగంబు
తద్యుగమునఁ జక్ర • ధరు భక్తి యణుమాత్ర
మనసె కలుగు ముక్తి • మనుజులకును. 117

వ. మఱియును సాధారణధర్మంబులు జాతిధర్మంబులు ననఁగ నాచారంబు
ద్వివిధంబై పర్యవసించు నందు సాధారణధర్మంబు లెవ్వి యనిన. 118

సీ. దత్తానుతాపసం • తప్తుఁడై కుందక
దీనార్థులకు నిచ్చు • దాన మొకటి
విష్ణు మే తెంచుచో • విడువక సూటిగా
నిత్యంబు నడపెడి • సత్య మొకటి
భువన మంతయుఁ జతు • ర్భుజుని రూపం బని
పోలుపుగాఁ దలఁపోయు • బుద్ధి యొకటి
యాత్మలో నతిభక్తి • నంబుజోదరు నామ
ములు సర్వకాలంబుఁ • దలఁచు టొకటి
మహిని వివరింప సర్వసా • మాన్యసరణు
లివియె తెరువులు వైకుంఠ • భవనమునకుఁ
గలుషసహితుని కైన దు • ష్కర్ము కైన
జాతిహీనుని కైనఁ బ్రఖ్యాతితోడ. 119

క. ఇం దొకటైనను దప్పక
కందువతో నడప నేర్చు • ఘను లెల్లను సం
క్రందననుతులై మోక్షముఁ
బొందుదు రఖిలాఘకర్మ • పూరితులైనన్. 120

వ. మఱియు విప్రాదివర్ణధర్మంబు లెవ్వి యనిన. 121

సీ. నిత్యకర్మాదులు ♦ నియమంబు శౌచంబు
స్వాధ్యాయ మతిథిపూ ♦ జానిధాన
మల్పసంతుష్టియు ♦ నాత్మనిగ్రహమును
నగ్నిహోత్రంబును ♦ నార్జవంబుఁ
బైతృకాచరణంబు ♦ భావశుద్ధియుఁ గామ
మోహలోభాదుల ♦ ముణుఁగుపఱచు
టనృతంబు విడుచుట ♦ హరిపాదభక్తియు
దేవతాభజనంబుఁ ♦ దీర్థయాత్ర
సజ్జనులతోడి సఖ్యంబు ♦ సాధువృత్తి
వర్ణితం బగు ధర్మప్ర ♦ వర్తనంబు
దాన మాస్తిక్యబుద్ధియుఁ ♦ దత్త్వ మెఱుఁగు
యత్నమును విప్రధర్మంబు ♦ లమరవినుత. 122

సీ. మంత్రశుద్ధివిచార ♦ తంత్రంబు నీతియు
సముచితదానంబు ♦ సత్యవాక్య
మాచారవిధియు బ్రా ♦ హ్మణదేవభక్తియు
సప్తసంతాన సం ♦ స్థాపనంబు
ఘనకీర్తిధర్మసం ♦ గ్రహమును జతురంగ
బలపోషణము ప్రజా ♦ పాలనంబు
వీరశత్రునృపాల ♦ విజయంబు సాహస
మర్థులకును వాంఛి ♦ తార్థ మిడుట
రాయబారంబు నడిపి కా ♦ ర్యంబుఁ దెలిసి
తదనుకూలప్రయోగముల్ ♦ మొదలుకొనుట
పొలుపు మీఱంగ విభవసం ♦ పూర్ణుఁ డగుట
రాజులకు నివి ధర్మముల్ ♦ తేజ మలర. 123

క. క్రయవిక్రయములు దానము
నయమున ధనసంగ్రహంబు ♦ నలినాక్షపద
ద్వయభక్తియు నన నివియే
నియతము లగు వైశ్యులకును ♦ నిజధర్మంబుల్ 124

గీ. స్వామిహితమును దానంబు • శౌర్యమహిమ.
భూసురోత్తమపాదాబ్జ • పూర్ణసేవ
హరిపదాంబుజసద్భక్తి • యనఁగ నివియ
శూద్రులకు ముఖ్యధర్మముల్ • శుభచరిత్ర. 125

క. ఇందుఁ బవిత్రిను భూసుర
సందోహము తత్పదముల • సంతస మొదవన్
వందనము సేయు మనుజులు •
పొందుదు రభ్యుదయసమితిఁ • బూర్ణాత్మకులై. 126

క. వేదంబులు భూసురులును
శ్రీదయితుఁడు నొకసమము • చింతింపఁ గఁద
ద్వేదాధ్యయనమహీసుర
మోదంబే కారణంబు • ముక్తికిఁ దనయా. 127

క. ధరణీసురు మూలంబున
సురలకు సంతృప్తి యగుట • సుస్థిర మతియై
నరవరుఁడు సేయనే తగు
ధరణీసురతృప్తి యన్న • దానము చేతన్. 128

వ. మఱియును. 129

సీ. అనలంబు కరముల • నశ్వినీదేవతల్
నయనయుగ్మంబున • నలరు విధుఁడు
మూర్ధభాగంబున • మునుకొని నదు లెల్ల
పాదంబులందును • బవనుఁ డాత్మఁ
బరమాత్మ హృచ్చక్ర • పద్మమధ్యమున
వరుణుం డురంబున • వాసవుండు
కంఠనాళంబునఁ • గంజాప్తుఁడును గుక్షి
నమరపర్యులు భుజా • గ్రములయందు
సాధ్యులాధార జలరుహ • స్థలమునందు
వనధు లెల్లను మోహనా • వర్తములను

నందు నీ రీతిఁ దద్భూసు ♦ రోత్తమాంగ
సంఘులను దేవసంఘముల్ ♦ సందడిలుచు. 130

కం. ధరణీసురహృదయంబులు
పరితాపము నొందఁ జేయుఁ ♦ బాపాత్ములు దు
ష్కరనరకాభ్యంతరములఁ
బరితప్తశరీరు లగుచుఁ ♦ బడుదురు పుత్త్రీ. 131

సీ. అదిగాక విను భూసు ♦ రాధిపదర్శనం
బఖిలసంభవపాప ♦ శిక్షకంబు
నుర్వీసురేశ్వరా ♦ శీర్వాదములు వాంఛి
తార్థప్రదంబులై ♦ యలరుచుండుఁ
బెంపైన వసుధాని ♦ లింపవందనముచే
తనుకల్మషము లెల్లఁ ♦ దఱిఁగిపోవు
నిట్టు లిట్టి జగంబు ♦ లెల్లఁ బావనములు
గావించుచుందురు ♦ ధీవరేణ్య
కోటిజన్మములకు గాని ♦ సూటిపడదు
విప్రజన్మంబు వసుధను ♦ విప్రుఁడయ్యు
విష్ణుపాదాంబురుహభక్తి ♦ విడిచెనేని
యతనికన్నను శ్వపచుఁడ ♦ త్యధికుఁడరయ. 132

కం. తంతువు పుష్పంబులన
త్యంతంబును గలిసి మౌళి ♦ ధార్యం బగున
ట్లంతిమజాతిజుఁ డైనను
సంతతహరిభక్తితోడఁ ♦ జను హరిపురికిన్. 133

కం. హరిభక్తిఁ బొదలుచుండెడి
నరుఁ డంత్యజుఁ డైన విప్ర ♦ నకు నవ తరయన్
హరిభక్తిహీనుఁ డగు భూ
సురుఁ డైనను జరమజాతి ♦ సువ్వె మునీంద్రా. 134

చం. హరి జగదీశుఁ డార్తశర ♦ ణాగతవత్సలుఁ డాదిదేవుఁ డం
బరచరమౌళిరత్నరుచి ♦ భవ్యపదాంబుజుఁ డిందిరావధూ

వరుఁ డఖిలాండనాయకుఁడు ♦ వారిజనేత్రుఁడు భక్తిగమ్యుఁడై
పరగఁగ దుఃఖసాగరము ♦ భారమె దాఁటఁగ మర్త్యకోటికిన్. 135

క. భువనపరిపూర్ణతేజా
పవమానాకాశభూమి ♦ పానీయపయో
భవభానుతారకాధిప
భవజన్మనిదానరంగ ♦ పట్టణనాథా! 136

స్రగ్ధర. నందానందస్వరూపా ♦ నవగుణనిలయా ♦ నందితాహ్యంగతల్పా
కుందేందూదారహాసా ♦ కువలయనయనా ♦ కోణపాహార్యవజ్రి
సుందాభిఖ్యాతదుష్టా ♦ సురయుగమథనా ♦ సూర్యకోటిప్రకాశా
కందర్పారాతిమిత్రా ♦ కలిమలహరణా ♦ కాలకేయాపనోదా. 137

గద్య.

ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధ వరప్రసాదసహజసారస్వతచంద్ర
నామాంక రామవిద్వన్మణికుమారాష్టఘంటావధాన పరమే
శ్వర హరిభట్టారకవిరచితం బైన మత్స్యపురాణ
ఖండం బగు నిష్టధర్మోత్తరంబు నందు
ద్వితీయాశ్వాసము.

శ్రీ

శ్రీ

# మత్స్యపురాణము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీవల్లభ జగదీశ్వర
కావేరీమధ్యనిలయ • కరుణారసనం
భావిత బుధజనసేవిత
భావభవాకారరంగ • భవననివాసా. 1

వ. అవధరింపు మిట్లు కమలసంభవుండు నారదునకు సాధారణధర్మంబులును జాతిధర్మంబులును జెప్పి మఱియు నిట్లనియె. 2

ఉ. విప్రుఁ డనిట్టి కర్మపద • విం జనువారికి మంత్రతంత్రముల్
దప్పినఁ బ్రత్యవాయములు • దార్కొనివచ్చును గాని దానఁ దే
దప్పర మేశుఁ బొందెడు ప్ర • యత్నము నే నిట నీకు వేడుకం
జెప్పెద గుప్తమార్గమునఁ • జేయుము దత్క్రియ భూసురోత్తమా. 3

గీ. మహిమ నీవారశూకాగ్ర • మాత్రమైన
మోప నెడలేక శ్రీవిష్ణు • మూర్తితేజ
మలచరాచరవిశ్వంబు • నెలవుకొనియు
నిలుచు నారులకుఁ దెలియంగ • నలవిగాదు. 4

వ. అట్టి యెడ సంస్కారవిశేషంబున సమ్యగ్జ్ఞానంబు నొంది దేహి సంసారసాగరంబునఁ బరిభ్రమించుచు నైనను దద్గుణంబులం జెందక గురుముఖంబునఁ దత్పదంబు దెలిసి త్వగస్రక్తమాంసమేదోమజ్జాసహితం బై యతిహేయ శుక్లశోణితసంయోగంబున సముత్పన్నంబగు పాంచభౌతికదేహంబు నిత్యంబు గాదనియు శరీరమాత్రబాంధవులగు సుతదారాదులు దుఃఖప్రదులనియుఁ బ్రయాససంపాదితంబులగు పశు విత్తాదులు క్లేశసహితంబులనియు సుఖంబులు స్వప్నప్రాయంబులనియు వ్యాపారంబులు విద్యుత్సమానంబు లనియు మనంబున వితర్కించి ప్రసన్నుండై యభ్యాసయోగం

బునఁ జిత్తం బేకాయత్తంబు సేసి బాహ్యభ్రమంబు విసర్జించి కామమదా
దులఁ గుదియందిగిచి చక్షురాదీంద్రియంబుల ప్రచారంబు లంతరాత్మ
యందు నియమించి సంశయంబు నొందక దృఢనిశ్చయంబు గలిగి యఖం
డజ్ఞానపిహితచేతస్కుండై శిలామయ దారుమయ లోహమయ మృణ్మయం
బు లయిన ప్రతిమావిశేషంబుల నెద్దియైనఁ బీఠంబునం బాదుకొలిపి యందుఁ
బుండరీకాక్షు నావహించి యమ్మహాత్మునకు భక్తిపూర్వకంబుగ నుపచార
విధినగు పూజ సమర్పించి ప్రదక్షిణనమస్కారంబు లాచరింపఁగవలయు
నందు సాలగ్రామశిలామధ్యంబున లక్ష్మీకాంతుండు నిత్యనివాసుం డగుఁ
గావునఁ దత్పూజానమస్కృతులు పాపక్షయకరంబులు, ముఖ్యమార్గసాధనం
బులు నగు నట్టి సాలగ్రామమూర్తి విశేషంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 5

మ. హరి పూర్వంబున జీవకోట్లు నిజక ♦ ర్మాయత్తులై సంతతా
చరితానేక మహాఘసంఘములచే ♦ సంప్రాప్తమైనట్టి దు
ర్భరదుఃఖప్రదరౌరవంబులను సం ♦ భ్రాంతాత్ములై వేఁగఁ ద
త్పరితాపంబులు చూచి హృద్గతదయా ♦ దాక్షిణ్య సంపన్నుఁడై. 6

సీ. స్నానమూలంబున ♦ సకలపాపక్షయం
బునకునై ప్రవహించు ♦ పుణ్యనదులు
దానంబులను దుష్కృ ♦ తము లణఁగుటకునై
వేదవిద్యాయుక్త ♦ విప్రవరులు
యజ్ఞతంత్రములన ♦ త్యంతాఘశోషణం
బునకు నగ్నిత్రయం ♦ బును విచిత్ర
పూజావిధానసం ♦ పూర్తి నంహోనాశ
మునకు సాలగ్రామ ♦ ములు ననంగ
వీని సృజియింప దేహప్ర ♦ విష్టులైన
యట్టి జీవులు స్నానదా ♦ నాగ్నిహోత్ర
నిత్యపూజాదివిధులు వ ♦ ర్ణింపనడపి
చనుదు రవ్యయమగు మోక్ష ♦ సదనమునకు. 7

వ. అట్లు గావునఁ బుణ్యాదికృత్యంబులకు సాలగ్రామవిశేషంబులే లక్ష్మీనా
రాయణస్వరూపంబు లని తలంచి దేహి తన్మూర్తులయందుఁ బ్రణవపూర్వ

కంబులును నమోంతంబు లైన విష్ణునామంబులతోడఁ దులసిదళంబులఁ
బూజించి వైకుంఠనగర నివాసుం డగు నని మఱియు నిట్లనియె. 8

శా. సాలగ్రామశిలాభిషేకజలముల్ ♦ సంప్రీతితో మౌళిపై
లీలం దాల్చు నరుండు పాతకమహా ♦ ళిం బాసి విఖ్యాత ది
వ్యాలంకారసమేతుఁ డై చను నమ ♦ ర్త్యశ్రేణి హర్షంబునన్
జాలం బువ్వులవర్షముల్ గురియ స ♦ న్నాహంబునన్ ముక్తికిన్. 9

క. ప్రేమను బుధులకు సాల
గ్రామశిలాదానమిచ్చి ♦ కలుషవిహీనుం
డై మాధవపురి బొందును
సామాన్యుం డైన లోక ♦ సన్నుతచరితా. 10

క. చాతురి సాలగ్రామశి
లాతోయముఁ గ్రోలి నరుఁడు ♦ లక్ష్మీపతి లో
కాతిశయసౌఖ్యమొందును
జాతివిహీనాత్ముఁ డైన ♦ సత్యప్రభవా. 11

శా. శ్రీదేవీపతిరూపమై తనరు నా ♦ శ్రీమూర్తిఁ బూజించి స
ద్వేదోచ్చారితమంత్రపూర్వముగ నై ♦ వేద్యంబు లర్పించి స
మ్మోదంబందుచుఁ దత్ప్రసాదములు తా ♦ ముం బుత్రమిత్రాంగనా
సోదర్యావృతులై భుజించు నరు ల ♦ స్తోకవ్యథా ముక్తులై. 12

వ. హరిపురంబుఁ జేరుదురు. మఱియు భక్తియోగంబు కర్మనిష్ఠంబు జ్ఞాననిష్ఠంబు
ననద్వివిధంబై ప్రవర్తించునందు స్నానదానయజ్ఞస్థండిలపూజాదిబాహ్యోప
చారంబులయందు నిశ్చలంబగు భక్తికర్మనిష్ఠంబును ధ్యానయోగంబున
హృత్పద్మకర్ణికామధ్యంబునఁ బరమాత్మంగనుంగొను భక్తిజ్ఞాననిష్ఠంబునగు
నిట్లుబాహ్యాభ్యంతరసక్తంబగుభక్తిగలిగిన దేహికి వితర్కింప స్వల్పంబగు
ననలంబు తృణాదులచేతఁ బరివృద్ధం బై యరణ్యదహనసామర్థ్యంబునందు
చందంబున జ్ఞానానలంబు కర్మయోగప్రవృద్ధం బై సంచిత ప్రారబ్ధకర్మ
నిర్మూలనంబు సేయు బలిమిగలిగి స్వయంవ్యక్తంబై ప్రకాశించునప్పుడ
సద్యఃప్రసూతుండగు బాలునకు స్తన్యపానంబున దుగ్ధంబు గ్రోలెడు వెరవు
తనయంతనెసంభవించురీతి నతనికి స్వానుభవైకవేద్యం బై యవిచ్ఛిన్నంబై

యపరిమితంబైన బ్రహ్మానందసుఖం బుదయించిన దేహంబునం దాదరం
బు విడుచు దేహసమాగత సౌఖ్యంబులయందు విరక్తుండైనట్టి మహాత్ముం
డు సాయుజ్యంబు నొందునని చెప్పిన విని నారదుం డిట్లనియె. 13

చ. సరసిజనాభు వక్షమునఁ ♦ జయ్యన నుండుటకాని లక్ష్మి త
చ్చిరమునఁ బాదుగా నిలిచి ♦ సేవ యొనర్పఁగఁ జాలదట్టిచో
హరికిని గంఠభూషణము ♦ లై మణికీలిత కుండలంబులై
సిరసున ధార్యమైన తుల ♦ సీమహిమాతిశయంబుఁ జెప్పవే. 14

వ. అనినఁ బద్మసంభవుండు మునివరున కిట్లనియె. 15

క. సురలును నసురులు వారిధిఁ
దరువ సురాసింధురాశ్వ ♦ తరుణీమణులుఁ
దరు లుదయించిన ధన్వం
తరి యంతట నమృతకలశ ♦ ధరుఁడై యొదవెన్. 16

క. అయ్యవసరమున హరి యది
చయ్యన నీక్షించునంత ♦ నత్కుచములపైఁ
బయ్యెదఁ గీలించుచు నం
దొయ్యన నొక తరుణి వేడ్క ♦ నుద్భవ మందెన్. 17

క. ఈనియతి నమృతకలశము
లోనం జనియించి రమణి ♦ లోకోత్తరు ల
క్ష్మీనాథుఁ గాంచి ఘనల
జ్జానతవదనాబ్జ యగుచు ♦ నభినుతి సేసెన్. 18

మ. జలజాక్షుండును వేడ్కఁజూచెను సుధా ♦ సంజాతనంభోజినీ
దళవిస్తారితలోచనన్ విమలహ ♦ స్తం బక్వబింబాధరన్
బలభిన్మాత్తకరీంద్ర కుంభయుగళీ ♦ ప్రత్యాఖ్యవక్షోరుహన్
లలితాస్యన్ సుకుమారమూర్తిసహితన్ ♦ గాంతామణిన్ భ్రాంతిమై. 19

వ. అంత నప్పరమపురుషుండగు లక్ష్మీవల్లభుండు తత్కాంతాదర్శనసంజాత
హర్షంబున నుప్పొంగి మనంబు సింజానమంజీర కీలిత నీలరత్నప్రభాపటల
శ్యామలిత తత్పాదసరోరుహంబులయందును, బద్మరాగమణిమయం బగు
రశనాకలాపంబువలన సముద్గతంబగు తేజఃపుంజంబుచేత రంజితంబై

విచిత్రం బగు దుకూలంబునకు నాలంబనం బగు తదీయజఘనప్రదేశంబు నందును యౌవనతోరణంబునకు నై మదనభూపాలుఁ డొనర్చు హేమసోపానపరంపరలో యన విలసిల్లు వళిత్రయంబుచేత నభినుతం బగు తన్మధ్యభాగంబునందును జంభవైరి కుంభి కుంభస్థలంబుల చక్కఁదనంబు నధఃకరించు తత్కుచకుంభంబులయందును, కంకణ కేయూరరత్న ముద్రికా ముద్రితంబులై భిన్నంబులగు మిసమిస మెఱుంగుల తెఱంగునకునె అతనంబులు గఱపుచు సువర్ణలతికల చందంబున విలసిల్లు తద్బాహుదండంబులయందును, దరహసితవికసితం బై పూర్ణిమానిశాకర శోభాతిరస్కరణ చాతురీ ధురీణం బగు తన్ముఖారవిందంబునందును, బంచశరునకు సంచితంబులగు నిశితశరంబులో యనఁ బ్రసరించిన కటాక్షవీక్షణంబులకు నాలయంబులగు నయనసరోరుహంబులయందును, ననల్ప కల్పమహీరుహ ప్రసవకల్పితంబు లగు మాల్యంబుల సమ్మేళనంబున వినిర్గతం బగు సుమనోరజంబున శోణవర్ణం బగు తదీయ సీమంతంబునందును, సీమంతప్రసూనగుచ్ఛంబులను నిచ్ఛావిహారపరిదేశంబులకు భ్రమరప్రవేశ మనందగు తత్కబరికాభారంబునందును విచిత్రంబులగు మకరీపత్రంబులకు జాతంబులై సిద్ధంబు లగు చెక్కుటద్దంబులయందును నిమేషరహితం బగు దృష్టి పాదుకొల్పి యచ్చెరువందుచు నిట్లనియె. 20

మ. పరిపూర్ణాకృతియందు సద్గుణములన్ ♦ భాగ్యంబునం గోకిల
స్వరధిక్కారసమర్థభాషణవయః ♦ సంపద్విలాసంబులన్
సిరితోడం దులఁదూఁచ నెక్కవగుచున్ ♦ జెన్నొందుచున్నట్టి యీ
తరుణీరత్నము పేరికన్ దులసియై ♦ తర్కింప వర్ధిల్లెడున్. 21

వ. అని పలికి మరియు నిట్లనియె. 22

క. సిరికన్న నెక్కువగు నీ
తరుణి తులసియనుచు విబుధ ♦ తతి పొగడఁగ ము
చ్చిరమునఁ దాత్పర్యము సు
స్థిరముగ విహరించుఁగాత ♦ సిరులు దలిర్పన్. 23

సీ. అని పల్కనంతన ♦ యబ్జలోచన యప్పు
డఖిల దేవాసుర ♦ లభినుతింపఁ

బొలుపొంద నమృతసం • పూర్ణకలశిడిగి
హర్షమందఁగ మంద • యానయగుచుఁ
బార్శ్వంబులను దేవ • భామలు కర్పూర
నీరాజనంబులు • నెమ్మి నొసఁగఁ
గమ్మఁపూఁదేనియల్ • గ్రమ్మంగ నవపారి
జాతపుష్పవ్రీవ • ర్షములుగురియ
దరవిహసితంబు మోవిపైఁ • దళుకులొత్తఁ
దెలిగటాక్షాంచలోద్భూత • దృష్టి నిగుడ
హరిసమీపంబున కరుగ • నమ్మహాత్ముఁ
డాతలోదరి కరపద్మ • మందియచట. 24

క. ఆలింగనమున నయ్యమృ
తాలయ నాత్మీయహృదయ • మం దిడుకొనినన్
శ్రీలలన చూచి రోష
ప్రాలంబితవదనయగుచుఁ • బతికిట్లనియెన్. 25

చ. సరసిజనేత్ర నీకుఁ బ్రియ • సఖ్య మొనర్చెనె యీవధూటి య
న్యరమణి కాక్రమింపఁగడఁ • దైవమదవాప్త గృహంబనంగసు
స్థిరమగుయుష్మదుజ్జ్వల వి • శేషభుజాంతర మందునిల్చెనే
తరుణికినైన నాత్మవిభు • దాసినభామిని నైఁపవచ్చునే. 26

గీ. అట్లుగావున భువనవి • ఖ్యాతయగుచుఁ
జెలఁగుచుండెడు నట్టియీ • తులసిభామ
భవదుదారాంఘ్రిభక్తిచే • పడినదైన
భూరుహాకార సహితయై • పొలుచుఁగాక. 27

వ. అనిహరి ప్రియనుడివిన వచనంబులకుఁ జిన్నఁబోయి కన్నీరు ఱెప్పలనిం
చుచు సంతసంబు డిగి వేదనాయత్తచిత్తయై నిల్చియున్న యాతులసిలలనం
గనుంగొని పరమదయాపరిపూర్ణుండై చక్రధరుండు సాంత్వన పూర్వకం
బుగానిట్లనియె. 28

ఉ. కన్నుల నీరు నించుచునుఁ ♦ గందఁగ నేల లతాంగి యోశుభా
భ్యున్నత మూర్తి నీవమృత ♦ పూర్ణ మహాకల శంబునందు సం
పన్నవయౌవనంబులకుఁ ♦ బాత్రమవై జనియించి తట్టి నిన్
సన్నుతి సేయఁగాఁ గలరె ♦ సర్వజగంబుల దేవమానవుల్. 29

చ. సురలు నుతింప భూసురులు ♦ సొంపుగ వందన మాచరింప దు
ష్కరకలుషౌఘసంహరణ ♦ కారణ రూపమవై జగంబులో
నొరులకుఁ జూడ శాఖిక్రియ ♦ నుండినఁ బువ్వుదళ చ్ఛలంబునం
దిరముగ మూర్ధభాగమున ♦ నేను ధరించెద నిన్ను మానినీ. 30

క. ఎచ్చట నీవు జనింతువు
చెచ్చోఁ దరురూపమంది ♦ సిరులు దలిర్పన్
మచ్చిక మదిఁ దలఁకొన నే
నచ్చట విహరించువాఁడ ♦ నంభోజాక్షీ! 31

సీ. నవకిరీటమున క ♦ న్నను వాసిగా మౌళిఁ
బాదుగా ధరియింతు ♦ నీదళంబుఁ
దెలివితోఁ గుండలం ♦ బుల భాతి శ్రుతులందు
నేర్పుతో ధరియింతు ♦ నీదళంబు
దామంబులందున్ను ♦ ద్దామంబుగా గ్రీవ
నియతిమై ధరియింతు ♦ నీదళంబు
నురమున నవతైన ♦ సిరితోడ సరివెంద
నిగుడించి ధరియింతు ♦ నీదళంబు
నదియునుంగాక భువనత్ర ♦ యంబునందుఁ
బాదపాకృతిఁ దాల్చి నీ ♦ పాదమూల
మున రమాకాంతతోఁగూడ ♦ మోదమలరఁ
గ్రీడ సేసెదఁ బూబోఁడి ♦ ప్రేమ మలర. 32

క. నినుఁ బూజించిన జనులకు
ననుమానము లేక కలుగు ♦ నస్మత్పుర సా
ధునివాస జనితసౌఖ్యము
వనజాయతలోలనయన ♦ వర్ణింపంగన్. 33

మ. ధరణిన్ సర్వసుధాశనాహితచమూ ♦ దర్పంబువారింప సు
స్థిరలీలన్ యదువంశసంభవుఁడనై ♦ చిత్రంబుగా గోపికా
తరుణుల్ గొల్వ భవద్వనాంతరములన్ ♦ దారొంకున్న హర్షంబుతో
నెరవై క్రీడ యొనర్చువాఁడ రమణీ ♦ నిత్యప్రభాతంబులన్. 34

క. సిరి యలిగిన వత్సనములకుఁ
బరితాపము నొందవలదు ♦ పద్మాననయోఁ
దిరముగ నిల్చెద నీయం
దరయఁగఁ దత్పంకజాల ♦ యానహితుఁడనై. 35

వ. మఱియు నిన్ను జనులు తులసి యనియు, విష్ణుప్రియ యనియు, నమృతో
ద్భవ యనియు, నసురూపయనియు, మాధవియనియు, వైష్ణవి యనియు,
కుండలి యనియు, మోహిని యనియు, శంఖిని యనియుఁ బాదప్రభ
యనియు, నారాయణియనియుఁ జక్రిణియనియు నిట్లు ద్వాదశనామంబులఁ
గొనియాడి కలుషరహితులును వైకుంఠనివాసులు నగుదురని యాలక్ష్మీవల్ల
భుం డానతిచ్చినయంత వసుధాంశంబున నమృతకలశసంభవ యగు నా
తులసీలలామ జగంబులు పవిత్రంబులు సేయుకొఱకునై తరురూపంబు దా
ల్చి నిజపుష్పదళంబుల విష్ణుకైంకర్యంబు సలుపుచుండె నని చెప్పి చతురాన
నుండు మఱియు నిట్లనియె. 36

క. తులసీతరు సన్నిధి వి
పులకను మృష్టాన్న మొసఁగు ♦ పుణ్యుఁడు సిరులన్
వెలయుచు మని తుద లక్ష్మీ
లలనాధిప లోకసుఖము ♦ లను గను ననఘా! 37

క. తులసీతరుమూలంబున
జలములు పరిపూర్తినిడిన ♦ సజ్జనులు మహా
కలుషములఁ బాసి విభవం
బులఁ బొందుదు రాత్మబంధు ♦ పుత్త్రులతోడన్. 38

క. తులసీమూలంబున ని
శ్చలభక్తిని విష్ణుపూజ ♦ సలుపు మహాత్ముల్

బలువైన రోగజాలము
గెలుతురు పరిపూర్ణవిభవ • కీర్తులు వెలయన్. 39

క. కన్నులఁ జూచిననైనను
జెన్నుగ మదిలోనఁదలఁపు • చేసిననైనన్
మన్ననఁ బొగడిననైనను
నెన్నంగాఁదులసి నరుల • కిష్టములొసఁగున్. 40

క. తులసీ నలినాక్షంబులు
గళముల ధరియించుచక్రి • కరభక్తులు ని
శ్చలసుజ్ఞానము-లొదవఁగఁ
దలఁకరు యమహస్తకాల • దండంబునకున్. 41

క. అనయము తులసీదళముల
వనజాక్షుని బూజసేయు • వారలు భవసం
జననమునొందక విభవం
బునఁజనుదురు పుణ్యలోక • మునకు మునీంద్రా ? 42

గీ. తులసిమూలంబు మృత్తిక • తిలకముగను
ఫాలభాగంబులను దాల్చు • భవ్యమతులఁ
జూచినప్పుడె భయమంది • చోద్యముగను
దొలఁగిచనుదురు యమదూత • లలఘుచరిత ! 43

క. శ్రీవిష్ణు ప్రీతిగఁ దుల
సీవననికటమున భక్తిఁ • జేసినదానం
బావనజోదరపురి సౌ
ధావాసంబునకు హేతు • వై విలసిల్లున్. 44

వ. మఱియు నొకపురాతనోపాఖ్యానంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 45

సీ. నిరుపమప్రాకార • పరిఖగోపురసౌధ
వరతోరణద్వార • వర్ణితంబు
మత్తేభతురగ • హేమస్యందనానేక
వీరనాయకచమూ • విశ్రుతంబు
పణ్యపూర్ణాపణా • గణ్యపణ్యాంగనా
పాదలాక్షారస • భ్రాజితంబు

వివిధోపవనకల్ప • వృక్షపుష్పాంతర
వ్యాకీర్ణపరిమళ • వాసితంబు
దమ్మ్రుటానేక భేరీమృ • దంగపటహ
పణవగోముఖ వాద్యసం • భవనినాద
బధిరితాశావకాశంబు • భాసురంబు
నగుచు విలసిల్లుఁబుష్ప క • న్యాపురంబు. 46

సీ. ఆపురంబున సంత • తాచార సహితుండు
వేదవిద్యాశాస్త్ర • విశ్రుతుండు
నిత్యకర్మక్రియా • నియతుండుహరిపాద
భక్తుఁడార్యుఁడులోక • పావనుండు
సత్యంబునిరతంబు • జరుపుచుండెడివాఁడు
సద్గుణప్రఖ్యుండు • సర్వసముఁడు
పరకాంతఁదల్లిఁగా • భావించుపుణ్యుండు
పరమతపోధ్యాన • పారగుండు

దేవలుండనునొక్క భూ • దేవసుతుఁడు
తల్లిదండ్రులు మృతిఁబొందఁ • దన్నుఁబ్రోచు
బాంధవుండొక్కఁడైనను • బ్రాపులేక
బ్రహ్మచర్యము తీర్థయా • త్ర విడకుండు. 47

వ. మఱియు నప్పరమ భాగవతోత్తముఁడు వయఃపరిపూర్ణుండయ్యును గామ
క్రోధమదాదులందగులువడక ఖడ్గధారాగమనంబు చేయుచందంబున న
ప్రమత్తుండై బ్రహ్మచర్యంబు నడపుచుఁ బుణ్యనదీ విశేషంబులయందుఁ
దీర్థంబులాడుచు భిక్షాశియై హరినామమంత్రంబు జపించుచేమఱక సంచరిం
చుచు నొక్కనాఁడు భాగీరథీతీరంబునకరిగి తత్పుణ్యజలంబుల స్నానాది
కృత్యంబులుదీర్చి భిక్షాశియై హరినామ మంత్రజపంబు మఱవక జపించుచు
న్న సమయంబున నొక్కసాలవృక్షంబు శాఖాగ్రంబుల వ్రేలుచు శవాకా
రంబులు దాల్చి మొఱలిడుచున్న నరనారీజనంబులం గనుంగొని దయాపరి
పూర్ణుండై వారలమనోరథంబుఁ దెలియంబూని యచ్చటికరిగి యందుఁదల్లి
దండ్రులరూపులు దోఁచినవారలంజూచి యిట్లనియె. 48

ప. సరసిజ మిత్రతేజమున ♦ సంతత తప్తశరీరులై నిరం
తరమును దీవ్రదుఃఖమున ♦ ధైర్యము జాఱఁగ క్షుత్పిపార్తులై
మొఱలిడుచున్ ఘనోష్ణమున ♦ మోములు వాడఁగఁ బుణ్యులార! యీ
తరువున మీరు వ్రేలెదువి ♦ ధంబది దెల్పుఁడు నిశ్చయంబుగన్. 49

క. చలనమునొందని నామది
చలియింపఁదొడంగె నేఁడు ♦ చర్చింపమహా
త్ములు మీరలు మిమ్ముఁజూచిన
నలరదె దయ యెట్టివారి ♦ కైనను దిరమై. 50

క. ఏపని సెప్పిననైనను
నోపికఁ దత్కార్యభార ♦ మొనరించెద నీ
రూపమున మీరు దుఃఖితు
లైపరఁగఁగ నేల భూరు ♦ హస్థితులగుచున్. 51

వ. దేవలుండట్లు దయాపూర్వకంబుగాఁ బలికిన వచనంబులకు సంతసించి య
ద్వృక్షనివాసు లిట్లనిరి. 52

క. పనివడిదయ నీవిచ్చటి
కిని వచ్చితి వమర్త్యపూజ్య ♦ కీర్తులు వెలుగన్
మునివర మద్వృత్తాంతము
వినుపించెద మవధరింపు ♦ వీనులు దనియన్. 53

వ. అనిననట్లు కాకయనుఁడు. 54

సీ. మత్స్యదేశంబున ♦ మానితంబైయొప్పు
పుష్పకన్యానామ ♦ పురవరంబు
దేవలుండన మహీ ♦ దివిజుండు గలఁడు త
త్పురమున నాచార ♦ పూర్ణుఁడనఘుఁ
డతఁడు బ్రహ్మజ్ఞాన ♦ చరితుఁడైయనయంబు
బ్రహ్మచర్యంబునఁ ♦ బరఁగుచుండుఁ
బుణ్యతీర్థస్నాన ♦ పూతాత్ముఁడై తపో
ధ్యానసంయుక్తుఁడై ♦ తనరువాఁడు

నతని వంశాబ్ధిభవులమే ♦ మనఘచరిత
యామహాత్ముఁడు సద్గృహ ♦ స్థాశ్రమమున
నిలిచి సంతానహేతువై ♦ వెలసెనేని
కలుగు మాకును నూర్ధ్వలో ♦ కముల సుఖము. 55

గీ. అతఁడు వైవాహికక్రియ ♦ నలరఁడేని
త్రిదివమునఁ దర్పణాంజలి ♦ తృప్తిలేక
నడవవలయును బాతాళ ♦ నరకమునకు
వితతదుఃఖార్తులైనట్టి ♦ పితరులకును. 56

క. ఇది కర్మమయ మహీజము
తుద మొదలెఱుఁగంగ రాదు ♦ తోయజభవుకున్
గుదియఁగఁ దివియక పోదిది
యదవదనుక్రమించుఁగాని ♦ యణఁగదు విపాకి! 57

వ. మఱియు నరునకు మునిఋణంబు దేవఋణంబుఁ బిత్రృణంబు నను ఋణత్రయంబున సంభవించు నందస్ఖలితబ్రహ్మచర్యంబున మునిఋణంబువలనను, నగ్నిహోత్రక్రియాకలాపంబున దేవఋణంబువలనను, బరమసాధ్వియగు కులసతియందు సముత్పాదితంబగు సంతానంబునఁ బిత్రృణంబువలనను ముక్తుండై యనంతరంబు సంసారంబు పరిత్యజించి చతుర్థాశ్రమస్వీకారంబునఁ బరమలోకనివాసుండగు నట్లగుటం జేసి ఋణంబులుదీర్చ సమర్థుండు గాని జ్ఞాననిష్ఠునకునైనను సంభవించు యథార్థజ్ఞానంబు ఋణవిమోచనపర్యంతంబు పునర్జననంబునకుఁ గారణంబగుఁగాని పునరావృత్తిరహితలోకనివాససౌఖ్యకరంబుగాదు. మహీరుహంబు క్రమక్రమంబునఁ బల్లవితంబును గోరకితంబును బుష్పితంబును నై తుద ఫలంబుఁ జూపునది దోహదసంస్కారసమయంబున ఫలంబుఁ జూప శక్తంబగునట్లాశ్రమత్రయంబున ఋణవిముక్తి నొంద దేహి యంతవైకుంఠనివాసంబను ఫలంబునొందు. వర్ణాశ్రమసమేతులగువారలకుఁ గర్మకాండప్రతిపాదితంబులగు చత్వారింశత్సంస్కారంబులను సాధనంబె ప్రధానంబు. అది శరీరంబునకు జననకారణంబగునట్లు సంభవించి శరీరికర్మమూలంబున సంస్కృతుండై విప్రుండనంబఱగు నవ్విప్రుండు ఋణత్రయవిముక్తుండై పరమపదంబునకుం జనునని యా మహీరుహ

నివాసులు పలికిన వచనంబు లాకర్ణించి దేవలుండు పరితాపంబునొంది యందు
శుశ్రూషాభూతులగు జననీజనకులంగనుంగొని గోత్రనామపూర్వకంబుగా నమ
స్కరించి యిట్లనియె. 58

క. పరికింపఁ బుష్పకన్యా
పురనిలయుఁడ దేవలాఖ్య ♦ భూసురుఁడ భవ
ద్వరవంశసంభవుండను
గరుణింపఁగవలయు నన్ను ♦ గౌరవ మొదవన్. 59

శా. ఆకర్ణింపుఁడు పుణ్యులార! కలుషా ♦ యత్తంబు సంసారమా
లోకింపంగ ననేకరూపములఁ దైరో ♦ లోక్యప్రకాశార్థమై
యాకంజాసనుఁ డాత్మలోఁ దలఁచి భ ♦ వ్యాకారశోభావహో
వ్యాకీర్ణాంగనలన్ సృజించెను దపో ♦ వైఫల్యబీజంబులన్. 60

క. మాయామృగరూపంబులు
కాయని బీరెండలాత్మ ♦ ఘాతుకలు నరుం
డేయని నిశితశరంబులు
పాయనికర్మములు సతులు ♦ పరికింపంగన్. 61

తే. గీ. అట్లుగావునఁ దద్గృహ ♦ స్థాశ్రమమున
సతులయందును బుత్త్రసం ♦ తతులు వడసి
కర్మయోగమునఁ జరించు ♦ ధర్మరతులు
కడఁక సంసారజలరాశిఁ ♦ గడువఁగలరె? 62

ఉ. మీనము మాంసలోభమున ♦ మించురయంబున నామిషంబునన్
గానఁగరాక తీక్ష్ణమగు ♦ గాలము మ్రింగి నశించుతీరునన్
మానవుఁ డాత్మవిత్తసుత ♦ మానినులందతి మోహసక్తుఁడై
కానఁగలేక పొందు ఘన ♦ కర్మవశంబున రౌరవంబులన్. 63

సీ. సతులయంగంబున ♦ నతిఘనంబగుఁగామ
మందుమూలంబున ♦ నగును దోష
మందున బుద్ధిప ♦ ర్యాప్తమై నిలువదు
బుద్ధి నిలువమిచేఁ ♦ బోవు తెలివి

తెలివణంగినచోట ♦ ధృతిఁజాఱునొయ్యన
చెదరిన ధైర్యంబు ♦ పదిలముడుగుఁ
బదలంబునుడిగినఁ ♦ బండితులకయినఁ
గలుగదుజ్ఞానంబు ♦ గల్గెనేని
నిలువగానేరదయ్యెది ♦ బలిమిగలిగి
యిట్టిసుజ్ఞానవిరహితుం ♦ డైన నరుఁడు
విపులసంసారకూపంబు ♦ వెడలలేక
భ్రాంతుఁడగుఁగర్మపాశాభి ♦ బద్ధుఁడగుచు. 64

గీ. అట్లుకావునసంస్కార ♦ మందు సుఖముఁ
బొందుమానవులకునెల్ల ♦ పువ్వుబోండ్లు
కారణంబులు దుష్కృతా ♦ గమనములకుఁ
ప్రత్యయంబులు మోక్షవై ♦ ఫల్యములకు. 65

క. తనయునిమూలంబుననై
నను మోక్షము గలుగుననిన ♦ నానాఁటికి ద
త్తనయుఁడు దుష్పథమునఁ దిరి
గినఁ గలుగునె భుక్తి ముక్తి ♦ కీర్తులుజగతిన్ 66

వ. అట్లగుటంజేసి సమ్యగ్జ్ఞానసమేతుండగు మానవోత్తమునకు బ్రహ్మచర్యాశ్రమంబె కైవల్యప్రాప్తికిఁ గారణంబును, బితృదేవతా తృప్తికిఁ బ్రధాన కారణంబును నగుఁగాని యితరోపాయంబులు కైవల్యప్రాప్తికేని పితృతృప్తికేని కారణంబులు గావని పలికినఁ బితృదేవతలయందు దేవలుని జనకుండు హర్షితుండై తనయుని నవలోకించి యిట్లనియె. 67

ఉ. భూవలయంబులోనఁ బరి ♦ పూతచరిత్రుఁడవై శమంబునన్
గోవిదులెల్ల మేలనఁగఁ ♦ గోర్కెఁజలింపక నిశ్చలుండవై
నీవిట్లు బ్రహ్మచర్యమతి ♦ నిర్మలవృత్తిఁ జరించుచుండఁగాఁ
బావనమయ్యె మాకులము ♦ భాసురపుణ్యసమేత! పుత్త్రికా! 68

క. ఇలఁ బుణ్యకీర్తనుండన
వెలయంగ గృహస్థధర్మ ♦ విఖ్యాతుఁడవై

కులముద్ధరించి మము ని
శ్చలపదమున నిలుపవలయు • సత్యచరిత్రా! 69

క. సతిఁ బెండ్లియాడి యజ్ఞ
వ్రతదానములాచరించి • వసుమతిలోనన్
బితృదేవతల ఋణంబులు
చతురతఁ దీర్పఁగవలయు • సన్నుతిసేయన్. 70

సీ. పుణ్యతీర్థస్నాన • పూతాత్ముఁడైనను
లలితసద్గుణసంఘ • నిలయుఁడైనఁ
బాత్రదానక్రియా • ప్రఖ్యాతుఁడైనను
బరిపూర్ణశాంతి సం • భరితుఁడైన
నాగతాతిథిపూజ • నలరెడువాఁడైన
నతిశయంబుగ నీతిచతురుఁడైనఁ
గామలోభమదాది • గర్వహీనుండైనఁ
గమనీయహరిభక్తి • కలితుఁడైన
సంతతంబును సత్యవి • శ్రాంతుఁడైన
నధికసుజ్ఞానసంయుతుం • డైన నరుఁడు
ఋషిసురేశ్వర పితృదేవ • ఋణములెల్లఁ
దీర్పకుండినఁ బోవఁడు • త్రిదివమునకు. 71

గీ. ఇది యెఱింగిమాకు • హితమాచరింపఁగ
మదిని నీకు బుద్ధి • యొదవెనేని
తనరఁ బెండ్లియాడి • ధర్మంబుఁ గైకొని
సప్తతంతునరణి • సలుపవలయు. 72

వ. అని పలికిన జనకునకు దేవలుండిట్లనియె. 73

సీ. పాదులూడెను దంత • పఙ్క్తులు కేశముల్
పతితంబులయ్యెఁ బ • దిలము దప్పి
వళులచే స్రుక్కెను • వదనంబు వెలుకనై
యతికుంచితములయ్యె • నవయవములు
కన్నులఁ దిమిరంబు • పన్నియుండఁగఁ బూనెఁ
జాలెను భోగవాం • ఛాప్రశంస

బలురోగచయము సం ♦ భ్రమమున నెదిరించెఁ
గఫముకంఠంబునఁ ♦ గలుగఁజొచ్చె
నధికశుష్కతయును మదీ ♦ యాంగములకు
సూటిఁబఱతెంచె నింకనే ♦ వీటికైనఁ
బెండ్లియాడెనని పోవఁ ♦ బ్రియముఁదప్పి 74
బాలుతెల్లను నవ్వరే ♦ భ్రాంతుఁడనుచు.

గీ. తండ్రిమాటవినక ♦ తలఁగిపోవఁగరాదు;
ఋణముఁదీర్పకున్న ♦ నణఁగదఘము;
వార్ధకంబువచ్చె ♦ వైపుగా; దిఁక గృహ 75
స్థాశ్రమంబునకును ♦ యత్నమెట్లు?

వ. అని పలికిన దేవలునకు జనకుం డిట్లనియె. 76

సీ. చేదిదేశంబున ♦ నాదిమంబగు నట్టి
పురము గోమతి యనఁ ♦ బొలుపుమిగిలి
కలదు తత్పురమునఁ ♦ గౌండిన్యుఁడను పేర
విలసిల్లునాకభూ ♦ విబుధవరుఁడు
అతనికూఁతురు సత్య ♦ వతియనాఁ దెలివొందు
కన్యకారత్నంబు ♦ ధన్యచరిత
యాపుణ్యవతినీకు ♦ నలరెడు భార్యయై
తద్గర్భమందు సం ♦ తతి జనించు
నట్టి సంతానమున నమా ♦ కభిమతార్థ
సిద్ధియగుఁగాన మదిలోనఁ ♦ జింతవదలి
సంశయింపక వేడ్కతోఁ ♦ జనఁగవలయుఁ 77
బూజితంబగు తత్పురం ♦ బునకుఁ దనయ!

వ. అనిన దేవలుండట్లకాకయని తద్వచనంబుల కొడంబడి పితృదేవతలకు నమస్కృతులొనర్చి తద్గోమతీనగరంబునకుంజని కౌండిన్యుని సదనంబున వేదోక్తమార్గంబునఁ దత్ప్రియతనయయగు సత్యవతి కన్యకం బెండ్లియాడి గృహస్థాశ్రమసమేతుండై యజ్ఞాదికృత్యంబు లాచరించుచు నిత్యనైమిత్తిక

కామ్యకారుణ్యపైతృకాచరణంబులఁ బితృదేవతాతృప్తిఁ గావించుచు నతిథి
పూజాసమేతుండై పశుధనధాన్యాదిసంపత్పరివృతుండయ్యును దత్సుఖా
సక్తుండై మోహంబునొందక విష్ణుభక్తిసహితహృదయుండై సంసారసంగ
తుండయ్యును దద్గుణలిప్తుండుగాక ధర్మమార్గంబునఁ బ్రవర్తించుచున్న
యెడ నొక్కనాఁడు. 78

సీ. నిరుపమపతిభక్తి ♦ నిర్మలహృదయయై
తెలివొందునయ్యువ ♦ తీలలామ
ఋతుమతియై దిన ♦ త్రితయంబుమౌన పూ
ర్వంబుగ నిశ్చలి ♦ వ్రతమునడపి
యంత నాలవదినం ♦ బరుదెంచుచో ఋతు
స్నానార్థమైజలా ♦ శయముఁజేరి
తత్తీరమందునం ♦ త్యజుఁడొక్కఁ డతిదీర్ఘ
విపులాత్మకేశముల్ ♦ విప్పుకొనఁగఁ
జూచి యచ్చెరువంది యా ♦ సుందరాంగి
వరునివర్ణించి పలికినఁ ♦ బాపమనుచుఁ
దద్గతంబగుదృష్టి సం ♦ ధానముడిగి
తీర్థతోయాంతరంబునఁ ♦ దీర్థమాడి. 79

సీ. గృహమునకేతెంచి ♦ గృహకృత్యములఁదీర్చి
యాసత్యవతి మహా ♦ హర్షమొదవ
భూసురగోసేవ ♦ పూజలుగావించి
పతిభుక్తశేషంబు ♦ భక్తితోడ
భుజియించియారాత్రి ♦ నిజనాయకునిగూడి
సంభోగములు వేడ్కఁ ♦ జలుపునపుడు
విభునికేశంబులు ♦ వీడియంసంబునఁ
దూలికాకృతులతోఁ ♦ దూలియాడ
నవి నిరీక్షించి పూర్వదృ ♦ ష్టాంత్యజాత
కేశపాశంబు తలఁపులోఁ ♦ గీలుకొలుపు

నాక్షణంబునఁ దద్గర్భ ♦ మందునిలిచె
దేవలునివీర్యమధిక ప్ర ♦ దీప్తమగుచు. 80

వ. ఇట్లు సత్యవతి స్మృతిపూర్వకంబుగాఁ బ్రారబ్ధంబగు గర్భంబు ధరియించి దశమమాసంబున శుభలగ్నంబునఁ గుమారునింగాంచిన దేవలుండు తత్కుమారునిం గనుంగొని పితౄణమోచనంబయ్యెనని హర్షంబున నుప్పొంగి యబ్బాలకునకు జాతకర్మాది కృత్యంబులుదీర్చి సుభద్రుండను నామంబిడిన నాతండు శైశవంబు విడిచి యుపనయనాది సంస్కారంబుల సంస్కృతుండై వేదశాస్త్రంబులభ్యసించియుఁ బితృమాతృవేద దేవతానిందకుండై కౌమారంబతిక్రమించి యౌవనవయఃపరిపూర్ణుండై కామక్రోధాదివశంబునొంది సంచరించుచు నొకనాఁడు తత్పురాంగణంబునం గలుగు నారామంబునకుంజని యందు సంచరించుసమయంబున. 81

సీ. మరుశరంబులరీతి ♦ మెఱుఁగులై వెడలెడు
కలికిచూపుల మోము ♦ తొలకరింప
నునుపులై బిగువులై ♦ ఘనములై తెలివొందు
కుచములంచితలీల ♦ గునిసియాడ
నతులలాక్షారసాం ♦ చిత పాదయుగళంబు
జఘనభాగంబును ♦ సందడిలఁగ
గమనవేగోద్భూత ♦ గంధవాహముచేత
దుసిగిపయ్యెదకొంగు ♦ దూలియాడఁ
బట్టుబిగిదప్పి తనచేతి ♦ పారువంబు
తద్వనాంతరసహకార ♦ తరువుకడను
వ్రాలనీక్షించి పరువుతో ♦ వచ్చెనటకుఁ
దలపు కదలిక నొక్కమా ♦ తంగయువతి. 82

వ. ఇట్లు తదారామమధ్యంబున కతిత్వరితగమనంబునఁ జని యాచండాల భామినివయోరూపలీలాపరిపూర్ణుఁడగు విప్రకుమారునిం గనుంగొని. 83

సీ. కొనగోళ్ళఁ బుష్పముల్ ♦ గోయునెపంబునఁ
గరమెత్తి కక్షభా ♦ గంబుఁజూపు
వదలినవలిపప ♦ య్యెదకేలఁ దొలఁగించి
పాలిండ్లనునుజాయ ♦ బయలుపఱుచు

హర్షలజ్జాసాధ్వ ♦ సాతిచంచలములై
విలసిల్లుతళ్కుఁజూ ♦ పుల నటించుఁ
బారువంబుతనచే ♦ పడినన్నైనను బోక
సన్నల నెలయింత ♦ సందుకొలుపు
నిట్లుతత్కాంత మదనప్ర ♦ హితములైన
భావములఁదన్మహీసుర ♦ భావనిబిడ
ధైర్యమంతయు వదలించి ♦ దర్పకునకు
వశమునొందింప నతఁడుఁద ♦ ద్వనితఁ గదిసి. 84

మ. స్మరబాణంబుల కోర్వఁజాలక మహా ♦ సంతాపచేతస్కుఁడై
ధరణీదేవకుమారుఁడప్పుడచటన్ ♦ దత్కాంతభావంబు శాం
తరసోద్రిక్తమృదూక్తిచే నొడఁబడన్ ♦ దార్కొల్పి యాభామతో
వరసంభోగసుఖంబునొందెఁ బ్రసవ ♦ వ్యాకీర్ణతల్పంబునన్. 85

వ. ఇట్లు సుభద్రుండా చండాలకాంతాగమన జనిత పాతక సమాక్రాంతుఁడయ్యును దద్గతమోహంబు విసర్జింప శక్తుండుగాక పతితత్వంబునొంది కులదూషితుండై యంత్యజగృహప్రాంగణంబున నొక్కకుటీరంబుఁ గావించి చౌర్యద్యూతపానాదివ్యసనంబులందవిలి నిజాచారంబు విడిచి యాభామినింగూడి సంసారసుఖంబనుభవించుచు. 86

క. ఆపతితుఁడైన విప్రుఁడు
పాపములకుఁ దల్లడిలక ♦ పామరుఁడై యు
ద్దీపిత మదనాతురుఁడై
యాపడఁతికిలోలుఁడయ్యె ♦ ననవరతంబున్. 87

గీ. అట్లు చండాలభామతో ♦ ననఁగిపెనఁగి
హర్షమొనఁగంగ ధేనుమాం ♦ సాశియగుచు
నాసుభద్రుండు మదినింత ♦ యైనఁ దాప
మందికుందక దిరుగాడు ♦ మందగతిని. 88

వ. ఇట్లు లజ్జాసాధ్వసవిహీనుండై వర్తించుచనతనిగృహప్రాంగణంబున నొక్కతులసీమహీరుహమూలంబున నతనికిఁ గాలంబరుగుదెంచిన. 89

సీ. పాశగదాకుంత • పాణులై సమవర్తి
కింకరుల్ చెలరేఁగి • పొంకమలరఁ
జండాలకామినీ • సంగతుండగు సుభ
ద్రునిఁ గొనిపోవను • ద్యుక్తులగుచుఁ
దద్గృహప్రాంగణ • స్థలమున కరుదెంచి
తులసీతరుచ్ఛాయ • మెలఁగుచున్న
పాపాత్ముఁ డగునట్టి • పతితుని వీక్షించి
యాతనిఁ జేరంగ • నలవిగాక
వరుసఁ దప్పక పదుమూఁడు • వాసరములు
నిలిచి యచ్చోట దోషసం • చలితహృదయు
లగుచు నొండొరులాత్మ నా • యముని యాజ్ఞ
కును వణంకుచుఁ దమలోన • ననిరి యిట్లు. 90

గీ. జలజనాభుండు భూరమా • సహితుఁ డగుచు
సంతతంబును బృందావ • నాంతరమునఁ
గ్రీడఁ జేయుచునున్నచోఁ • గినిసి మనకు
నీతరుచ్ఛాయఁ జేరంగ • నీతి యగునె ? 91

క. పాపాభిసంయుతుం డగు
నా పతితుని గొనుచుఁ జనని • యప్పుడె మిగులం
గోపించు నంతకుం డన
నీ పని సమకొల్ప నలవి • యెట్లగుఁ దలఁపన్. 92

మ. అని యీరీతిఁ గృతాంతదూతలు భయా • యత్తాత్ములై యా సుభ
ద్రునిఁ జేరంగ నశక్తులైన యెడ సు • త్తుంగాకృతుల్ శంఖ చ
క్రనవాంభోజ గదాసమన్వితకరుల్ • రాజద్విభూషాకరుల్
వనజాతాక్షుని కింకరుల్ చనిరి భ • వ్యం బైన యచ్చోటికిన్. 93

సీ. ఈ ఛందమున రమా • ధీశుని కింకరుల్
బలిమితో నచ్చోట • నిలిచినంతఁ
దులసీదళామోద • లులితానిలంబుల
నతిఘనమరణదా • హం బణంగెఁ

దత్స్వప్నధూళుల • ధారాపరంపరల్
తనువును నతిశీత • లంబుఁ జేయఁ
దన్మాలదీపికా • స్థలవైభవంబున
సంచితకలుషముల్ • సమసి తొలఁగ

నాసుభద్రుండు పార్థివం • బైన యట్టి
యాత్మదేహంబు విడువ న • య్యవసరమున
నతని నవపుష్పకాంతర • గతునిఁ జేసి
యా రమాధీశు పార్షదు • లరుగునపుడు. 94

వ. సమవర్తికింకరులు రోషావేశంబున నుప్పొంగుచుఁ బాపసమేతుం డగు సుభద్రుని విడిపింపంబూని సహస్రసంఖ్యల వర్తిల్లుచు గదా తోమర పరశు పట్టిస భిండివాల ముసల ప్రాస ఖడ్గ ధనుఃకుంతాది వివిధాయుధంబులు ధరియించి తద్విష్ణుకింకరుల నెదిర్చి కదనంబు సలుపుచున్న యెడఁ దద్రమావిభుని పరిచారకులు శంకారహితులై కేశాకేశి యుద్ధంబు సేయునప్పుడు సమవర్తికింకరులు విచ్ఛిన్నసాహస సంయుక్తులును నికృత్తశిరస్కులును విదారితహృదయులును ఖండితోరుపద బాహుసమేతులును క్షతలోచనులును జూర్ణీకృతాంత్రమాలికా సంభరితులును విశీర్ణాంగుళులునై జముసముఖంబునకుం జని యేతద్వృత్తాంతం బెఱింగించిన. 95

మ. శమనుం డంత సుభద్రు వృత్తమున కా • శ్చర్యంబునుం బొందిరో
షమదోద్రేక సమావృతుం డగుచు న • శ్వస్యందనానేకప
ప్రముఖప్రస్ఫుట సైన్యముల్ గొలువ న • భ్రాభ్యంబునం బోవుచు
న్న మహీకాంతుని భక్తులం గదిసి స • న్నాహంబుతో నిట్లనున్. 96

చ. పరువున నేల యేగెదరు • పంతముగాదట నిల్చి సంతతా
పరిమితపాపయుక్తుని సు • భద్రుని మాకు నొసంగుఁ డిందిరా
వరపదభక్తులార! తగ • వా యిది మీకు జగంబులోన దు
ష్కరతర పాపజీవులకుఁ • గర్తను నేను దదీయశిక్షకున్. 97

ఉ. కాక మదీయ వాక్యములు • గైకొన నొల్లక మోరత్రోపునన్
గేకసలాడుచుం జనినఁ • గింకరసైన్యము తోడఁ గూడి యేఁ

జేకొని మిమ్ముఁ గెల్చి యతి ♦ చిత్రమహాఘసమేతుఁడైన యా
లోకవినిందితున్ నరక ♦ లోకముఁ జేర్చెదఁ బంత మొప్పఁగన్. 98

వ. అని యిట్లహంకారపూర్వకంబుగఁ జిత్రపతి పలికిన వచనంబులకు రోషించి విష్ణుకింకరు లిట్లనిరి. 99

క. దురమున మము గెలిచెద నని
హరిహయుఁడుం బలుకనోపఁ ♦ డంతక! నేఁడీ
హరిభక్తుల సామర్థ్యం
బెఱిఁగెద విఁకఁ బ్రల్లదంబు ♦ లేలా పలుకన్ 100

మ. మురవొప్పం గమలోదరుండు తులసీ ♦ మూలంబునన్ లచ్చితో
నిరతంబై యుండెడిచో సుభద్రుఁడవటన్ ♦ హీనాత్ముఁడై పాపదు
ర్ధరుఁడయ్యున్ మృతిఁబొందెఁ గావున జగ ♦ త్ప్రఖ్యాతినింద్రాదుల
చ్చెరువొందం జనువాఁడు మోక్షపదవిన్ ♦ శృంగార దివ్యాంగుఁడై. 101

వ. అని మఱియు నాకఱపూర్వ వృత్తాంతంబు చెప్పెదమాకర్ణింపుము. 102

గీ. శేషశాయియైన ♦ శ్రీమానినీశుండు
సంతసంబునిగుడ ♦ జలజభవుఁడు
వినఁగ నాకఱమాట ♦ విస్మయంబుగఁ బలెఱ
మమ్మునీక్షఁజేసి ♦ మహిమమెఱయ. 103

సీ. కలరుజగంబులో ♦ ఘనపాపయుక్తులు
పుణ్యాత్ములగు మర్త్య ♦ పుంగవులును
నేపాతకంబున ♦ కేదికృత్యంబగు
నాపాతకంబున ♦ కదియెఱింగి
యందఘ సంయుక్తు ♦ లగువారినీక్షింప
దండహస్తుఁడు గర్త ♦ మండలమున
మత్పాదభక్తి సా ♦ మర్థ్యసంయుతులెల్ల
ధరణిసజ్జనులని ♦ యెఱుఁగవలయు
జాతిహీనులైన ♦ సత్కులోద్భవులైన
వేదవేద్యులైన ♦ వేరులేని

నన్నుఁదలఁచినట్టి ♦ నరవరోత్తములెల్ల
మత్పురంబులోన ♦ మలయువారు. 104

వ. మఱియును. 105

సీ. తులసికా నలినాక్ష ♦ ములు కంఠములవేడ్కఁ
ధరియింపనేర్చిన ♦ ధన్యమతులు
బృందావనంబింటఁ ♦ బెంచి తద్దళముల
మముఁబూజసేయు స ♦ న్మర్త్యవరులు
భూసురోత్తమకరం ♦ బులయందు మత్ప్రీతి
గోదానమొసఁగు స ♦ త్కర్మరతులు
పొలుపుగా మన్నామ ♦ ములె సంతతంబును
దలఁపంగ నోపిన ♦ తత్త్వవిదులు
వదల కెప్పుడు సత్యంబు ♦ పలుకునట్టి
నిర్మలాఖిలజనవర్గ ♦ నియమనియతు
లగు మహాత్ముల శోధించి ♦ యత్నమొదవ
వారిఁ గొని తెండు మత్పురా ♦ వాసమునకు. 106

శా. యజ్ఞాధీశ్వరుఁడైన తద్విభుఁడు మ ♦ ర్యాదార్థమై మమ్ము ని
ట్లాజ్ఞాపించిన నట్లకాక యని మే ♦ మత్యంత మిద్ధాత్రిలో
సుజ్ఞానోన్నతులైన వైష్ణవుల సం ♦ శోధించి వారిం జెడు
ప్రజ్ఞల్ గల్గిన నైనఁ జేర్తుము జగ ♦ త్ప్రఖ్యాతిగా ముక్తికిన్. 107

క. శ్రీవల్లభు నామంబులు
తావలముగ నుడువనేర్చు ♦ తత్త్వజ్ఞులు త
త్రైవర్ణ్యంబున కర్హులు
భావింపఁగ నధికపాప ♦ పరిచితులైనన్. 108

క. ఈపతితుండగు విప్రుఁడు
పాపాత్ముండైన తులసి ♦ పాదపమూలా
రోపితుఁడై మృతిఁ బొందుటఁ
జేపట్టఁగవలసె మాకు ♦ శ్రీవిభు నాజ్ఞన్. 109

గీ. ఇతని విడిపించుకొనిపోవ • నింద్రుఁడైనఁ
జంద్రఖండార్థధరుఁడైన • సకలలోక
నాయకుండగు బ్రహ్మయైన • నను నశక్తు
లట్టియెడ నీకు మగతనం • బలరెనేని. 110

క. చెదరక హృదయములోపలఁ
బదిలుఁడవై దండహస్త • భయరహితుఁడవై
యెదిరించి యిచట మాతోఁ
గదనం బొనరింపవలయుఁ • గ్రమ మొప్పంగన్. 111

వ. అని యిట్లు విష్ణుకింకరులు శంకారహితులై పలికిన వచనంబులకుఁ దలం
కుచు సమవర్తి సమరంబు విసర్జించి లజ్జానమిత కంధరుండై సైన్యంబు
తోడం గూడి నిజసదనంబునకుం జనిన యనంతరంబున హరిదూతలు సుభ
ద్రునిం గొని వైకుంఠనగరంబున కరిగి రని చెప్పి మఱియు నిట్లనియె. 112

చ. వినుము మునీంద్ర శ్రీతులసి • వృక్షముఁ బ్రోచిన మానవోత్తముల్
తనయవధూ జనాప్తధన • ధాన్యసమున్నతులై జగత్త్రయం
బున నతిపూజ్యులై విబుధ • పూజితులై తుదివిష్ణుమందిరం
బున విహరించుచుందురు వి • భూషణభూషిత దివ్యదేహులై. 113

క. ధరణీసురు హస్తంబున
హరిఁదులసింబూజసేసి • యంత్యజుఁడైనన్
దురితములఁ బాసి చనుఁ ద
త్పురమునకును సకలలోక • పూజితుఁడగుచున్. 114

క. శ్రీతులసీ మహాత్మ్యము
చాతురితో వినినవైనఁ • జదివినవైనన్
ఖ్యాతుండై మనుజుఁడు చను
నాతతహరిమందిరమున • కతిముదమలరన్. 115

వ. అనియిట్లు తులసీమహాత్మ్యంబు చెప్పినవినిజనకునకు నారదుండిట్లనియె. 116

చ. అనయము కామినీసుతధ • నాప్తసముద్గత మోహయుక్తమై
పనుపడి పిప్పలచ్ఛదము • భాతిఁ జలించుచునున్న చిత్తమై

ట్టనువునఁ బాదుగా నిలిచి • యత్నముతోడ రమాధినాథు పా
దనవసరోజమధ్యమునఁ • దార్కొనియుండును లోకనాయకా! 117

గీ. వర్తమానసుఖము • వాంఛించుచిత్తంబు
దృష్టభోగరతిఁ బ • రిత్యజించి
తెలియఁజూచికాక • దేహిలోకాంతర
ప్రాప్తసౌఖ్యములకుఁ • బరపు బెట్టు. 118

శా. అస్తీతిప్రతిపద్యమానవచన • వ్యాపారముల్ సూచిత
న్నాస్తిత్వార్థసమేత యుక్తిసహితా • నల్పాపసిద్ధాంత వా
క్ప్రస్తావోన్నతులైన దుర్జనులవా • క్యప్రౌఢిమం గుంది వి
స్రస్తంబైన మనంబు నిల్చువిధమే • చందంబు పద్మోద్భవా! 119

వ. అనివిన్నవించిన మునీంద్రునకు సురజ్యేష్ఠుం డిట్లనియె. 120

సీ. ఇంద్రియంబులలోన • నెక్కుడౌ నయనముల్
తన్మాత్రలమునఁ బాప • తతులు పుణ్య
చయమును నాదవును • సహకారియందుకు
హృదయంబు నదియును • బదిలపడక
మోహాంధకారముల్ • ముసరుకోవర్తించుఁ
గణఁకనందున దేహి • గానలేక
పార్థివదేహసం • ప్రాప్త బాహ్యసుఖాను
భవమె సత్యంబని • భ్రాంతిఁబొంది
యించుకైనను గ్రిందుమీఁ • దెఱుఁగలేక
విదితవేదాంత వాక్యముల్ • వీక్షచేసి
నందిరియంబులఁ దెలియంగ • శక్తిసమసి
నిహతుఁడగునంత విధిచేత • నేర్పుచెడిన. 121

వ. అట్లగుటంజేసి దేహినిజాయుష్యంబు కొంచంబనియుఁ బుత్రదారాదులు శరీరమాత్ర బాంధవులనియు జన్మజరామరణంబు లనిత్యంబులనియు వితరించి హాలికుండు రజ్జుముఖంబున గోష్ఠంబువలన బలాత్కారంబుగ నొక్కకోడె యందిగిచితెచ్చి యభ్యాసవశంబున లాంగలవహన సమర్థంబు

గాంజేయు చందంబున మనోవృషభంబుఁ గుదియందిగిచి స్వవశంబు నొందింపంగవలయునది జ్ఞానంబునట్టి జ్ఞానంబుసంశయంబును విపరీతంబును ఖండంబును, నాగంతుకంబును, క్షీణకంబును, యాకస్మికంబును, వ్యక్తంబునన సప్తప్రకారంబులఁ బ్రవర్తించునందు వివిధమతసిద్ధాంత స్రవణంబునన నిర్ణీతంబగునది సంశయజ్ఞానంబు, నవసిద్ధాంతంబుగా నెఱుంగునది విపరీతజ్ఞానంబును, ఖండఖండంబులై స్రవించునది ఖండజ్ఞానంబును, వేదాంతాదిశ్రవణంబున సమాగతంబగునది యాగంతుకంబును, బాంధవ వినాశకాలంబున సముద్భవంబగునది క్షీణకంబును, జన్మాంతరపుణ్య విశేషమున శ్వేచ్ఛానసమయంబున నరుదెంచునది యాకస్మికంబును, సంప్రత్యయంబున నిశ్చలంబై పరమాత్మనిరీక్షణ పర్యంతంబున భేదంబునం బ్రవర్తించునది వ్యక్తంబును నగునిట్లు సప్తవిధంబులఁ బ్రవర్తించుజ్ఞానంబును వ్యక్తంబగునట్లు పొదుకొలిపి హృదయంబు పదిలంబుగా నిలుపవలయు.

క. హరిరూపంబులు వేదము
లరయగ వేదాంతదర్శి • తార్థంబులచేఁ
బరలోకము గలుగుట సు
స్థిరముగ నెఱుఁగంగవలయుఁ • జిత్తములోనన్. 123

గీ. సజ్జనులతోడి సంసర్గ • సాధువృత్తి
జలజనాభాంక సత్కథా • శ్రవణరతియు
నాత్మరిపునిగ్రహంబును • ననఁగ నివియుఁ
గ్రమముతో హృదయస్థైర్య • కారణములు. 124

సీ. దైవిక భౌతికా • త్మవికార భావముల్
సంభవించిననైన • జడుపువడక
యనుజతనూభవా • ప్తాంగనాదివియోగ
మాసన్నమైనచో • నడలువడక
పశు ధన ధాన్య సం • పదల వాకుక్కుమ్మడిఁ
దఱిఁగినవైనను • దత్తరిలక
వదలక మృత్యుదే • వత డగ్గఱిననైనఁ
బరితాపమందుచు • బలిమి చెడక

నరుఁడు సర్వంబు మిథ్యగా • నెఱిఁగికొనుచు
శ్రీవిభుం డైన విష్ణుఁడే • దైవ మనుచు
వేదవేదాంతవాక్యవి • వేకసరణి
తెలిసి హృదయంబు పాదుగా • నిలుపవలయు. 125

వ. మఱియుఁ గర్మమూలంబునఁ బ్రవర్తించు కర్మనిష్ఠులకు నాధారం బగుటం జేసి పుత్త్రిమూలంబుగఁ బుణ్యలోకనివాసంబును సమ్యగ్జ్ఞాననిష్ఠులకు జ్ఞానం బనియెడి సుపుత్త్రినిమూలంబునఁ బునరావృత్తిరహితశాశ్వతపదంబును గలుగు నిట్లు కర్మజ్ఞానంబులు వేదంబులయందుఁ బ్రతిపాదితంబు లై తత్తదధికారమూలంబునఁ బ్రవర్తించు నందు. 126

ఉ. జ్ఞానముచేతఁ గర్మములు • సంక్షయ మందెడుచోట నట్టి సు
జ్ఞానమె ముక్తిమార్గగతి • సాధకసత్త్వవిశుద్ధి కంచు దు
ర్మానవకోట్లకుం దెలియఁ • బ్రస్తుతిసేయును వేదజాలముల్
పూనికఁ దత్సమాచరిత • పుణ్యమఖాధిక కర్మసంతతిన్. 127

క. క్రతువులు దలఁపఁగ లక్ష్మీ
పతి రూపము లగుటఁ జేసి • ప్రఖ్యాతిగఁ ద
త్క్రతుపశుహింసలు ధర్మ
చ్యుతికిని బాత్రములు గావు • చూడఁగ ననఘా! 128

మ. స్థిరచిత్తుం డగు మానవోత్తముఁడు సు • స్నిగ్ధాత్ముఁ డై యిందిరా
వరు నామంబుఁ దలంచె నేని యతఁడు • త్వంతంబు సంసారసా
గరతీర్ణుం డగుచున్ మహామహిమతోఁ • గర్మంబులం దుంచి మో
క్షరమాధీశ్వరుఁ డై వెలుంగును వివ • స్వత్కాంతిసంపన్నుఁ డై. 129

క. గురుదోషఘ్నములాయు
ష్కరములు సంపత్ప్రదములు • కలుషమహానా
గరబాడబములు లక్ష్మీ
వరుసద్గుణకీర్తనములు • వర్ణింపంగన్. 130

సీ. కావించు పుండరీ • కాక్షప్రతిష్ఠలు
జలజనాభాలయ • స్థాపనములు
భక్తితో విష్ణువై • భవవర్ధనంబులు
మహిమఁ దన్మందిర • మార్జనములు

తద్వాసు దేవార్చ • తపఃపరిణామంబులు
పాత్రీర్థితహరిపాద • తీర్థసేవ
పరమవైష్ణవదీ ప్తి • పాదాంబురుహ పూజ
దానంబు సత్యంబు • దమము శమము
సంతతాచారవిధియును • సాత్వికంబు
ధ్యానమార్జవము క్రోధ • మతిముదంబు
తనరఁగనివి భాగవతమాన • వావలికిని
మోక్షసంప్రాప్తి కరధర్మ • ములు తనూజ! 131

క. ఏకర్మంబున నరులకు
నాకస్మికమాగతంబు • లగు రోగంబుల్
చేకొని తద్వృత్తాంతము
లోకాధిప తెలుపవలయు • లోకశరణ్యా! 132

క. అనిమునివర్యుఁడు వలికిన
వినిపద్మభవుండు హాసిత • విమలాననుఁడై
తనయున కిట్లనియెనునె
మ్మనమున సంతోషమొదవ • మాన్యచరిత్రా. 133

వ. అదియెట్లనిన. 134

సీ. మహిఁబుండరీకాక్ష • మందిరంబులయందు
వీఁకశిరోజముల్ • విప్పుకొనిన
గురుమాతృపితృదేవ • ధరణిసురోత్తమ
ప్రతతికిఁజేయమి • వందనములు
ప్రేమతోహరికి న • ర్పింపని పుష్పముల్
తడయక శిరముపై • ముడుచుకొనినఁ
దత్పాదతీర్థముల్ • ధరియింపనొల్లక
దూరమార్గంబునఁ • దొలఁగిచనినఁ
భావసంయుక్తివలనను భ్రా • ప్తమగును
భార్శ్వకంబును నాస్ఫోట • బాధమతియు

సేవనంబును వదనదు ♦ ర్భానితంబు
ననుమహా దుఃఖకరశిరో ♦ వ్యాధులనఘ. 135

వ. మఱియును. 136

సీ. పరకామినీకక్ష ♦ భాగస్థలంబులు
రతివాంఛనీక్షించు ♦ ప్రాణితతులు,
అడిగిననిడఁజాల ♦ కైనఁబదార్థముల్
చూచియుపేక్షించు ♦ నీచతరులు
గోభూసురుల్లు రుజల్ ♦ గొని చావఁదలఁపక
ప్రవిలోకనము సేయు ♦ పాపపరులు
వేదబాహ్యమత ప్ర ♦ వీణపాషండాది
సందర్శనోద్భవా ♦ నందయుతులు
విప్రదేవాంగనాత్మీయ ♦ విక్రయులును
గ్రామపశుపక్షిధేను పు ♦ ష్కరచరాది
హింసకులు దుర్మదాంధులు ♦ హీనమతులు
నేత్రరోగబాధితులుగా ♦ నెఱుఁగవలయు:. 137

మ. ధరణీదేవ నిలింపనిందకులకున్ ♦ ధర్మంబువర్జించి దు
ష్కరపారుష్యముతోడి దుర్మతులకున్ ♦ సత్యోక్తిసంశూన్యులై
పరమర్మంబులు పల్కుచుం బృథివిలోఁ ♦ బాపాత్ములై నిత్యముం
బరదుఃఖప్రదులైన కీటకులకుం ♦ బ్రాపించు వాగ్రోగముల్. 138

క. పరనిందాకర వాక్యము
లిరవుగ నాలించునట్టి ♦ హీనులకును ను
స్థిరబధిరాది శ్రుతిగో
చరరోగము లుద్భవించు ♦ సంయమివర్యా. 139

సీ. ధరణీసురేంద్రస ♦ ద్గురు జనోత్తములకుఁ
బరితాపమొందించు ♦ పాపరతులు
అనయంబుఁబరకాంత ♦ నాలింగనము సేసి
క్రీడలుసలుపుదు ♦ ష్కీర్తిరతులు

గోతరుణీబాల • కులఁబట్టి వధియించు
సంచితపాపవ్ర • చారమతులు
అన్నార్థమే యింటి • కరుదెంచు నతిథులఁ
బూజింపనొల్లని • పుణ్యరహితు
లాత్మకౌటిల్య సంగతు • లైనవారు
శల్యభేదన దద్రుక • శ్వాసకాస
తాపహిక్కాగ్ని శూలపి • త్తభ్రమాద
బహువిధానేక హృద్రోగ • సహితులనఘ ! 140

ఉ. చేరి యభక్ష్య భక్షణము • చేసిననారలు భక్తచోరకుల్
మీఱి యసత్పరిగ్రహ స • మేతులు దుష్టపరాన్నవాంఛితుల్
కూరిమి నన్యకాంతలను • గోరెడు సంతతపాపయుక్తులున్
ధారుణిఁ గుక్షిరోగపరి • తప్తులు చూడఁగ నెల్లకాలమున్. 141

క. నారద వినుమతి గోప్యము
నేరుపు దలకొనఁగ నీకు • నేమించెద ని
ట్లారోగములకు నౌషధ
మారయఁ దులసీ సమేత • హరిపదజలముల్. 142

క. కలిదోషంబులఁ జెఱుచును
బలురోగచయంబు నడఁచు • బాపఘ్నము ని
శ్చల పుణ్యంబుల నొసఁగును
దెలియఁగ శ్రీవిష్ణుపాద • తీర్థము తనయా ! 143

మ. నరులజ్ఞాన విమోహితాత్ములగుచున్ • నారాయణాంఘ్రిద్వయ
స్థిర సద్భక్తిఁ బరిత్యజించి తనయ • శ్రీకామినీమత్తులై
పరదైవంబుల వేడ్కఁ బూనిఁ గొలిచి త • త్ప్రాంతంబునం గాలకిం
కరదండాహతులై మునుంగుదురు సం • ఘాతంబునన్ భూసురా ! 144

క. పదిలంబుగ లక్ష్మీపతి
పదములు దలపంగనేర్చు • భాగ్యోన్నతులా
పదలం బొందక చనుదురు
ముదమున వైకుంఠనగర • మునకును దనయా ! 145

వ. అని చెప్పిన. 146

క. మంజీరనిహిత మణిగణ
పుంజీకృతగళిత కాంతి • పూరవిలాసా
భ్యంజితపదయుగ సరసిజ
రంజితభువనైకవీర • రంగవిహారా! 147

పృథ్వీవృత్తము.

సురాసుర నమస్కృతా • శుభవిభూషణాలంకృతా
కరీంద్రరిపుభరాజనా • కమలవాసినీ రంజనా
నిరంకుశపరాక్రమా • నిఖిలపూర్ణ పాదక్రమా
గిరీశతరుణీనుతా • గిరిచరౌఘ సంసేవితా. 148

గద్య.

ఇది శ్రీ హనుమత్కటాక్షలబ్ధ వరప్రసాదసహజసారస్వత చంద్ర
నామాంక రామవిద్వన్మణికుమారాష్టఘంటావధాన పరమే
శ్వర హరిభట్టారకవిరచితంబైన మత్స్యపురాణ
ఖండం బగు విష్ణుధర్మోత్తరంబు నందుఁ
దృతీయాశ్వాసము.

శ్రీ



శ్రీ

# మత్స్యపురాణము.

## చతుర్థాశ్వాసము.

శ్రీనారీ కుచయుగనిహి
తానేకమణీ విభూష ♦ ణాలోకనహ
ర్షానీత హృదయబుధస
న్మానిత ఘనవిభవరంగ ♦ మందిరనిలయా. 1

వ. అవధరింపుమిట్లు చతురాననుండు నారదునకుం జెప్పి మఱియునిట్లనియె. 2

చ. మదనగురుండు యోగిజన ♦ మానసపంకజ షట్పదంబు దు
ర్మద సురవైరిభంజనుఁడు ♦ మానితుఁడాద్యుఁడు శ్రీధరుండు భ
క్తదురిత నాశకుండగుచుఁ ♦ గంజభవాండములోనఁ బూర్ణుఁడై
కదలక నిల్చియుండుటయుఁ ♦ గానరుజీవులు ప్రాప్తదేహులై. 3

వ. మఱియు దేహిదేహగతుఁడై తమస్సత్వరజో మార్గంబులగు మనోవ్యాపారంబులందుఁ బ్రవర్తించునందు రోషంబు ననృతంబు మొదలైనవి తమస్సంభవంబులు, సత్యంబు దానం బస్తేయమహింసయు దయయు మేధయు వైరాగ్యంబునుఁ దుష్టియుఁ బుష్టియు క్షమయు మతియు మొదలైనవి సత్వగుణోద్భవంబులు, హర్షంబును వేగంబును నహంకారంబును మొదలైనవి రజస్సంజాతంబులునగు నంతనే తద్గుణంబులు మనోవికార మిళితంబులైన గ్లానియు భయంబును శ్రమంబున ధృతియుఁ జింతయు వ్రీడయు మోహంబుహృదయసముత్పన్నంబులగు నాభావంబులచేత నుద్వేజితంబులై యవిజ్ఞాన దీపంబునకు నాచ్ఛాదకంబులు నజ్ఞానంబునకు నుద్బోధకంబులునై యింద్రియవ్యాపారంబులంగలసి పరిభ్రమించునట్లగుటంజేసి మనంబజ్ఞాన మాత్రంబున నశిక్షితంబై స్వేచ్ఛావిహారంబున సంచరించునంత.

శా. పాదాపీడిత పుచ్ఛశీర్షమగు స ♦ ర్పంబుకుఁ బోఁ జిక్కురయే
భేదంబందక లీనమైనక్రియదూ ♦ పింపంగఁ జిత్తంబునే
త్రాది ప్రస్ఫుట వక్రమార్గమగునా ♦ వ్యాపారముల్మానఁ దాఁ
బాద్రైనిల్చును ద్వాదశాక్షరజపా ♦ ప్తజ్ఞానసంబద్ధమై. 5

క. జ్ఞానానలంబునంద
జ్ఞానజ భావంబులనెడి ♦ సమిధలు భస్మా
ధీనములు చేయ వ్రేల్చిన
మానవుఁడు సుఖించు విష్ణు ♦ మందిరగతుఁడై. 6

వ. మఱియుఁ గుల్లాలకకు విందులుం నిత్యాభ్యాస కృతంబులగు ఘట పటాది వ్యా
పారంబులయందు సంతతావిచ్ఛిన్న మనస్కులై సాన్నిపాతిక వికారసమ
యంబునను నవి యస్మరియించునట్లు భక్తుండు సంతతంబు మనంబు భగ
వంతునందు నిల్పి యభ్యాసవశంబున నంతకాలంబునఁ దన్నామంబు స్మరిం
చిన వైకుంఠంబునకుఁ జనునని పరమేష్ఠి మఱియు నిట్లనియె. 7

సీ. ఉద్బోధితంబును ♦ నుద్బోధనంబును
ననరెండువిధములై ♦ యలరుజ్ఞాన
మందు సద్గురుని వా ♦ క్య విశేషసరణిచే
బోధిత ప్రాప్తము ♦ ద్బోధితంబు
శాస్త్రార్థ దర్శనో ♦ చ్ఛ్రియ వివేకజమును
ద్బోధన జ్ఞానంబు ♦ భూసురేంద్ర
వనజకుట్మలము లై ♦ వాలలతాపూర్ణ
జలభేదకంబగు ♦ శక్తితోడ
వెడలి వికసించుకైవడిఁ ♦ బదటవడక
శాస్త్రదర్శన గురువాక్య ♦ జనితమైన
విమలసుజ్ఞానమజ్ఞాన ♦ నితతినణఁచి
తానె వికసిల్లుఁ బరమాత్మ ♦ దర్శనమున. 8

వ. తొల్లి పుండరీకుండన వెలయు మహీవల్లభుండు కపిలునివలన నిశ్చలజ్ఞానం
బునొంది భగవద్భక్తిపరాయణుండై ముహూర్తమాత్రంబునఁ బరమపదం
బునొందెఁ దద్వృత్తాంతం బెఱింగించెద. 9

సీ. అభ్రంలిహోదగ్ర ♦ శుభ్రమణిద్యుతి
విభ్రమప్రాకార ♦ విశ్రుతంబు
చండమార్తాండ స ♦ న్మండలమార్గని
రోధకగోపురో ♦ ద్బోధితంబు
అంగనాసంగీత ♦ సంగతమర్దల
ధ్వనిపూర్ణనాదాభి ♦ వర్ణితంబు
మణిమయనూత్న తో ♦ రణనిత్యసంకులా
పణపూర్ణపణ్యాప్తి ♦ భ్రాజితంబు
మత్తతరయూధప తురంగ ♦ మరథవీర
వరమహీసుర రాజన్య ♦ వైశ్యశూద్ర
సంయుతంబయి వీలసిల్లు ♦ చంద్రభాగ
తటమునందున నిత్యప్ర ♦ తాపపురము. 10

శీ. చండకాండాసన ♦ చలితబాణాసార
ఖండితాఖిలరాజ ♦ మండలుండు
అఖిలదిఙ్మండలా ♦ భ్యంతరపరిపూర్ణ
వివిధకీర్తిప్రభా ♦ విశ్రుతుండు
చతురాననాదేశ ♦ జనపాలవర్ణిత
ప్రఖ్యాతనిజగుణో ♦ ద్భాసితుండు
శారదాజయరమా ♦ సదనాయమానవ
క్త్రాంబుజ బాహుయు ♦ గ్మాంతరుండు
కంతునలకూబరాదికా ♦ కారసుతుఁడు
ప్రేమఁబాగడంగఁదగుఁ బుండ ♦ రీకుఁడనఁగఁ
బుణ్యవృత్తుండు నరపాల ♦ పుంగవుండు
తత్పురాధీశ్వరుండయ్యెఁ ♦ దత్వనిలయ. 11

వ. ఇట్లు సకలగుణసంపన్నుండగు పుండరీకనరపాలకుండు నిత్యప్రతాప నగరంబున కధీశ్వరుండై గజతురంగమ రథపదాతి ప్రముఖబహువిధసేనా సమన్వితుండై హితపురోహితామాత్య కవిగాయకనట విదూషకాది పరిజనం

బులు పరివేష్టింప సింహాసనాసీనుండై కాంతానహాస్రంబునకు వరుండై నిష్కంటకంబుగ రాజ్యంబు సేయుచుండె నయ్యవసరంబున. 12

సీ. విరహిణీజనమనో ♦ వీథులమత్యధ్వ
జాంబకానలకీల ♦ లంకురింపఁ
బ్రణయరోషంబులఁ ♦ బాటిల్లుతరుణుల
హృదయముల్ కలయంగ ♦ నెదురుకొనఁగ
నభిసారికాగణ ♦ యత్నముల్ సాహస
స్ఫూర్తితోఁ బెనఁగొన ♦ సొంపుమిగుల
నవ వయః పరిపూర్ణ ♦ నారీజనంబుల
కోర్కు లంత్యంతకుఁ ♦ గొనలుసాగ
వినుత కలకంఠకంఠ ని ♦ స్వనము లెదుగ
సతతమధుకర మధుర ఝం ♦ కృతులు చెలఁగ
నంగజాధీశ దర్పాల ♦ యం బనంగ
నభినుతంబయ్యె నవవసం ♦ తాగమంబు. 13

సీ. సన్నుతకామినీ ♦ సతుకుచకుంభద్వ
యాలింగనంబుల ♦ కానపడక
ముఖరితనూపుర ♦ ముఖకోమలాంగనా
పాదఘాతంబులఁ ♦ బరిహరించి
యతులితగంధసం ♦ యుతవామలోచనా
గండూషమధ్యా సే ♦ కములమాని
వర్ణితరూపలా ♦ వణ్యయోషాకృత
క్రిమశుద్ధరాగ నం ♦ గతిఁ దొలంగి
తరుణ మకరందపాన మ ♦ త్తద్విరేఫ
ఝంకృతాటోపములతోడఁ ♦ జెలువ మగుచు
ననచి మొగి విచ్చి చిగుళాకు ♦ నయముఁ జూపి
పూచె వనముల విలసిల్లు ♦ భూరుహములు. 14

వ. ఆ సమయంబున. 15

గీ. పుష్పరథమెక్కి సూనాస్త్ర ♦ ములు ధరించి
భ్రమర శుక శారికాది సై ♦ న్యములుగొలువ
నవవసంతునితోడ స ♦ న్నాహ మొదవ
దండయాత్రాభిముఖుఁ డయ్యె ♦ దర్పకుండు. 16

వ. ఇట్లఖిలలోకమనోహరం బగు వసంతసమయసౌభాగ్యంబు నిరీక్షించి పుండరీకమహీకాంతుండు సంతోషాయత్తచిత్తుండై మృగయావినోదంబు సలుపంగోరి చతురంగబలసమన్వితుండై చండప్రతాపదోర్దండమండనాయమానం బగు మండలాగ్రంబు ధరియించి వాగురాసమేతు లగు కిరాతులు మున్నాడి చనుచుండ నవప్రసవమకరందపరిమళాక్రాంతం బగు వనాంతంబుఁ బ్రవేశించి యందు. 17

మ. తెరలంజిక్కిన సింహ ఖడ్గ గవయా ♦ దిప్రోచ్చలోద్యన్మృగా
పరిమేయాంఘ్రిగళాక్షిపుచ్ఛముల భూ ♦ పాలుండు బాణాళిచే
నెరయం ద్రుంచి పిపాసతప్తుఁ డగుచున్ ♦ నీరారయంగాఁ బయిం
బరఁగెన్ వాయువు లంబుశీకరపరి ♦ వ్యాప్తంబులై యొక్కెడన్. 18

క. అవనీనాథుఁడు ధృతి న
య్యవసరమున రథముతోడ ♦ నరిగెను వెనఁ ద
త్పవనంబున కభిముఖుఁడై
జవమున నుదకంబుఁ గ్రోల ♦ శతయోజనముల్. 19

వ. ఇట్లు పుండరీకమహీకాంతుండు తృష్ణాపీడితుండై రథవేగంబున సముద్రతీరంబుఁ జేరి యచ్చట పల్లవ పుష్ప ఫల భారసమిద్ధ శాఖి శాఖాంతర గళిత సుమనోరసవాసిత శీతల పయఃపూరిత సరోవరాభినుతంబును దధ్యాజ్యసమిత్పురోడాశ హోమసముద్గత ధూమ వాసనావాసితంబును, శుక శారికాపోతముఖవినిర్గత వేదాంతవాక్యరచనా ముఖరితంబును, సింహ శరభ కరి గవయ చమరీమృగాది పరిజనస్తోమసేవితంబును, సకలదేవతా సన్నుతంబును నగు కపిలాశ్రమంబు ప్రవేశించి రథంబు డిగ్గి యచ్చట నొక్క సరోవరంబున నతిశీతలంబులును, కమలవిమలకేసరఖండవాసితంబును, రసయుక్తంబులు నగు పానీయంబులఁ గ్రోలి తత్తీరశీతలతరుచ్ఛాయా సమాసీనుండై యచ్చట నొక్క హరిణంబుఁ గనుంగొని వివేకహీనుండై.

గీ. శరము వింటఁ దొడిగి • జననాథుఁ డచ్చోటఁ
దన్మృగంబుగళముఁ • దగులనేయ
నది మునీంద్రుకడకు • నరిగిన యతఁ డంత
దానిఁ జూచి రోష • తప్తుఁ డగుచు. 21

చ. సరసిజసంభవాది సుర • సంఘము లైన మదాశ్రమంబునన్
దిరిగెడి కీటిపోతమును • దేఁకువతో వధియింపలేనిచో
నరగున నీమృగంబు నతి • సాహసవృత్తి వధించె నెవ్వఁ డా
పురుషుని నిట్లు సేతునని • భూసురవర్యుఁడు కోపదీప్తుఁ డై. 22

గీ. హరిణ మేగుదేంచు • నాజాడఁ దప్పక
పుండరీకుఁ డున్న • భూరుహంబు
కడకుఁ జన నతండు • గని నమస్కారాది
కృత్యముల్ ఘటించి • కేలు మొగిచి. 23

వ. సాంత్వనవాక్యసమేతంబుగా నిట్లనియె. 24

గీ. పుండరీకుఁ డనెడు • భూపాలకుండని
త్యపవిత్రపనగర • మాశ్రయంబు
వేఁట వచ్చి యెండ • వెట్టది ఘనమైన
దాహ మొదవునంతఁ • దత్తఱమున. 25

మ. అరదంబెక్కి జలంబు గ్రోలుటకు నై • యత్యంతవేగంబునన్
మురువై యిచ్చటి కేగుదెంచి కమలా • మోదాశ్రమస్థాంబువుల్
పరిపూర్ణంబుగఁ ద్రావి యంతట • భవత్పాదాంబుజద్వంద్వసే
వరతిం గోరఁగ నయ్యభీష్ట మెదు రై • వచ్చెన్మునీంద్రోత్తమా! 26

మ. ఘనపాపోన్నతుఁ డన్ దయారహితుఁడన్ • గాలక్రియాశూన్యుఁడన్
ధనపుత్రాప్తగృహాది మోహరతుఁడన్ • దర్పాంధుఁడన్ సత్యవా
క్యనయజ్ఞానవిహీనుఁడన్ జపలుఁడన్ • గాఢిన్య పాపాత్ముఁడన్
నను మన్నింపఁగ నీకుఁ బంతము మునీం • ద్రా! లోకరక్షామణీ! 27

వ. అని నమస్కారపూర్వకంబుగాఁ బలికిన వచనంబు లాకర్ణించి యామహీ
వల్లభునకు మునివర్యుం డిట్లనియె. 28

చ. జనపతివంచు నిన్ననఁగఁ ♦ జాలము ధాత్రి విరోధిసైన్యముల్
పనుపడి కార్ముకోచ్చలిత ♦ బాణపరంపరఁ ద్రుంచి వైచి సం
జనితయశంబు నొందుటయె ♦ శాస్త్రముగాక మదాశ్రమస్థలం
బున వసియించునట్టి మృగ ♦ మున్ వధియింపఁగ నీకుఁ బంతమే. 29

గీ. వనములోనఁ బూరి ♦ వలసినట్టుగఁ గొని
నీడ లైనచోట ♦ నిలిచియున్న
మృగముఁ బోవనీక ♦ తెగి నొంపఁ గారణం
బేమిగల్గె నీకు ♦ భూమిపాల! 30

క. అపమతి వై క్రోధంబున
నపరాధముఁ జేసినట్టి ♦ హరిసుతు నైనన్
శపియింపనోపఁగల నన్
గపిలుండని యెఱుఁగవలదె ♦ క్రమ మొప్పంగన్. 31

సీ. నిద్రయు నాహార ♦ నియతియు భయమును
నిధువనంబును నాఁగ ♦ నివ్వి సర్వ
జంతువులకుఁగూడ ♦ సంతతధర్మంబు
లై ప్రవర్తించుచో ♦ నందు నరుఁడు
బుద్ధి నత్యధికుఁ డై ♦ భువనంబులోపల
సత్త్వాదిగుణసమా ♦ జంబుతోడ
నుద్బోధితంబు లై ♦ యొదవెడు కామరో
షాదులఁ గుదియంగ ♦ నాఁపలేక

చిత్త మెల్లైనఁ బరపుచుఁ ♦ జెంగలించి
కాల మాసన్నమని సూటి ♦ గానలేక
చింత సేయక పరుల హిం ♦ సించి యందు
కతన సంతుష్టిఁ బొందు సం ♦ తతముఁ దలఁప. 32

ఉ. ఎందఱు రాజులేని చని ♦ రీవసుధాతల మెల్ల జీవుఁ డిం
దెందఱు కాత్మజుం డగుచు ♦ హీన కుయోనుల సంభవింపఁ డీ
పొందిక గానలేక మద ♦ పూరితనేత్రుఁడ వై మదాశ్రమం

బందు సుఖంబునం దిరుగు ♦ నట్టి మృగంబును హింససేయ నీ
కిందున నేమిగల్గె మను ♦ జేశ్వరడింభక ! పాపభూషణా ! 33

గీ. మేటిరణమునందు ♦ మృగయావినోదంబు
సలుపునపుడుయాగ ( సమయమందు
హింససేయ(బంత ♦ మితరకాలంబున
నదియొపాపనిలయ ♦ మధిపులకును 34

సీ. దుర్గంధితామేయ ♦ దుష్టమూత్రక్రిమి
వ్యాప్తాంత్రమాలికా ♦ వర్త్మమందు
మాంసాస్థిశకల ౘ ♦ ర్మసమన్వితంబుగ
రక్తశుక్లములచే ♦ వ్యక్తమగుచు
ఘనదుఃఖకరమైన ♦ గర్భకోటరమున
నొదవినిత్యాపాయ ♦ యుక్తమైన
తనువుశాశ్వతమని ♦ తల(పులో(దలపోసి
భూవరాహంకార ♦ మున(జెలంగి
భూతదయలేక పుణ్యంబు ♦ పొలుపు(జెఱిచి
చేరియిచ్చట హింససే ♦ సితివిగాక
తత్వమెఱి(గిన నరపాల ♦ తనయులిట్లు
పాపములుసేయునేర్తురే ♦ పార్థివేంద్ర. 35

ఉ. తప్పులుగల్గియుండినను ♦ దండ్యులుగారు మహీసురేంద్రులే
తప్పనులేక మాయెడకు( ♦ దప్పిన నీఘనరాజ్యవైభవం
బెప్పుడె నాశమొందునని ♦ యేశపియించిన నడ్డగింపలే(
డప్పరమేశు(డైనను ర ♦ మాధిపు(డైన నృపాలకీటమా. 36

సీ. పాడిదప్పకప్రజా ♦ పాలనంబొనరించి
సత్యంబువదలక ♦ సాధుమార్గ
గమనంబువిడువక ♦ గాంభీర్యముడుగక
నీతిమార్గవివేక ♦ నిరతు(డగుచు(
బరకామినీవిత్త ♦ భావంబు(గుదియించి
సంతతదానప్ర ♦ శస్తు(డగుచు(

సీ. పాడిఁదప్పక ప్రజా • పాలనం బొనరించి
సత్యంబు వదలక • సాధుమార్గ
గమనంబు విడువక • గాంభీర్య ముడుగక
నీతిమార్గవివేక • నిరతుఁ డగుచుఁ
బరకామినీవిత్త • భావంబుఁ గుదియించి
సంతతదాన ప్ర • శస్తుఁ డగుచుఁ
జిత్తంబు విష్ణుని • శ్రీపాదములఁ జేర్చి
యైహికభోగంబు • లమర విడిచి
కీర్తి ధర్మంబు లార్జించి • కినుక వడక
పుణ్యుఁ డైనట్టి నరపాల • పుంగవునకు
ధాత్రి రాజ్యంబు సేయఁ బం • తంబు గాక
మనుట కెడ రిట్లు సేయంగ • నన్నృపుడునె ? 37

క. తెలియవు గాక మదంబునఁ
గులసంభవు లైన రాజ • కోట్లకు నీ చొ
ప్పలవడునె యెన్నిచూచిన
కలుషాలయహృదయ సర్వ • కార్యవిహీనా. 38

తరళము.

అని మునీంద్రుఁడు వలుకు వాక్యము • లాదరించి నృపాలనం
దనుఁడు రాజ్య ధనాది మోహము • తత్క్షణంబ త్యజించి సం
జనిత హర్షసమేతుఁ డై యట • సంపుటీకృతహస్తుఁ డై
వినయ మొప్పఁగఁ బలికె నప్పుడు • విశ్రుతంబుగఁ బుత్త్రికా! 39

క. గురువులకుఁ దప్పి నడచిన
గురుపాతకు లైన మనుజ • కోట్లకు నెల్లం
బరికింప శిక్ష యెయ్యది
తిరముగ నా వాక్య మాన • తిమ్ము మునీంద్రా. 40

వ. అని పలికి తీక్ష్ణధారలుగల్గు నిశితఖడ్గంబునఁ బుండరీకుండు తన శిరంబు ద్రుంచికొన నుద్యోగించె నప్పు డక్కపిలుండు తన్మహీకాంతుని పశ్చాత్తా

పంబునకు సాహసంబునకు సంతసించి యతని కరంబు వట్టుకొని తత్ప్ర
త్యంబు నివారించి యిట్లనియె. 41

క. అనవలసిన మాటలు ని
న్నని చూచుటగాక మృత్యు ♦ వరుదెంచియు మ
ద్వనకీటము నైనను ముని
కొని చంపంగలఁడె సర్వ ♦ గుణగణనిలయా! 42

క. వెఱవకుము రాజనందన
వరకీర్తిసమేత నీకు ♦ వాంఛిత మగునే
వర మొకటి వేడఁ నొసఁగెదఁ
బరిపూర్తిగ నడుగవలయుఁ ♦ బ్రాభవ మొప్పన్. 43

వ. అని పలికిన మునీంద్రున్నకు రాజేంద్రుం డిట్లనియె. 44

ఉ. నీదయ నివ్వనానఁ బరి ♦ నిష్ఠితుఁడై విలసిల్లు నాతఁ డిం
ద్రాదులు సన్నుతింప వసు ♦ ధాధిపుఁడై విహరించు వేడుకన్
నీదయలేక భూవరుఁడు ♦ నీతిసమన్వితుఁడైన హీనుఁడై
ఖేదము నొందుచుం దిరుగుఁ ♦ గీర్తులు మాయఁగ భూసురోత్తమా! 45

క. నిరుపమ భవదంఘ్రిద్వయి
సరసిజములు చూడఁగంటి ♦ చర్చింపఁగ సు
స్థిరహృదయ నిత్యకరుణా
పరభాషణ యింతకన్న ♦ వరముం గలదే. 46

క. ఆపద్ధ్వాంతముఁ జెఱుచును
బాపౌఘనివారకంబు ♦ ప్రస్తుతి సేయన్
తాపత్రయనిర్హరణము
మీపదసందర్శనంబు ♦ మిత్రశతాభా! 47

క. మోహంబునొంది తను భో
గేహాపరవశుడ నగుచు ♦ నింద్రియములచే
దేహంబు మఱచి తిరిగితి
నాహారస్వాపమైథు ♦ నాదుల సొందై. 48

క. మానవుఁ డధ్యాసాది వి
హీనుండై ముక్తినొందు ♦ నే ధర్మములన్

బూనిక సాధర్మ్యంబులు
వీనుల కుత్సాహ మొదవ ♦ వినుపింపు తగన్. 49

వ. అని పుండరీకుండు పలికిన వాక్యంబులకు సంతసించి కపిలుం డిట్లనియె.

క. ధనమును రూపంబును నన
మనుజుల కివి మదకరములు ♦ మనుజేశ్వర యి
ట్లొనరెడుచో నజ్ఞానం
బునఁ బొదలక మేలుఁ దలఁపఁ ♦ బూనితి వనఘా! 51

క. గతజన్మసహస్రసమా
ర్జితపుణ్యముచేత నరుఁడు ♦ శ్రీపతిపాద
ద్వితయాబ్జభక్తిరశనా
వృతుఁడై మోక్షంబుఁ బొందు ♦ విభవముతోడన్. 52

క. జ్ఞానంబులేక యశమున
కై నడపిన కర్మమార్గ ♦ మతిముదమున మ
ర్త్యానీకమునకు ముక్తిని
దానముగా నేర దాత్మఁ ♦ దలపోయంగన్. 53

వ. మఱియు మోక్షం బపేక్షించు మానవుండు పూర్వదానఫల సమాగతంబు
లైన సంపదలు విద్యుత్సమానంబు లనియుఁ బరహింసాకరంబు లగు వ్యా
పారంబులు దురితకరంబు లనియు వితర్కించి భయాకులితమానసుం డై
గురువాక్యమూలంబునఁ దత్త్వం బెఱింగి దృఢనిశ్చయుండై ప్రవర్తింపవల
యు నందు. 54

క. కృతపడిన రాజులున్మద
మతిసంయుతు లయ్యు మోహ ♦ మహనీయతమో
వృతులై • కదనస్థలముల
హతులైరి వసుంధరాజ ♦ యార్థము జగతిన్. 55

గ. ధనకుల రూప శౌర్య గుణ ♦ దాన వయోబల రాజ్యభోగ సం
జనితమదాంధులై నృపతి ♦ సంఘము లెల్ల నిజాత్మశత్రులన్
మునుకొని గెల్వనోపక స ♦ మున్నతసైన్యసమేతులై రయం
బునఁ దనువుల్ త్యజింత్రు ధన ♦ పూర్ణ ధరాతల లాభకాంక్షులై. 56

క. ఆజిని రిపుల జయించుట
భూజనవిభుఁ డార్తతతులఁ • బోషించుటయున్
రాజులకు నివియె ధర్మము
లీజగము పరిగ్రహింప • హితజనవినుతా. 57

వ. మఱియును. 58

సీ. సత్యంబు విడువక • సామర్థ్య ముడుగక
సంతతాచారని • ష్ఠుండుఁ డగుచు
భావంబులోపలఁ • బదిలుఁడై ధనధాన్య
కులరూపపదములు • గుట్టుపఱచి
పరమదయారస • ప్రఖ్యాతుఁడై నిత్య
నియమముల్ జరుపుచు • నిర్వికార
మునఁ బ్రవర్తించుచుఁ • దనయ కళత్రాది
మోహజాలంబున • మునుఁగవడక
మోక్షగమనసరణి • వీక్షింపఁగోరుచు
స్వప్నరూపమైన • సంసృతిగతి
చనఁగ నేర్చునతఁడు • చర్చింపసద్గురు
బోధ్యుఁడనఁగ బఱఁగు • భూమిలోన. 59

వ. మఱియు నేతద్గుణసమేతులైనవారు జ్ఞానాధికారులై యంకురితలును, బుష్పితులును, ఫలితులుననఁ బ్రవర్తింతురు; అందు మోక్ష ధర్మాపేక్షులంకురితులును దదాచారనిరతులు, పుష్పితులును జీవన్ముక్తులు ఫలితులు నగుదురిట్లు త్రివిధప్రవర్తనులకు గురుముఖ సంబోధితంబగు జ్ఞానంబున మోక్షంబు గలుగునని చెప్పి కపిలుండు మఱియు నిట్లనియె. 60

సీ. దయయు సత్యంబును • దాక్షిణ్యమును లేక
రాజ్యగర్వంబున • రాణమెఱసి
పరసతిపశుధన • భ్రాంతచేతస్కులై
పుత్రదారేషణ • స్ఫూర్తిఁ బొదలి
ప్రజలఁ బీడించుచుఁ • బాపసంయుక్తులై
బ్రాహ్మణగురుదేవ • భక్తి విడిచి

భూప్రాప్తికై శత్రు ◆ భూపాలకులతోడఁ
గదనరంగములకుఁ ◆ గాలుసాఁచి
రోషకామాదిసక్తులై ◆ రూఢిమెఱసి
గతనిజాయుష్యకాలంబుఁ ◆ గానలేని
రాజవరులేడ మోక్షధ ◆ ర్మంబులేడ
నూహసేయంగ మదిలోన ◆ యుక్తమగునె. 61

చ. వనమృగ మేగుదేరనాక ◆ వాఁడిశరంబున దానికంఠ మే
సిన యపరాధమెల్లను న ◆ శించుటకై యిటమమ్ముఁజూచిసం
జనిత భయంబుతోడ నతి ◆ శాంతునిరీతిని మాన్యవాక్యముల్
మునుకొని నీవుపల్కఁగనఁ బ్రి ◆ మోదముతోడుత నమ్మవచ్చునే. 62

సీ. ప్రత్యక్షదేహాను ◆ భావ్యమహారాజ్య
వర్ణితఘనభోగ ◆ వాంఛమాని
సంపూర్ణయౌవన ◆ స్తబకిత మానినీ
లలితకుచాశ్లేష ◆ ములు త్యజించి
కర్పూరచూర్ణసం ◆ కలితనూతన పుష్ప
చతురశయ్యానివా ◆ సంబువిడిచి
బహుళసింధురరథ ◆ భటతురగాదిక
చతురంగబలసిరీ ◆ క్షణముఁబాసి
తల్లిదండ్రులవర్జించి ◆ తపముసేఁత
యధికులైనట్టి విప్రుల ◆ కైనఁదెలియ
నలవిగానట్టి ధర్మంబు ◆ లడుగనీకు
నింతకపటంబు నడఁపంగఁ ◆ బంతమగునె. 63

ఉ. తప్పిటులేమియున్న వసు ◆ ధావరనీ యెడఁగల్గినట్టి యా
తప్పులు నొప్పులయ్యెనిఁక ◆ తాపవివర్జిత మానసుండవై
చొప్పుగవచ్చు మార్గమున ◆ సూటియొఱంగిరథంబుతోడనీ
విప్పుడె పట్టణంబునకు ◆ నేగుము రాజకులైక భూషణా. 64

చ. నరపతినిట్లువీడ్కొలిపి ◆ నారద తత్కపిలుండు పద్మినీ
వరుఁడపరాద్రి శృంగమున ◆ వన్నెయకెక్కఁగనఁ జూచియంత సాం

ధ్యరుచిర కర్మములొసలుపఁ ♦ దక్షిణమెగె నిజాశ్రమాంతర
స్ఫురదతిశీత లాచ్ఛజల ♦ పూర్ణసరోవర తీరభూమికిన్. 65

వ. ఆసమయంబున. 66

గీ. చరమసంధ్యాంగనాముఖా ♦ బ్జంబునందుఁ
దీర్చినిలిపిన సిందూర ♦ తిలకమనఁగఁ
జెలువుమైమించె నస్తాద్రి ♦ శిఖరభాగ
మున విభాకరుఁడరయఁ బ్రి ♦ మోదమెడదవ. 67

వ. అంత. 68

క. దోషాకరముఖదర్శన
దోషమునకు భీతినొంది ♦ తొలఁగినమాడ్కిన్
బోషితుఁడై యఖిలజగ
ద్భూషణుఁడరుణుండు గ్రుంకెఁ ♦ దోయధిలోనన్. 69

ఉ. చేరెనికేతనంబులకు ♦ సేమమునన్ మృగపక్షియూథముల్
జారెను చక్రవాకయుగ ♦ సాంద్రమనోజర సాతిరేకముల్
మీరెనజాండ భాండమున ♦ మించిరయంబున నంధకారముల్
పేరెను దారకాభినవ ♦ బృందఘనద్యుతు లంబరంబునన్. 70

వ. ఇట్లంధకారంబు సర్వ దిక్పరిపూర్ణంబై దృష్టిగోచర పదార్థంబులదృష్టరూపంబులగునట్లు నిబిడంబై ప్రవర్తించునెడ. 71

క. మదననృపాలుని గొల్లెన
తుదనెత్తిన హేమమయచ ♦ తురకలశము నా
నుదయాచల శిఖరంబున
నుదయించెను విధుఁడుకాంతి ♦ యుక్తుండగుచున్. 72

వ. అంత నమ్మునివరుండు చరమసంధ్యా సమయసముచితానుష్ఠానంబుదీర్చి శిష్యసమన్వితుండై నిజనిలయంబునకరిగి యగ్నిహోత్రాది కృత్యంబులు సమాప్తించి విష్ణుధ్యానపరాయణుండై యుండెనంత నప్పుండరీక మహీకాంతుండు పయఃపానంబుసేసి తత్తరుమూలంబున సమాసీనుండై మనంబున నిట్లనియె. 73

చ. నిరుపమయోగ సంపదల ♦ నిశ్చలులై గతభావికాలజా
పరిమిత కార్యభావములు ♦ ప్రస్తుతిసేయఁగఁజాలి తత్పురం
దరవిభవంబణంపను బ్రి ♦ తాపముగల్గిన సన్మునులక్కరం
బెఱుఁగఁగ లేరొకో మదిమ ♦ హీవలయంబున నన్యచిత్తముల్. 74

చ. కపిలమునీంద్రు వాక్యములు ♦ గైకొనియె ననంతనాత్మలో
నపరిమితంబులై యొదవె ♦ హర్షసమేతములైన భావముల్
విపులవధూజనాత్మభవ ♦ విత్తజనసన్నుతరాజ్యభోగవాం
ఛపనికి రాక జాఱెనది ♦ సౌమ్యతదీయదయాసమున్నతిన్. 75

క. దృష్టిగ్రాహ్యంబగునది
నష్టంబై చనెడుచోట ♦ నానాఁటికివి
స్పష్టముగఁ దెలియవలయును
సృష్టికిఁ గర్తయగువిభుని ♦ జిత్తములోనన్. 76

గీ. గురుముఖంబువలనఁ ♦ గుదురుగాఁదనమూర్తి
నెఱిఁగికొనినయట్టి ♦ నరవరుండు
సురలువినుతిసేయ ♦ శుభరూపసహితుఁడై
చెడనిపదమునకును ♦ జేరుకొనును. 77

చ. కపిలమునీంద్ర చంద్రుదయ ♦ గల్గినదాఁక జలాశినైమనో
విపులవికారయుక్తపద ♦ వింజననొల్లక నిశ్చలుండనై
యపరిమిత ప్రసూనముల ♦ కాశ్రయమై చెలువొందు నిట్టిపా
దపమె నివాసగేహముగఁ ♦ దప్పకనిల్చెద సుస్థిరంబుగన్. 78

వ. అని యిట్లు పుండరీకుఁడు వితర్కించుచుఁ దన్మహీరుహమూలంబున నిద్రా
విరహితుండై యుండెనంత. 79

క. ఘనతిమిరోరగకబళిత
వనజాసన నిర్మితాండ ♦ వర్ణితసంజీ
వనమిదియన నుదయించెను
దినకరుఁడు సురాధినాథ ♦ దిగ్భాగమునన్. 80

వ. ఇవ్విధంబున సూర్యోదయాస్తమయ పరిమితంబులగు పదుమూఁడు దివసం
బులు జలాంజలిత్రయ పానంబున దేహధారణంబు సేయుచుఁ దన్మహీరు

హామూలంబునఁ బుండరీకుండు మోక్షధర్మాపేక్షుండై యుండెనంతఁ బదునా
లవదినంబునఁ దత్ప్రపితామహుఁడు శిష్యసమన్వితుండై సంధ్యాది కృత్యంబులు
దీర్చి యమ్మహీవల్లభునిఁ గనుంగొని మనంబున నచ్చెరువంది యతనిఁజేరం
జని యిట్లనియె. 81

గీ. రాజ్యసుఖము మాని ♦ రమణుల విడనాడి
భోగసరణిమీఱి ♦ బుద్ధిదప్పి
యడవిలోన నుదక ♦ మాహారముగ నిట్లు
బడలఁదగునె నీకుఁ ♦ బార్థివేంద్ర. 82

క. జననాంతరసుకృతంబుల
జననాథుండగు నరుండు ♦ జనపతియయ్యెన్
మునివేషముఁ గోరినఁబశు.
వనరే తద్భూమియందు ♦ నఖిలజనంబుల్. 83

వ. అని పలికిన మునీంద్రునకు రాజచంద్రుండు ముకుళితకరుండై నమస్కృతి
పూర్వకంబుగా నిట్లనియె. 84

చ. గురువులుగాన మీ కెదిరి ♦ కొంచెపువాక్యము లైనఁ బల్కరా
దరయఁగ రాజ్యవైభవము ♦ లస్థిరముల్ జననవ్యయంబు లె
వ్వరికినినైన నిత్యములు ♦ వర్ణనచేయఁగ దానిచేతని
ద్ధరణిని సాధ్యమేయదిన ♦ తపఃప్రియ మీదయ చాలకుండినన్. 85

క. క్లేశంబు జాఱె నాశా
పాశంబులు వీడె నణఁగె ♦ భవరోగంబుల్
గాసిల్లె మత్కలుషములు
వాసెను మీదర్శనమున ♦ వరమునివంద్యా. 86.

చ. సురపతివంద్య పాదయుగ ♦ శోభితుఁడై యఖిలాండనాథుఁడై
పరఁగును దేవదేవుఁడగు ♦ పద్మదళాక్షుఁడె దైవమంచుఁ ద
త్పరమ మతంబె ముక్తి ని ♦ దానము నావిలసిల్లునంచు నే
నెఱిఁగితి కొంతకొంతభవ ♦ దీయముఖాంబుజ వాక్యవైఖరిన్. 87

క. నలినాక్షభక్తియోగము
తెలిపితి రుపాసనావి ♦ ధిప్రియతనముల్

దెలియంగ నానతీయఁగ
వలయును మునినాథభువన ♦ వర్ణితచరితా. 88

క. అనియీరీతింబలికిన
జనపతినీక్షించి మిగుల ♦ సంతతమొదవన్
మునినాథుఁ డతనితోని
ట్లనియెను గ్రిమ్మఁ జనుదరవి ♦ హసితాననుఁడై. 89

సీ. జననాథవినుముని ♦ స్సంశయంబుగనీకుఁ
దెలిపెదసర్వంబుఁ ♦ దెలిసికొనుము
జగమునసంతతా ♦ చారపూతాత్మలై
కర్మయోగంబున ♦ ఘనులుద్విజులు
చర్చింపఁదద్వప్రి ♦ సంసక్తులై తద
ర్థాచారసహితులు ♦ రాజవరులు
తన్మహీపాలక ♦ ర్తవ్యార్థ కర్మప్రి
వర్తులు తదనుజ్ఞ ♦ వైశ్యజనులు
బ్రాహ్మణోత్తమ సేవనా ♦ భక్తిదకర
సతులకును శూద్రజనులకుఁ ♦ జలుపవలయు
నట్టికర్మంబులెచ్చోట ♦ నైనఁగలుగ
వట్టుగావునవారు పు ♦ ణ్యాత్ములనఘ. 90

క. ఊర్వీతలమున మనుజుల
దుర్వాహకలుపాగ్నులకును ♦ దోయదమగుచున్
సర్వాధికార మనఁజను
సర్వేశ్వరపాదభక్తి ♦ చర్చింపంగన్. 91

క. తఱచుగావిఘ్నములెదిరినఁ
బరితప్తుఁడుగాక విష్ణు ♦ పదపంకజను
స్థిరభక్తితోడ మనుజుఁడు
చరియింపఁగవలయు సుగుణ ♦ చరితుండగుచున్. 92

క. యోగంబున విఘ్నితుఁడగు
భాగవతోత్తముఁడు సిరులఁ ♦ బరగుచు విపులన్

భోగార్థముద్భవించియు
యోగోన్నతుఁడగును బూర్వ ♦ యోగబలమునన్. 93

క. మారుతమున ముడిచెదిరిన
బూరుగుతూలంబు మాడ్కిఁ ♦ బోవును వృథయై
నారాయణుఁ దలఁపని పా
పారూఢుల వంశమాయు ♦ రైశ్వర్యంబుల్. 94

గీ. అస్థిరంబు దేహ ♦ మనుచో ననాగత
క్షణమునందు బ్రదుకు ♦ సంశయంబు
ఇది దలంచి నీవు పదిలమై ♦ హరిభక్తిఁ
జనగవలయు విష్ణు ♦ సదనమునకు. 95

వ. మఱియు దేహి దేహలయంబు మనోలయంబునను ద్వివిధంబులగు లయంబు
లం బొందు నందు దేహలయంబు నైమిత్తికాత్యంతిక భేదంబులం బ్రవర్తిం
చుఁ దద్భేదంబులయందు సుషుప్త్యవస్థా సమయంబున జీవుండు మనోల
యంబు నొందుటయైనది నైమిత్తికంబును, దజ్జీవుండు దేహంబు పరిత్యజిం
చి దేహాంతర ప్రాప్తుండగుట యాత్యంతికంబుననగు నిట్టి భేదంబులం బ్రవ
ర్తిల్లు నవి దేహలయంబనంబరగు నింక మనోలయంబు ధ్యానయోగనిష్ఠంబై
ద్వేధావిభక్తంబగు నందు బాహ్యంబు మఱచి లక్ష్మీవల్లభు నుల్లంబున ను
త్ప్రేక్షించుట ధ్యాననిష్ఠంబు; హృత్కమలనివాసుండగు లక్ష్మీకాంతుని దివ్య
మంగళ విగ్రహంబునందుఁ దన్మానసంబు లయంబు నొందుట యోగనిష్ఠం
బుననగు నిట్లు నిత్యప్రవృత్తంబులైన దేహమనోలయంబుల స్వరూపంబు లె
ఱింగి జ్ఞానాజ్ఞానాత్మకంబైనఁ బ్రపంచంబునఁ దిరంబగు దేహంబున నధి
ష్ఠితంబైన జ్ఞానంబూని తన్నిజాంశంబున మనంబును సృజియింప నది లో
చనరూపంబై తాదృగ్విధ దృష్టప్రపంచంబునందు ఘటపటాద్యులు గ్రహి
యించుఁ దత్ప్రథమావస్థా సంభవంబును, దదంతరావస్థా స్థితియును, దద
విలోకనంబును విశ్వంబునకు లయంబులనఁ బరఁగు నిట్లు వస్తువులయందు
క్షణమాత్రోదితంబులైన జననస్థితిలయంబులు ద్రివ్యరూపంబులై నిజశరీరం
బున నధిష్ఠితంబులుగా వివరించెద రంతఃకరణ వ్యాపారసమేతంబగు తద
జ్ఞానంబు నణంచి సర్వేంద్రియ రూపంగు చిత్తంబును బాహ్యవస్తువుల వల
నం గుదియించి లక్ష్మీవల్లభు ననవరతంబునుం దలంపఁగవలయు. 96

ఉ. కాలముచేత వంచితుఁడు ♦ గాక దయాపరిపూరితాక్షుఁడై
నాలుకఁబుండరీక నయ ♦ నప్రియనామము లెల్లకాలముఁ
లీలనుతించు మర్త్యుఁడుని ♦ లింపులు గొల్వఁగముక్తినొందుఁద
తాఁలుని కాలదండహతిఁ ♦ గందక వేడ్కఁ దలిర్పభూవరా! 97

సీ. వేదంబులెల్ల శ్రీ ♦ విభునిరూపంబులై
వివిధ ధర్మాచార ♦ విధులనెల్ల
విస్తరింపఁగనైన ♦ వీక్షించి తద్గతి
తార్థముల్ కుమతుల ♦ న్యముగఁజేసి
విధినిషేధంబులు ♦ వివరింపనొల్లక
కర్మవైగుణ్యముల్ ♦ గనఁగలేక
మహిని సర్వజ్ఞాభి ♦ మానసంయుక్తులై
ఖ్యాతితత్ఫలముగ ♦ నాదరించి
విష్ణువిరహితముగ దుష్ట ♦ వృత్తిదనరి
భూతతృప్తిగ యాగముల్ ♦ పూనిచలిపి
పెంపుదలకొన ముక్తిసా ♦ ధింపలేక
తిరుగ జన్మ వ్యయంబులం ♦ దెదలువారు. 98

సీ. ఫలసమేతంబైన ♦ పాదపంబీక్షించి
సత్వహీనుండైన ♦ సత్వరముగ
నాయాస సంయుక్తుఁ ♦ డయ్యుఁదద్వృక్షాగ్ర
మారోహణము సేయు ♦ నట్టినరుఁడు;
వట్టిమాఁకెక్కఁగ ♦ వాంఛింపఁడట్లుగ
బుధులుభోగప్రాప్తిఁ ♦ బొదలుకొఱకు
ననయంబుఁగామ్యక ♦ ర్మాచారనిరతులై
శాశ్వతనిలయంబు ♦ జాడవిడిచి
తత్ప్రియుక్తంబులుగ వాంఛి ♦ తములఁబొదవి
దేవభూములవసియించి ♦ తిరుగవసుధ
పై మహాహీన మాతృగ ♦ ర్భములఁజెంది
యుద్భవంబును నాశంబు ♦ నొందువారు. 99

క. ఆ కామ్యములైనను లౌ
కిక్మికాంతున కర్పితముగఁ • జేసినమనుజుం
డా కైటభ రిపునిశ్చల
లోకంబున సుఖమున్నొందు • లోకోత్తరుఁడై. 100

వ. మఱియు బాలకుండు గుడ వాంఛానమేతుండై తిక్తంబుఁగొను చందంబునఁ గర్మఫలవాంఛనొదవి తద్దర్శకంబులగు జ్యోతిష్టోమాదికర్మంబులాచరింపం దత్సామర్థ్యంబున జ్ఞానంబునకు నాచ్ఛాదకంబులైన కలుషంబు లపహృతంబులగు నట్లయినచో మలినంబగు దర్పణంబు ప్రతచూర్ణలేపన పరిభావంబున నిర్మలంబగునట్ల తత్కర్మాచరణంబునఁ బాతకాపేతంబై జ్ఞానంబు పరివృద్ధంబై నిష్కళంకంబైన కైవల్యంబునకుఁ గారణరూపంబగునట్లు గావున నిత్యనైమిత్తికాది కర్మంబులును జ్ఞానంబునకు సాధనంబులగునని చెప్పి మఱియు నిట్లనియె. 101

సీ. స్థావరజంగమా • త్మకమైన విశ్వంబు
విష్ణురూపంబుగా • వీక్షచేసి
మానితదేహాభి • మానంబువర్జించి
గురుకృపా కలితుఁడై • వెరవుగలిగి
తద్విష్ణుభృత్యభృ • త్యసమానుఁడై శాంత
చిత్తుఁడై నిత్యాను • చిత్వములరఁ
గామరోషాదిదు • ష్కరదేహబాహిత
సంఘంబు లెల్లను • నడల మోఁది
నంతతాచారసహితుఁడై • సత్యవాక్య
సంయుతుండగు చనయంబు • సఖ్యవృత్తిఁ
దిరుగనేర్చిన పుణ్యుండు • త్రిదశవినుతుఁ
డగుచు విలసిల్లు హరిమంది • రాంతరమున. 102

క. ఆహవ భయవర్జితు లగు
బాహుజులకు వైశ్యులకును • బఱఁతుల కైనన్
దేహాయాసము వొందక
శ్రీహరిఁ దలఁపంగవలయుఁ • జిత్తాబ్జమునన్. 103

గీ. సిరుల నీయఁజాలి ♦ చిరకాలసంప్రాప్త
కలుషచయము నణఁపఁ ♦ గలిగినట్టి
పుండరీకనయనుఁ ♦ డుండఁగఁ గుమతులు
పతితు లగుదు రన్య ♦ మతముఁ దగిలి. 104

సీ. చింతనీయములందుఁ ♦ జింతింపఁదగు విష్ణు
మంగళనామంబు ♦ మానవేంద్ర
దర్శనీయములందు ♦ దర్శింపఁదగు పంక
జాక్షుని చరరూప ♦ మవనినాథ
శ్రవ్యంబులం దత్తి ♦ శ్రవ్యంబు లక్ష్మీశు
సద్గుణజాలంబు ♦ జనవరేణ్య
వర్ణనీయములందు ♦ వర్ణ్యముల్ చక్రాంక
పౌరుషంబులు రాజ ♦ పద్మమిత్ర
యట్లు గావున వేదవే ♦ దాంతనిలయుఁ
డగు తదంభోజనాభుని ♦ ననుదినంబు
సర్వగతుఁడుగఁ దలఁచి ని ♦ స్సంశయమున
వినుతి సేయంగవలయును ♦ ర్వీతలేశ. 105

సీ. రక్తమాంసాస్థిచ ♦ ర్మావృతం బైనట్టి
తను వనిత్యం బని ♦ తలఁపవలయు
స్వప్నరూపం బైన ♦ సంసారసౌఖ్యంబు
మెఱపుచందం బని ♦ మెలఁగవలయు
బహుళపుత్త్రాదిసం ♦ పద లెల్ల ఘనదుఃఖ
హేతువు లని యాత్మ ♦ నెఱుఁగవలయు
సంభవస్థితివినా ♦ శములు దేహమ్మునకు
నిత్యంబు లని బుద్ధి ♦ నిలుపవలయు
జంగమస్థావరాదిప్ర ♦ శస్తవిశ్వ
విభుఁడె దేవత యనుచు సే ♦ వింపవలయు
నంబుజాక్షుండె ముక్తిదా ♦ యకుఁ డటంచుఁ
దేఱుకొన నిట్టి వివరముల్ ♦ దెలియవలయు. 106

గీ. భోగసరణిమీఁద • బుద్ధిరోసినఁగాని
పాదుకొనదు హృదయ • పంకజంబు
స్వాంతవనరుహంబు • చాంచల్య ముడిగిన
యపుడె యోగసిద్ధి • యగు నృపాల. 107

క. తలఁపుము హరినామంబులు
నిలుపుము హృదయంబులోన • నీరజనాభుక్
జలుపుము వైష్ణవకృత్యము
లలఘుయశోధామ కువల • యాధిప వినుతా. 108

క. శరణాగతు లగు దాసులు
దురితౌఘసమేతు లైనఁ • దోయజనాభుం
డరసికొని వారి కొసఁగును
బరిపూర్తిగ నాత్మలోక • భవసౌఖ్యంబుల్. 109

వ. మఱియుఁ గర్మయోగంబును భక్తియోగంబును జ్ఞానయోగంబును ధ్యాన యోగంబు నను యోగవిశేషంబులు ముక్తిప్రాప్తికరంబు లై నాల్గు విధంబు లఁ బ్రవర్తించు నందు, నాధానపుంసవన సీమంత జాతకర్మ నామకర ణాన్నప్రాశన చౌలోపనయన వేదవ్రత స్నాతక వివాహ పంచమహాయజ్ఞ హోమ వైశ్వదేవ మాసపైతృక నైమిత్తిక పైతృకాగ్నిహోత్ర దర్శ పూర్ణ మాసాగ్రయణాగ్నిష్టోమాది కర్మాచరణంబు కర్మయోగంబు, శిలా దారు లోహ మృదాదికల్పితంబు లైన ప్రతిమాభేదంబులయందుఁ బుండరీకాక్షు నావహించి యప్పరమపురుషునకు విధ్యుక్తప్రకారంబున నాసనార్ఘ్యపాద్యా చమనీయ మధుపర్క స్నాన వస్త్ర యజ్ఞోపవీత దివ్యాభరణ గంధపుష్ప ధూప దీప నైవేద్య తాంబూలాద్యుపచారంబులు యథాసంభవంబుగ సమ ర్పించి స్తుతిపూర్వకంబుగఁ బ్రదక్షిణ నమస్కారంబు లాచరింపవలయు నిట్లు ప్రత్యహంబును నాచార్య పుండరీకాక్షతద్భక్తకైంకర్యసమేతం బగు శ్రద్ధ భక్తియోగంబును నిస్సారం బగు సంసారంబున శరీరమాత్రబాంధవు లైన సుత దారాదులయందుఁ బాదుకొనిన దుర్మోహంబుఁ బరిత్యజించి వైరాగ్యంబు నొంద నది జ్ఞానయోగంబనగు నింక ధ్యానయోగలక్షణంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 110

సీ. తానంబు దీర్చి ధౌ • తములైన వస్త్రముల్
ధరియించి సాంధ్యకృ • త్యములు నడపి
విజనస్థలంబున • విమలపద్మాసనా
సీనుఁడై యంత ని • శ్చింతుఁ డగుచు
నయనవాగాదికేం • ద్రియనిరంకుశబాహ్య
గతి నంతరాత్మ సం • గతము చేసి
కామరోషాదులఁ • గట్టి మూలకుఁ ద్రోబ్చి
శీతోష్ణములచేతఁ • జిక్కువడక
యోగిపురుషుండు హర్షనం • యుక్తుఁ డగుచు
ద్వాదశారసమేత హృ • ద్వనజమందుఁ
బ్రణవ మంత్రాక్షరంబులఁ • బొదుకొల్పి
తత్పయోరుహకర్ణిక • తలము సేసి. 111

సీ. శ్రీవత్స కౌస్తుభ • శ్రీయుక్తవక్షుని
లలితపీతాంబరా • లంకరిష్ణు
నతులకుండలరుచి • వ్యాప్తగండద్వయు
నంచితవక్త్రప • ద్మాభిరాముఁ
బుండరీకాక్షునం • బోధరశ్యామల
దేహుఁ గిరీటదే • దీవ్యమాను
శార్ఙ్గనందక సుద • ర్శనశంఖరంజిత
శ్రీహస్తవర్ణితు • శేషశయను
వాసవప్రముఖామర • వంద్యచరణుఁ
దులసికాదామసంలగ్న • లలితకంఠుఁ
దన్మనఃపద్మకర్ణికాం • తరనివిష్టుఁ
దలఁచునది ధ్యానయోగంబు • ధరణినాథ. 112

క. ఏవంవిధ లక్షణముల
భావితుఁడై మదనకోటి • భాసురుఁడగునా
శ్రీవల్లభునిఁ దలంపుము
భావసరోజంబునందుఁ • బార్థివముఖ్యా. 113

క. వినుము నృపాలక చెప్పెద
మనమున ననుమానమెల్ల ♦ మానిరమానా
ఘనిఁదలఁపుము హృదయంబున
ననిమిషులు నుతింపముక్తి ♦ కరిగెదవీవున్. 114

వ. అనియిట్లు కపిలమునీంద్రుండు వైరాగ్యలక్షణంబును విష్ణుభక్తి ప్రకారంబును జెప్పిన విని పుండరీకుండిట్లనియె. 115

మ. ఘనులై పాపవిముక్తులై నిగమయో ♦ గజ్ఞానసంపన్నులై
వనజాతాక్ష విశిష్టభక్తిరతి ప్ర ♦ శస్తాత్ములైయున్నయీ
మునివర్యుల్ తపమాచరించుచును ద ♦ న్మోక్షంబునొందంగలే
రనఘా యీక్రియఁదెల్పఁగావలయు స ♦ త్యజ్ఞానసంభావితా. 116

క. అనినమహీవల్లభునకు
మునివల్లభుఁడిట్టులనియె ♦ మోదముతోడన్
వనరుహవిమతాకృతి ద
ర్శనసంక్షుభితాబ్ధిఘోష ♦ చారుమృదూక్తిన్. 117

సీ. తపముచేవిశ్రుతుల్ ♦ తరిగింపమనుతెల్ల
దానసాయుష్యంబు ♦ తఱిఁగిపోక
దినవృద్ధినొందఁగఁ ♦ ద్రిదశనాయకుఁడైనఁ
దన్మునీంద్రులఁజూచి ♦ తలఁకుచుండు
నమ్మహాత్ములు పంక ♦ జాసనుతోఁగూడి
చనువారు శ్రీవిష్ణు ♦ సదనమునకు
నంతపర్యంతమ ♦ బ్రాహ్మణకల్పితం
బులుగాక సత్కర్మ ♦ ములఁజరింతు
రట్లుగాన దేహాంతర ♦ ప్రాప్తిలేక
నిత్యముక్తులు తత్పుణ్య ♦ నిరతమతులు
యుష్మదాదులకెల్లనా ♦ యువులుగొంచె
మైనయెడ ముక్తిమార్గంబు ♦ లరయవలయు. 118

సీ. హరియె దైవంబని • యాత్మలో మును లెల్ల
నెఱిఁగియుండియు వారు • వెఱపుగలిగి
తొల్లి ప్రత్యక్షమై • తోయజాక్షుం డాన
తిచ్చిన క్రమమెల్ల • వీక్షచేసి
పరిబలు వైష్ణవనిరూ • పణమున నీసృష్టి
విఘ్నసంయుక్తమై • విరియుననుచు
మతివిశేషమున దు • ర్మతయుక్తిసంయుక్త
బాహ్యావాదంబులఁ • బ్రబలికొనుచు
వడిఁ జరాచరరూప వి • శ్వంబు నెల్ల
మోహపఱుచుచు నిజమైన • ముక్తిసరణి
సత్యపరులకునైన స • జ్జనులకైనఁ
దెలుప రోరులకు సుజ్ఞాన • లలితహృదయ. 119

వ. అట్లు గావునఁ గర్మాచారసమేతులును వైరాగ్యసంయుక్తులును సుజ్ఞానసమేతులును నగ్రగణ్యులును నైన మునీంద్రులు శాపానుగ్రహ సమర్థులై మోక్షంబునందుఁ గృతనిశ్చయులై ముక్తులనంబరఁగి భోగవాంఛారహితులై తత్తద్ధామంబులయందు శాంతులును దాంతులును వైరాగ్యసంయుక్తులును నైన పరమపుణ్యులకు వైష్ణవం బగు మార్గం బుపదేశించుచుఁ బ్రవర్తింతు రని చెప్పినఁ గపిలునకుఁ బుండరీకుం డిట్లనియె. 120

క. వనజాక్షుఁడు తత్పూర్వం
బున నేమని యానతిచ్చె • ముదమలరఁగఁ ద
న్మునివరులకు నీభువనం
బనుమతిఁ జెడుటెట్లు వైష్ణ • వాగ్రమతమునన్. 121

క. వనరుహనాభుని యానతి
యన నెయ్యది తెలివి మెఱయ • నతిరభసమునన్
మునినాథ యావిచిత్రము
వినుపింపుము హృదయమందు • వేడ్కఁ దలిర్పన్. 122

వ. అనిన రాజునకు మునివర్యుం డిట్లనియె. 123

సీ. వినుము భూవర పూర్వ • మున రమాకాంతుండు
వేడ్కఁ మనస్సృష్టి • విదితముగను

నిర్మింపఁ దద్విశ్వ • నిలయ మానవ నాగ
యక్షాదు లానంద • మతిశయిల్లఁ
దత్పుండరీకాక్షుఁ • దలఁచి కైవల్యంబుఁ
బొందినయంతఁ ద • త్పుణ్యమూర్తి
శేషోమయంబుగాఁ • జాతుర్యమున సృష్టిఁ
గ్రమ్మఱఁజేయను నిల్పి • కౌతుకమున
నందు మఱియును నరదేవ • యక్ష పక్షి
పశు మృగాదులఁ గావించి • ప్రాభవమున
నవియుఁ జెడకుండ నొండుపా • యంబుఁ దలఁచి
మునుల నీక్షించి వారితో • ననియె నిట్లు. 124

గీ. ఏకతంబు సేసి • యేను మీతోడుత
మాట యనెద నొకటి • మంతనంబు
తెలిపి చెప్పవలదు • త్రిభువనంబుల నది
చెప్పినపుడు మీకుఁ • దప్పిదంబు. 125

వ. అది యెట్టి దనిన. 126

సీ. అనుమాన ముడిగి శ్రీ • వనితాధిపుఁడు లోక
నాయకుండని మనో • నలినమందు
మనువేడ్కఁ దలఁపోసి • మన్నామజపములు
సేయుచు మద్భక్తిఁ • జెలఁగువారు
అరుగుదు రస్మదీ • యాలయంబునకును
బ్రబలపునర్జన్మ • రహితు లగుచు
నిది యథార్థంబుగా • నెఱిఁగి మానవకోట్లు
మన్మఖ్యాదివ్యనా • మములు దలఁచి
నంత సాయుజ్యముక్తికి • నరుగునపుడె
ప్రాణి విరహితమగుచుఁ బ్రి • పంచ మెల్ల
వృద్ధిఁబొందక విపరీత • వృత్తిఁ జెదరి
సకలదిశలందు శూన్యమై • సమయు నంత. 127

గీ. అట్లుగాన నస్మన్మతం • బణఁచి మీరు
బాహ్యమున నన్యమతములు • పాదుకొల్పి

ప్రకటములు సేయనందునఁ ♦ బరిజన కెల్ల
సంశయంబొదవు హృదయా ♦ బ్జంబులందు. 128

క. ఈరీతి సంశయంబుల
మీరి జనుల్ బెగడుపడిన ♦ మృగముల కరణిన్
నేరుపు సెడి పలుతెఱఁగుల
జాఱుదురెఱుఁగంగలేరు ♦ సన్మార్గంబుల్. 129

గీ. జాడఁదప్పినట్టి ♦ జనులెల్లభ్రాంతులై
తిరుగుచున్నయట్లు ♦ దివిజులైన
మమ్ముఁదలంపరేని ♦ మహిమీఁద వారలు
మేటిసంసృతులను ♦ మెలఁగువారు. 130

క. నలినోదరుఁ డగు నను మదిఁ
దెలియక యీ జీవకోట్లు ♦ తిరుగన్ జననం
బులఁ బొందఁగఁ జనునప్పుడు
నిలుచును నెడతెగక సృష్టి ♦ నిర్విఘ్నముగన్. 131

క. అది యెఱిఁగి మీరు ముక్తి
ప్రదమగు మన్మతము దాఁచి ♦ మనుజుల కెల్లన్
విదితము సేయక మదిలో
ముదమునఁ దెలియంగవలయు ♦ మునివరులారా. 132

గీ. కర్మమార్గమందు ♦ ఘనులైనవారికి
ముక్తి గోరునట్టి ♦ భక్తులకును
నిలిచి తొలఁగనట్టి ♦ నిశ్చలజ్ఞానంబు
గురుఁడనగుచు నేనె ♦ కుదురుపఱుతు. 133

వ. అని పుండరీకాక్షుండానతిచ్చిన క్రమంబు నీకెఱింగించితి నట్టి భాగవత ధర్మంబులు దెలియఁ బద్మభవాదులకైనను శక్యంబులుగావు; ఈజగంబు తద్విష్ణుమాయామోహితంబై బరివర్తించు; నతని గుణవ్యాపారపౌరుషంబులు వినుతించువారు సాయుజ్యంబు నొందుదురని పలికె మునీంద్రుం డట్లనియె. 134

గీ. ఒకట మంత్రరాజ ♦ ముపదేశ మిచ్చెద
నది జపంబుసేయు ♦ మంబుజాక్షుఁ

డాఱు దివసములకు ♦ నభివాంఛితం బిచ్చు
నీకు మనుజచంద్ర ♦ నెమ్మితోడ. 135

వ. అట్టి మంత్రం బెట్టిదనిన. 136

మంత్రము.

పరాయ పరరూపాయ పరమాత్మన్ పరాత్మనే
నమః పరమతత్త్వాయ పరానందాయ ధీమహి. 137

క. ఈ మంత్రము జపియించిన
భూమీశ్వర నీకుఁ గల్గు ♦ భువనములోనన్
గామితమగు వైకుంఠము
శ్రీమత్పదపద్మయుగ్మ ♦ సేవారతియున్. 138

వ. ఇవ్విధంబునఁ గపిలుండు మోక్షధర్మంబులు సెప్పిన విని పుండరీకుండు మనంబునం గలుగు సంశయంబు మాని సమచిత్తుం డై యా మునీంద్రునకు దండప్రణామం బాచరించి స్నానపూర్వకంబుగఁ దన్మంత్రంబు పరిగ్రహించి యమ్మహాత్ముని యనుగ్రహంబునఁ దదాశ్రమోపాంతంబునం గలుగు పద్మపుష్కరిణీతీరంబుఁ జేరి తత్పుణ్యజలంబుల స్నానాదికృత్యంబులఁ దీర్చి ధౌతవస్త్రంబులు ధరియించి పద్మాసనాసీనుం డై బాహ్యగతజ్ఞానంబు విసర్జించి హృదయపద్మంబునందు సర్వభూషణభూషితుండును, సుదర్శన పాంచజన్యాది సర్వాయుధోపేతుండును, సర్వలక్షణసమేతుండు నైన లక్ష్మీవల్లభునిఁ బాదుకొల్పి తదుపదిష్టం బగు మంత్రంబు జపియించుచున్న యెడ. 139

సీ. గ్రైవేయకంకణాం ♦ గద హారకుండల
ప్రభ లలితస్ఫూర్తిఁ ♦ బరిఢవిల్ల
నవరత్నకీలితో ♦ న్నతకిరీటద్యుతు
లాశావకాశంబు ♦ నలమికొనఁగఁ
గటివిలంబితహేమ ♦ కాంచీవిలగ్నమై
రాజితపీతాంబ ♦ రంబు మెఱయ
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీసమాయుక్తమై
తులసికాదామంబు ♦ తొంగలింప

నతిరయంబున గరుడవా • హనసమేతుఁ
డగుచు విష్ణుండు శంఖచ • క్రాదివిశ్రు
తాయుధంబుల ధరియించి • యవనిపతికిఁ
దక్షిణంబున నచటఁ బ్ర • త్యక్ష మయ్యె. 140

వ. ఇట్లు పుండరీకలోచనుండు నిజభక్తసమేతుం డై యచ్చటికి నరుగుదెంచి తన్మహీకాంతునకు దివ్యజ్ఞానంబు గృపసేసిన నతండును రోమాంచ కంచుకితుండు హర్షాయత్తచిత్తుండు నై వివిధభూషణాలంకృతుండును సర్వాయుధోపేతుండును సర్వలక్షణపరిపూర్ణుండును ఖగేంద్రవాహనుండును భక్తజనసమేతుండును నైన యప్పరమమూర్తిం గనుంగొని ప్రణామపూర్వకంబుగా నిట్లనియె. 141

చ. అనవరతంబు మీగుణము • లాత్మఁ దలంచుచు నిత్యముక్తు లై
మునులు భవత్స్వరూపము స • మున్నతి నీక్షణ సేయలేనిచో
వనజదళాక్ష భక్తజన • వత్సల • యేఁ గనుఁగొంటిఁ బుణ్యలో
చనముల యుష్మదీయమగు • సన్నుతదివ్యశరీర మిచ్చటన్. 142

చ. ఫలితము లయ్యె మత్ప్రతత • పంబులు జన్మసహస్రసంచితా
ఖిలకలుషౌఘసంపదలు • గీటడఁగెన్ భవసాగరంబు ని
శ్చలభవదంఘ్రిభక్తి యను • సాధనసంగతి వెళ్ళ నీఁదితిన్
నలినవిలోలనేత్ర యిఁక • నన్గరుణింపుము భక్తవత్సలా. 143

సీ. పరిమళద్రవ్యంబు • బహుళమై వర్తింపఁ
జని కర్దమముఁ బూసి • కొనినయట్లు
సరిలేని రత్నభూ • షణములు వర్జించి
గురువెందసరములు • గోరినట్లు
సరసాన్నభక్ష్యభో • జ్యములు విసర్జించి
మించి శాకమున కా • సించినట్లు
వన్నెమీఱిన పట్టు • వస్త్రముల్ విడనాడి
కంబళచేలముల్ • గట్టినట్లు
అఖిలజగదేక నాథుఁడ • వైన నిన్నుఁ
దలఁపనొల్లక దేవతాం • తరములందు

భక్తిసంపన్ను లగునట్టి • పాపరతులు
పొందుదురు రౌరవంబుల • భువనవంద్య. 144

క. కీటం బైనను మీదయఁ
బాటిల్లిన నిందుఁ డగును • బాకాహితుఁడుఁ గీ
టంబగు మీదయకును
సూటిగ వర్తింపఁ డేని • శుభగుణనిలయా. 145

క. ఏవివరంబును నెఱుఁగను
గావింపఁగలేను నిత్య • కర్మాదివిధుల్
శ్రీవల్లభ దయచేయుము
కైవల్యము నస్మదీయ • కాయముతోడన్. 146

వ. అని పుండరీకుండు విన్నవించిన సంతోసించి యప్పరమపురుషుండు నిజకర కమలంబునఁ దదీయశరీరస్పర్శనంబు సేయుచు నిట్లనియె. 147

మ. రమణీబంధుజనాప్తులన్ విడిచి త • ద్రాజ్యంబు వర్జించి దు
ర్దమకామాదులఁ జెందనీక హృదయ • స్థైర్యంబునన్ మించి తీ
వమితాస్మద్గుణకీర్తనావ్రతము చే • నాహ్లాదయుక్తుండ వై
విమలంబైన గుణంబు గల్గ నిను నే • వీక్షించితిం బుత్త్రకా. 148

క. చలితులుగాక దృఢంబుగఁ
దలఁపున మముఁ దలఁచునట్టి • తత్త్వజ్ఞుల మ
న్నిలయమునఁ బాదుకొల్పుదుఁ
జలమునఁ దద్విహితహర్ష • సంయుక్తుఁడ నై. 149

క. భూరమణ నీవు జగముల
మీఱి క్షమముం దలఁచుటకును • మెచ్చితి మదిలో
నేరీతి నీవు గోరితి
వారీతిన చనఁగవలయు • నస్మత్పురికిన్. 150

వ. అనియిట్లు పుండరీకాక్షుం డానతిచ్చిన యనంతరంబ యప్పుండరీకుండు దధివేశసంగంబున దుగ్ధంబులు దధిరూపంబులు దాల్చుచందంబునఁ దత్కరస్పర్శనంబున దివ్యశరీరసమేతుండై పరమభాగవతాగ్రగణ్యుండై దివిజులు సన్నుతింపఁ దద్రమావిభుంగొలిచి పరమపదంబునకుంజనియెనట్లుగావునలక్ష్మీ

వల్లభుండు భక్తియోగమాత్రంబుననె ప్రసన్నుండై భక్తులకుఁ బరమపదం బుఁగృపసేయు నీయుపాఖ్యానంబు విని నంబఠించిన లక్ష్మీకాంతుని లోకంబున నిలయంబు కలుగునని చతుర్ముఖుండు సెప్పి నారదునకు మఱియు నిట్లనియె.

సీ. తెలియుము మదిలోనఁ ♦ దిరముగా విష్ణుండు
పరతత్వమనుచును ♦ భక్తిఁబొదలి
నుడుగుము భక్తితో ♦ నెడపక తద్రమా
కాంతు సద్గుణములు ♦ కౌతుకమునఁ
దలఁపుము హృదయప ♦ ద్మంబునఁ గమలేశు
నాకుపంజరము స ♦ న్నాహ మొదవ
వినుము వీనులయందు ♦ మునుకొని కౌస్తుభా
భరణుని కథలు సరి ♦ భ్రమము నిగుడ
వందనముసేయు మాచార్య ♦ వర్యవిప్ర
పరమవైష్ణవ మార్గప్ర ♦ పన్నులకును
జేరఁబోవకు మెచ్చోట ♦ వారిజాక్ష
మత విరోధకులైన దు ♦ ర్మతుల ననఘ. 152

క. ఈవైష్ణవధర్మంబులు
భావంబునఁ దెలిసి విష్ణు ♦ భక్తినుతుఁడవై
కావింపుము సత్కృత్యము
లావనజాక్షుం డొసంగు ♦ నఖిలార్థంబుల్. 153

సీ. ఆచార్యవైముఖ్య ♦ మాత్మప్రశంసయు
విష్ణుభక్తులఁజూచి ♦ విరసపడుట
తత్ప్రయోజనములు ♦ తప్పించినడచుట
పరులలాభంబులు ♦ చెఱుపఁజనుట
గర్వంబు నొందుట ♦ కపటంబు సలుపుట
మాయయు మోహంబు ♦ మత్సరంబు
పాదతీర్థము నేలఁ ♦ బడఁగ నంకించుట
హరిమందిరముచేర ♦ నరుగకుంట

సువ్రతంబగు నేకాద • శీవ్రతంబు
వీడనాడుట దుష్టవ్రృ • వృత్తితోడఁ
గామినులనింద సేయుట • క్రమముసెడుట
విష్ణుధర్మమున కిటెపో • విఘ్నతతులు. 154
చ. సరసిజజాతుఁడిట్లఖిల • శాస్త్రమతంబులలోన నేర్చిపా
పరతులకైనముక్తి సుల • భంబని వైష్ణవమార్గమంతయున్
సురమునికిక్రియందెలుపఁ • జోద్యమునంది యతండుహర్ష సం
భరిత మనస్కుఁడై మఱియుఁ • బద్మజుఁజూచి ప్రియోక్తినిట్లనున్. 155
క. శ్రీకాంతునకుఁ బ్రియంబై
యేకాలమునరుల కెల్ల నిష్టార్థంబుల్
చేకొనియొసఁగుచు ఘనమగు
నేకాదశి మహిమమాకు • నెఱుఁగఁగవలయున్. 156
వ. అనిపలికిన నారదునకు సురజ్యేష్ఠుండు సంతోషంబునఁ బులకితాంగుండై
యిట్లనియె. 157
సీ. వినుముమునీంద్రయే • వివరించిజెప్పెద
వరుసనేకాదశీ • వ్రతమహత్వ
మాదినంబునఁబంక • జాక్షునిఁబూజించు
వారికిసిద్ధించు • వాంఛితములు
ఉపవాసనిరతులై • యుండెడిసజ్జనుల్
హరిమందిరమ్మున • కరుగువారు
ద్వాదశీవ్రతమహి • త్వాహసంపన్నులు
నిష్పాపులైకీర్తి • నెగడువారు
విప్రభూమీశదేవతా • విత్తహరులు
భ్రూణహంతలుసంతత • క్రూరమతులు
నార్యనింద్యులు మద్యపా • నాభిరతులు
దద్వ్రతంబున ముక్తులై • తనరువారు. 158
వ. మఱియును. 159
సీ. దశమినాఁడేకభు • క్తముసేసి దేవగృ
హమునవధశ్శాయి • యగుచు వేడ్క

నిద్రించిమఱునాఁడు ♦ నియతుఁడై యేకాద
శీదినంబుననురా ♦ జీవనేత్రుఁ
దలఁచుచునిమ్మగా ♦ జలకృతస్నానుఁడై
విమలుఁడై సంధ్యాది ♦ విధులఁదీర్చి
లీలతోఁగోమయ ♦ లిప్తస్థలంబునఁ
బద్మనాభాకృతి ♦ ప్రతిమనిలిపి
యందుభావించి లక్ష్మీశు ♦ నావహించి
పుష్పచందనములచేతఁ ♦ బూజసేసి
భక్తినైవేద్యమర్పించి ♦ ప్రస్తుతించి
యతిముదంబునఁదానమ ♦ స్కృతులొనర్చి. 160

గీ. విష్ణుకథలచేత ♦ వితతనర్తనవాద్య
గీతనుతులుసెలఁగఁ ♦ బ్రీతితోడ
జాగరంబుసేసి ♦ చతురతనారాత్రి
గడపవలయునిట్లు ♦ గరిమమెఱయ. 161

వ. అంత. 162

క. బారసిదినమున సుచితా
చారమ్ములు దీర్చినరుఁడు ♦ సంతసమునల
క్ష్మీరమణార్పితముగఁదాఁ
బారణసేయంగవలయు ♦ భాసురచరితా. 163

గీ. ఇదివ్రతంబుగాఁగఁ ♦ బదిలుఁడై కడఁకను
నడపనేర్చినట్టి ♦ నరవరుండు
సురలువినుతిసేయ ♦ శోభితాకారుఁడై
చనుచునుండువిష్ణు ♦ సదనమునకు. 164

క. తలకొనినఖములఁజిదిమిన
తులసీదళములను విష్ణుఁ ♦ దోయజనాభున్
ఫలవాంఛఁబూజసేయ వి
ఫలుఁడగు నానరుఁడుపాప ♦ భావుండగుచున్. 165

సీ. మునుకొని ప్రణవాదు ♦ లును సమోంతములునై
తెలివొందు లక్ష్మీశు ♦ దివ్యనామ
ములు పేర్నొడువుచుఁ ♦ దులసీదళంబులు
పదియేను బూజింపఁ ♦ బద్మనాభుఁ
డఖిలపాపంబుల ♦ నడఁచు నేకాదశీ
వాసరంబున రమా ♦ వాసుఁ డపుడ
చెఱుచును గాంచన ♦ స్తేయాదిదోషముల్
దళములనూటఁద ♦ తక్రమేల నాభుఁ
డంతమీఁదట ఫలమెల్ల ♦ నంబుజాక్షు
పురములోపలమణిగణ ♦ స్ఫురితకల్ప
భూజసుమవాసనాపరి ♦ పూర్ణనిత్య
నిరుపమానైకసౌభాగ్య ♦ నిలయ మనఘ.

క. హరివాసరమున నన్నము 166
పరితృప్తి భుజించుటెల్లఁ ♦ బానగృహమునన్
సురతోడుత గోమాంసము
వెఱవక భుజియించునట్లు ♦ వీక్షింపంగన్.

గీ. అనుపనీతులగుచు ♦ నజ్ఞులైతిరిగాదు 167
పంచవత్సరముల ♦ బాలకులకు
వృద్ధరోగులకును ♦ వీక్షింపఁ జెందదు
విష్ణువాసరాన్న ♦ వృజినమరయ.

సీ. భూదేవగురువిత్త ♦ ములు హరించిననైన 168
సంతతానాచార ♦ సహితుఁడైన
బ్రహ్మహత్యాదిపా ♦ పములఁ జెందిననైన
గురుభామినీబాల ♦ గోఘ్నుఁడైనఁ
జండాలకామినీ ♦ సంగతుండైనను
దఱచుగ మధుపాన ♦ నిరతుఁడైనఁ

దల్లినిదండ్రిని ♦ త్యజియించువాఁడైనఁ
బాషండమార్గసం ♦ భరితుఁడైన
నఖిలదోషాశ్రయుండైన ♦ యట్టినరుఁడు
సుస్థిరంబగుబుద్ధిచే ♦ సొంపుమిగిలి
యొక్కహరివాసరంబున ♦ నుపవసింపఁ
గలుగునతనికి లక్ష్మీశ ♦ నిలయమనఘ. 169

గీ. భక్తిసాధ్యుఁడైన ♦ పక్షీంద్రగమనుండు
హృదయపద్మమందుఁ ♦ బదిలముగను
నిలిచియున్నచోటఁ ♦ గలుషితులైమర్త్యు
లెఱుఁగరిట్టిసూక్ష్మ ♦ మింద్రియముల. 170

వ. ఇంక నొక్కపురాతనంబగు నుపాఖ్యానంబు వినిపించెద నాకర్ణింపుము.

సీ. మగధకోసలకురు ♦ మద్రాధినాథుఁడై
రంతిదేవుండను ♦ రాజవరుఁడు
ధర్మంబువిడిచినఁ ♦ దద్దేశములయందుఁ
గోరమైవర్షము ♦ ల్గురియవయ్యె
నదియొకారణముగ ♦ నఖిలసస్యంబులు
ఫలవిహీనంబులై ♦ నిలువుచెడిన
నంతదుర్భిక్షమ ♦ త్యంతభీకరముగ
నరుదేరనాప్రజ ♦ లధికమైన
దప్పినాఁకటనత్యంత ♦ తాపమంది
సమయునప్పుడు మద్రదే ♦ శంబునందు
దానవిఖ్యాతుఁడగువిష్ణు ♦ దత్తుఁడనఁగ
భూసురుండుండు విత్తసం ♦ పూరితుండు. 172

గీ. అన్నమునకువిత్త ♦ మంతయువెచ్చించి
చిన్నమైనముడుపు ♦ చేతలేక
రూపురేఖలందుఁ ♦ జూపట్టునిజభార్య
యగుసుగంధితోడ ♦ ననియెనిట్లు. 173

సీ. వర్షంబులేమిని ♦ వసుధాతలంబున
సస్యముల్ పండక ♦ సమసిపోవ
దుర్భిక్షమేతెంచి ♦ తొలఁగదేమిటనైన
వెళ్లెనుమనచేతి ♦ విత్తమెల్ల
సమయుచునున్నారు ♦ సకలదేశంబుల
ప్రజలన్నములులేక ♦ భ్రాంతులగుచు
సత్యదానక్రియా ♦ చారవిహీనులై
ధర్మంబువర్జించె ♦ ధరణివిభుఁడు
తలఁప నిచ్చోట మనకుండఁ ♦ దగవుకాదు
తొలఁగియొకచోటఁ బ్రాణముల్ ♦ నిలుపవలయుఁ
బ్రాణమూలము పుణ్యంబు ♦ ప్రబలుటకును
బుణ్యమునఁగల్గుఁ బరలోక ♦ పూర్ణసుఖము. 174

క. ఇప్పటికి వింధ్యదేశము
చొప్పగ ఫలకందమూల ♦ శోభితమగుచుఁ
జెప్పనగోచరమగునది
తప్పకచనవలయునటకుఁ ♦ దాత్పర్యమునన్. 175

వ. అంత. 176

క. శ్రీవత్సకౌస్తుభాంకిత
భావజశతకోటితులిత ♦ భాసురదేహా
కావేరీపులినాంతర
పావనసురవినుతరంగ ♦ పట్టణశయనా. 177

మత్తకోకిల. మండలాగ్రవిఖండితాఖిల ♦ మత్తశాత్రవమండలా
పుండరీకవిశాలలోచన ♦ పూర్ణచంద్రవికాసకా
కుండలీశవిపక్షవాహన ♦ ఘోరపాపవినాశయా
ఖండలాదిసురేంద్రశేఖర ♦ కాంతిమత్పదపంకజా. 178

# మత్స్యపురాణము.

## గద్యం.

ఇది శ్రీ హనుమత్కటాక్షలబ్ధ వరప్రసాద సహజసారస్వతచంద్ర
నామాంక రామవిద్వన్మణికుమారాష్టఘంటావధాన పర
మేశ్వరహరిభట్టారక విరచితంబైన మత్స్యపురాణ
ఖండంబగు విష్ణుధర్మోత్తరంబునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీ.



శ్రీ

# మత్స్యపురాణము

## పంచమాశ్వాసము.

శ్రీరంగమందిరోజ్జ్వల
చారువిమానాంత్గరంగ • శయ్యఘనధరిత్రీ
శ్రీరమణ భక్తవత్సల
నారాయణ రంగనాథ • నలినదళాక్షా. 1

వ. అవధరింపు మిట్లు విష్ణుదత్తుండు నిజభామిని యగు సుగంధిం గోడాఁగూసి కొన్ని దినమ్ములకుఁ దద్వింధ్యదేశమ్ముఁ బ్రవేశించి యొక్కశబరాలయంబునకు నేతెంచిన నందుఁ జంచలుండను శబరనాయకుండు తద్విప్రదంపతులం గనుంగొని వారలకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి కృతాంజలియై యిట్లనియె. 2

సీ. గజసింహ శార్దూల • గవయాది మృగయూథ
విస్తృతం బగుచు నీ • వింధ్యభూమి
నెలకొన శక్యమా • నిలుచువారిక, కాని
చేరి యొరులు ప్రవే • శింపఁగడిఁది
కలలోననైనను • గన మిందువిప్రుల
నట్టిచో మత్పూర్వ • మైన పుణ్య
ఫలమున మీరు మా • పల్లెకు నేతేరఁ
బావనం బయ్యె మా • ప్రాభవంబు
తేనియలు కందమూలముల్ • తీయనైన
ఫలములును నీడలైనట్టి • పాదపములు
పుణ్యజలములు గలవు మా • పొలములోన
నిట నివాసంబు దగును వి • ప్రేంద్ర నీకు. 3

క. కూటువ కూడి కిరాతులు
కోటానంగోట్లు గలరు • ఘోరాకృతు లీ
వీటను మద్వశులై సొం
పాట నెదిర్చినను గెల్తు • రమరుల నైనన్. 4

మ. ఫలముల్ మౌక్తికముల్ భవద్గృహమునం • బర్యాప్తమౌనట్లుగా
నిలుపంజాలుదు నేను మీరిచట సు • స్నిగ్ధాత్ములై యున్నచో
ఫలియించున్ మదవాప్తపూర్వజనన • ప్రఖ్యాతపుణ్యంబు లు
జ్జ్వలరూపంబున నాయశంబు నిగుడున్ • సర్వప్రపంచంబునన్. 5

వ. అని యిట్లు శబరనాయకుండు సాంత్వనపూర్వకంబుగాఁ బలికిన వచనం
బులకు సమ్మతించి విప్రదంపతులు తదాలయంబున నొక్కగృహంబున నిలి
చి వన్యంబులైన కందమూలఫలాదులు భుజియించి యొక సంవత్సరము
కాఁపురము సేయుచునుండి రాసమయంబున విష్ణుదత్తుండు సుగంధితో ని
ట్లనియె. 6

చ. ఎఱుఁగము మదగ్రదేశ మిపు • డేక్రియ నున్నదొ సర్వధాన్యముల్
పరువడిఁ బండియున్నవొకొ • భామిని యేనటు చూచివచ్చెదన్
మఱవక సర్వకాలము ర • మావరు పాదయుగంబు వేడ్కతో
నెఱవక పూజసేయు మిట • వేగమవత్తును దత్ప్రసన్నతన్. 7

మ. అని యీరీతి ధరామరాధిపుఁడు భా • ర్యన్ సౌమ్యవాక్యంబులన్
వినయం బొప్పఁగ బుజ్జగించి మదనా • వేశంబుతో నంతఁ ద
ద్వనితారత్నముఁ గౌఁగిలించి తులసీ • దామంబులన్ విష్ణుపా
దనవాంభోరుహపూజ సేసి తుదఁ ద • ద్ధ్యానప్రసన్నాత్ముఁడై. 8

గీ. విష్ణుదత్తుఁ డిట్లు • వేడ్కతో శ్రీవిష్ణు
పూజ తీర్చి తనదు • పూర్వమైన
దేశమునకు యాత్ర • సేసెదనని పును
నపుడు శబరనాథుఁ • డరుగు దేర. 9

క. ముదమున నావిప్రుఁడు దన
సదనంబున కరుగుదెంచు • శబరాధిపుతో
నిదె నీకుఁ జెలియలని తన
సుదతిం గరసంజ్ఞచేతఁ • జూపె మునీంద్రా! 10

వ. ఇట్లు శబరనాయకుం డగు చంచలునకు నిజభామిని నప్పగించి విష్ణుదత్తుండు హరికి సమర్పితంబులైన వన్యాహారంబులు భుజియించి నిజ దేశంబునకుం జనియె నంత సుగంధి పాతివ్రత్యంబున శుచియై ప్రత్యహంబు సాలగ్రామమూర్తియందుఁ దులసీదళంబులం బూజసేయుచుఁ దద్భక్తిసమేతయై యుండె నయ్యవసరంబున నొక్క మహీసురుండు తద్గృహంబున కేతెంచిన నమ్మానినీరత్న మమ్మహాత్మున కర్ఘ్యపాద్యంబులు సమర్పించి యుచితాసనసమాసీనుం గావించి యిట్లనియె. 11

క. కనుఁగొనియెద మనినను నీ
వనమునకున్ రాఁడు విప్ర ♦ వర్యుం డొకఁడున్
వనజాక్షరూప మగు నిన్
గనుఁగొన నోభూసురేంద్ర ♦ కౌతుక మొదవెన్. 12

సీ. చర్చింప మద్రదే ♦ శంబు మన్నిలయంబు
రంతిదేవుం డను ♦ రాజవరుఁడు
తద్దేశ మేలుచో ♦ ధర్మహీనుం డైనఁ
గుంభినివర్షముల్ ♦ గురియవయ్యెఁ
దన్మూలమున సస్య ♦ తతులెల్ల శుష్కింప
ధుర్భిక్ష మేతేరఁ ♦ దొలఁగి యిటకు
వచ్చి యేము ఫలాది ♦ వన్యాశనములచేఁ
గాలంబుఁ గడపంగఁ ♦ గ్రమ్మఱియును
బూర్వదేశంబు చూడంగ ♦ బుద్ధివొడమి
చనియె మత్పతి నాల్గువా ♦ సరము లయ్యె
నతఁడు సేమమునఁ దిరిగి ♦ యరుగుదెంచు
నట్టి సువ్రతమొకటి నా ♦ కానతిమ్ము. 13

చ. ఫలములు కందమూలముల ♦ పారములున్నవి మద్గృహంబునన్
వలసినరీతి నిచ్చకును ♦ వచ్చిన వెల్ల భుజించి వేడ్కతో
లలితవిచిత్రపల్లవము ♦ లన్ విలసిల్లెడు పుష్పశయ్య పై
నలయిక దీర నిద్రసుఖ ♦ మందుము విప్రకులైకభూషణా. 14

వ. అని యివ్విధంబున సుగంధి పలికిన ప్రియవచనంబులకు సంతసించి భూ
సురుం డిట్లనియె. 15

గీ. తల్లిమాడ్కి నీవు ♦ దయతోడఁ బలుక నా
యలయి కెల్లఁ దీఱె ♦ నంబుజాక్షి
యతిథిపుత్త్రిభావ్యుఁ ♦ డను శాస్త్ర మిచ్చటఁ
బ్రకటమయ్యె నేఁడు ♦ పద్మవదన. 16

క. శ్రీకాంతుని దివసము నేఁ
డేకాదశి యీదినమున ♦ నేనరుఁడైనం
జేకొని భుజియించిన వృజి
నాకరుఁడై నరకలోక ♦ మందు వసించున్. 17

గీ. ఈమహావ్రతంబు ♦ నెవ్వారలైనను
జలుపఁగలిగిరేని ♦ సర్వమైన
వాంఛితములఁ గలుగు ♦ వారికెల్లను బంక
జాక్షుకరుణచేత ♦ నభినుతింప. 18

గీ. నేఁటి కుపవసించి ♦ నీగృహంబున నిల్చి
పుండరీకనయనుఁ ♦ బూజసేసి
బారసందు వేడ్క ♦ ఫలరూపపారణ
చేసి చనెదువాఁడఁ ♦ జిత్తములర. 19

వ. అని విప్రుండు పలికిన వనితాలలామ యిట్లనియె. 20

క. ధరణీసురేంద్ర! మాకును
గురువవు దయచేసి నీకు ♦ గోచరమగు శ్రీ
హరివాసరవ్రతక్రమ
మురవడి వినిపింపవలయు ♦ నాదవెదు వేడ్కన్. 21

వ. అని వినయంబునఁ బలికిన సుగంధికి విప్రవరుం డిట్లనియె. 22

సీ. సర్వతీర్థస్నాన ♦ సంభవఫలదంబు
తరికింప వాంఛితా ♦ ర్థప్రదంబు
సకలసంపదలకు ♦ సదనంబు వైభవా
కరము దుష్కర్మౌఘ ♦ ఘాతుకంబు
బ్రహ్మహత్యాది పా ♦ పఘ్నము బహురోగ

సంక్షయంబునకును • సాధనంబు
జయకారణము మహీ • శ్వరులకు వైకుంఠ
పురనివాసమునకుఁ • బూఁటకాఁపు
చక్రహస్తాంఘ్రిజలజప్ర • శస్తబుద్ధి
నిత్యనైర్మల్యహేతువు • నిఖిలవిబుధ
మాన్యమై లోకధన్యమై • మహిమ మెఱయు
సువ్రతంబగు నేకాద • శీవ్రతంబు. 23

క. ఉపవాసవ్రత మిది యిల
నపరిమితఫలంబు లిచ్చు • హరిదినకృత మీ
యుపవాసము కలుషావృత
చపలాత్ముల కైనఁ బూర్ణ • చంద్రనిభాస్యా. 24

క. పతి యనుమతి గలిగినచో
వ్రతములు సతి కాచరింప • వచ్చును లక్ష్మీ
పతి వాసరోపవాస
వ్రతమునకుం బతియనుజ్ఞ • వలవదు తలఁపన్. 25

క. పరమంబగు సద్భక్తిని
బురుషుం డొక దూరయాత్ర • పోయిన నైనన్
హరిపూజయు నుపవాసము
హరిదినములఁ జేయవలయు • నతివల కెల్లన్. 26

క. ఇదె నేఁ డేకాదశి స
మ్మదమలరఁగ నుపవసించి • మధుసూదనుఁ బు
ష్పదళములను బూజింపుము
విదితంబుగ నీప్రియుండు • వేగ మెవచ్చున్. 27

క. ఇది యాదిచేసి లెక్కగు
పదియాఱవ దినమె తలఁపఁ • బద్మాక్షుదినం
బది యెఱిఁగి యందు నీవ్రత
మొదవెడు సద్భక్తిఁ జేయ • నుచితము తరుణీ! 28

వ. అని యిట్లు భూసురుండు హరివాసరోపవాసవ్రతప్రభావంబును దద్వ్రతా
చారంబునుం జెప్పినవిని సుగంధి సంతసంబున నుప్పొంగుచు నా దినంబున

నుపవసించి మఱి పూజాపూర్వకంబుగా జాగరణంబు దీర్చి మఱునాఁడు తద్విప్రునకుఁ గందమూలాదులు సమర్పించి తద్విఘసంబునఁ దాను బారణ సేసినపిమ్మట నవ్విప్రుండు తృప్తినొంది దీవించి చనియె నంత పదియాఱవ దినంబున నేకాదశి వచ్చిన విధ్యుక్తప్రకారంబున నాసాధ్వి వ్రతంబు సలుపుచున్నంత. 29

గీ. అచటి కొక్కఁడు విప్రుఁ • డ సాధ్వి పరిశ్రమం
బునను జేరి కంద • మూలఫలము
లాఁకటికిఁ దగంగ • మాకు నొసంగంగ
వలయు ననుచు నతఁడు • వలికె నంత. 30

మ. విని యవ్వాక్యములన్ సుగంధి వలికెన్ • విప్రేంద్ర నిన్నజ్ఞతన్
జనులొండంచును బల్కరాదు గమన • శ్రాంతుండవై యున్నచో
దినముల్ నూటి నెఱుంగనైతివొ ననుం • దీవ్రంబుగా మాయగో
ల్పను నుద్యోగము నీమదం బొడమనో • పల్కంగ నింకేటికిన్. 31

క. ఆఃంజాతుని దివసం
బేకాదశి నేఁడు ఫలము • లెట్లుభుజింపన్
గైకొనఁ దవిరితి విఁక నీ
వాకలుషము లాత్మఁ గాన • నైతివి విప్రా! 32

క. హరిదినమున నన్నము భూ
సురులకు నిడువారు విగత • సుకృతంబుల దు
ష్కరసంచితాఘముల చేఁ
బరవశులై చనరె యముని • భవనంబునకున్. 33

గీ. వృద్ధరోగబాల • వివశాంగులకు కాని
యన్యజన్ముల కెందు • హరిదినమున
నన్నమిడినవారు • నన్నాభికాంక్షులు
చనెదువారు యముని • సదనమునకు. 34

వ. అని యిట్లు విప్రభామిని యగు సుగంధి హాసపూర్వకంబుగాఁ బలికిన వచనంబులకు రోషాయత్తమనస్కుండై యాధరామరుం డిట్లనియె. 35

చ. అతివవృథాగాన నీవెఱుఁగ • వంత తలోదరి యౌవనంబునన్
నెతకఁగ సాక్షిఁ జెప్ప నొక • విప్రుఁడు నైనను లేఁడు నిన్ను నే

కతమున నేనాడంబఱుపఁ • గర్తను నీవిట హాస్యమోహాసం
గతి మను నీక్రియం బలుకఁ • గారణమెయ్యది గల్గె మానినీ! 36

క. ఈదినమునకును ముందర
నైదవదివసంబుఁ బంక • జాతుని దిన మీ
వాదము నెఱుఁగక మాతో
వాదడువఁగ నిట్లు తగునె • వనరుహనయనా. 37

మ. అనినన్ విప్రుసితోడ నిట్లనియె న • య్యబ్జాస్య యోభూసురేం
ద్ర నను న్వంచనసేయ నేమిటికి నీ • తథ్యంబుఁ దెల్పంగ నా
క్షనవాంభోరుహలోలనేతృఁ గను ల • క్ష్మీనాథుఁ డీపుణ్యకీ
ర్తనుఁ జేరితిన యానతిచ్చె నదియే • తథ్యంబు వీక్షింపఁ గన్. 38

వ. అని పలికి సుగంధి స్నాతయై ధౌతవస్త్రంబు ధరియించి ప్రాఙ్ముఖియై
నమస్కారపుర్వకంబుగా నిట్లనియె. 39

శా. శ్రీకాంతాధిప! శంఖచక్రవిమల • శ్రీవత్సలక్ష్మాంకితా!
లోకాధీశ! సురేంద్రవందిత! దయా • లోలాక్ష! కల్పద్రుమ!
వ్యాకోచప్రసవావతంస! త్రిజగ • ద్వ్యాపారసంయుక్త! నే
మీకున్ మ్రొక్కెదఁ బక్షిరాజగమనా! • మిత్రాయుతాభాంగకా. 40

గీ. హరిదినంబె నేఁడు • నగుచుండఁ గాదని
ధూర్తవిప్రుఁ డిట్లు • దుండగమునఁ
బలుకుచున్నవాఁడు • ప్రత్యక్షమున నీవు
సాక్షి చెప్పవలయు • జలజనాభ. 41

వ. అని యిట్లు నిశ్చలభక్తిసమేత యగు నమ్మానినీరత్నంబు పలికిన వచనం
బు లాకర్ణించి సర్వపరిపూర్ణుం డగుటం జేసి యప్పరమపురుషుండు సర్వాభ
రణసమేతుండును బీతాంబరధరుండును గరుడవాహనారూఢుండునై నలక్ష్మీ
వల్లభుం డచటఁ బ్రత్యక్షంబై విప్రునిం గనుంగొని యిట్లనియె. 42

సీ. వినుము భూసురవర్య • విశ్వంబులోపలఁ
గాలరూపంబునఁ • గలిగి యేను
నఖిలలోకోద్భవ • వ్యయకారణంబనై
వర్తింతు జగముల • వన్నె మీఱి
తత్కాలమైనవ • త్సరమాస ఋక్షర్తు

దివసయామాకృతిఁ • దేజరిల్లి
లలితమత్పాదని • శ్చలభక్తి సంయుక్తు
లెట్లుచేసిన నది • యట్లయగును
సప్తతంతుసరణి • జరిపెడు మీవంటి
కర్మయుక్తులకును • గాదుగాని
యీపురంధ్రివంటి • యిల్లాండ్రకెల్లను
నేఁడె హరిదినంబు • నిశ్చయంబు. 43

వ. అని లక్ష్మీవల్లభుం డంతర్ధానంబు నొందిన విప్రవరుఁడు సుగంధియందలి విష్ణుభక్తి కాశ్చర్యంబు నొంది యావామనయనకు నమస్కారం బాచరించి నిజనిలయంబునకుం జనియె నంత విష్ణుదత్తుండును శబరాలయంబున కేతెంచి భార్యాసమేతుండై నిజదేశంబునకుం జని తద్వ్రతప్రభావంబున ధన ధాన్య పుత్త్రి పశు సమేతుండై విష్ణుభక్తి మఱవక భగవద్భాగవత కైంకర్యపరుండై యుండెనని పద్మభవుండు చెప్పిన విని నారదుండు మఱియు నిట్లనియె. 44

సీ. పుండరీకాక్షుని • పూజావిధానంబు
సకలచరాచర • సంభవంబు
సాయుజ్యముక్తిల • క్షణమును శ్రీవిష్ణు
సేవకు లగువారి • చిహ్నములును
వనరుహాక్షాకార • వర్ణనంబును గర్మ
యోగలక్షణమును • నూర్ధ్వలోక
గతియును భక్తియో • గప్రశంసయును నే
కాదశీనియమంబు • కాలమాన
మధిక మొగునట్టి తులసీమ • హత్త్వమన్న
దానవిధియును సామాన్య • ధర్మములును
మొదలుగాఁగల సర్వంబు • తుదకు వెడల
వింటి నీచేత లోకేశ • వేడ్కతోడ. 45

గీ. వేదజాలమెల్ల • వీక్షించి తద్వేద
సారమైనయట్టి • చక్రిమతము

పద్మజాత నీవు ♦ పాటించి చెప్పిన
జన్మమెల్ల నాకు ♦ సఫలమయ్యె. 46

వ. అని యిట్లు నారదుండు చతుర్ముఖునకుఁ బ్రణామం బాచరించి తద్విసృష్టుం డై పర్వతునితోడఁ గూడి స్వేచ్ఛావిహారంబున నరిగె నీక్రమంబున నారదునకుఁ జతుర్ముఖుండు చెప్పె నని నారాయణమునీంద్రుండు తద్వృత్తాంతంబు శౌనకునకు నుపన్యసించిన సంతసంబంది గతసంశయుండై పుండరీకాక్షుండె పరతత్త్వంబని యెఱింగి యమ్మునీంద్రుం డిట్లనియె. 47

క. నారాయణ మునివర! దు
ర్వారాఘసమూహతిమిర ♦ వహ్నిజ ప్రియ! నీ
వారూఢిగ వినిపింపుము
నారదుజన్మంబు మాకు ♦ నయతత్త్వనిధీ. 48

గీ. జ్ఞానహేతువైన ♦ సత్కర్మమార్గంబు
విడిచి భక్తియోగ ♦ విధ మెఱింగి
యతఁడు ముక్తినందె ♦ నని చెప్పితిరి దాని
విధముఁ దెలుపవలయు ♦ విశదభంగి. 49

వ. అని పలికిన శౌనకునకు నారాయణమునీంద్రుం డిట్లనియె. 50

సీ. పూర్వకాలంబునఁ ♦ బుండరీకాక్షుండు
సంగతి బలి నడం ♦ పంగఁ బూని
వామనుఁడై చిన్ని ♦ వడువురూపముఁ దాల్చి
యతఁడు యజ్ఞము సేయు ♦ నపుడు వోయి
యొడపక వసుధ మూఁ ♦ డడుగులమాత్రమ
య్యవనీతలేశ్వరు ♦ నడిగికొనియు
భూతలంబెల్ల సం ♦ పూర్ణంబుగా నొకక్ర
పాదాంబుజాతంబుఁ ♦ బాదుకొల్పి
మఱియునొకక్రటి సకలబ్ర ♦ హ్మాండలమున
సందులేకుండ మింటిపైఁ ♦ జాఁచియుండ
భాసిలుచునుండు తద్విష్ణు ♦ పాదజలజ
ముద్ధృతముచూచి తద్భక్తి ♦ యుక్తుఁడగుచు. 51

సీ. అట్టి లక్ష్మీశుపా • దాభిషేకార్థంబు
జలముఁ దెచ్చుటకునై • జలజభవుఁడు
తనచిత్తమందున • త్తజి నొక్క పురుషుని
సృజియించి యతని నీ • క్షించి యపుడు
జలము తెమ్మని కమం • డలువుసూప నతండు
చని యంత హేమపు • ష్కరిణిలోన
వర్ణితోదకము స • త్వరముగఁ గొనితేరఁ
బురుషసూక్తంబునఁ • బొలుపు మిగిలి
చేరి తత్పదాభి • షేకంబు సేయఁ ద
త్పాదతీర్థ ముర్విఁ • బడక యుండ
శంకరుండు వచ్చి • సంప్రీతి ధరియించె
మౌళిభాగమందు • మహిమ మెఱయ. 52

క. ఈరీతిఁ గమలజాతుఁడు
నారంబనను దకమునకు • నామంబగుటన్
నారద యని పల్కెనఁ దా
నారదుఁ డన వెలసె నతఁడు • నామాంకితుఁడై. 53

వ. అంతఁ జతుర్ముఖునకు మానసపుత్త్రుండగు నారదుండు శారదాసమక్షంబున సంగీతం బభ్యసించి యంత మారుతలోకంబున కరిగి తద్గంధవాహదేవతాదత్తం బగు మహతి యను వీణఁబరిగ్రహించి యొక్కనాఁడు దేవముని యక్ష కిన్నర కింపురుష గరుడ గంధర్వాది సమాజసంకులం బగు బ్రహ్మదేవుని యాస్థానంబున కరుగుదెంచి మహతి యను వీణ సారించి స్థాయిరూపంబులును సంచారిరూపంబులును నారోహణరూపంబులును నవరోహణరూపంబులును నై వాది సంవాది యను పాదభేదంబుల సారియలయందు సారితంబు లైన మధ్యమ పంచమ గాంధార ఋషభ ధైవత షడ్జ నిషాదంబులను సప్తస్వరంబుల నందుఁ బాదుకొల్పి షాడవంబులు నైడవంబులును సంపూర్ణంబులును నై శుద్ధసాళగరూపంబులను బ్రవృత్తంబులగు భైరవి భూపాళ శ్రీరాగ పడవంజరంబులును వసంతంబు, మాళవి, బంగాళి, నాట, దేవక్రియ, మేఘరంజి, వేళావుళి, మలహరి, జాళి, హిం

దోళము, భల్లాటనవనీతఝుంకారధ్వని, నాదనామక్రియ, వరాళి, మంగళకౌశికి, గుండక్రియ, ఘూర్జరి, ధన్యాసి, శంకరాభరణంబులు మొదలైన రాగోపరాగంబులు చంచత్పుటషడ్విధాపుత్త్రిక సింహనందనరాయభేంకాళవేణువాద్యలీలావినోదనిర్ధువాది నానాతాళయుక్తంబులుగఁ దంత్రీముఖంబులయందాహతంబనాహతంబునను గానమాత్రవిశేషంబులవాయించుచుమఱియుం దత్తాళసమన్వితంబులైన మాలితాగవాద్యతుల్యంబులుగ వదనంబున సందష్టపరివృష్టసూత్కృతి భీతశంకితకరాళ కపిల కాక వితాళ సాంబక తుంబక ప్రసాద వినిమీల విస్వరాపస్వరావ్యక్త స్థానభ్రంశకమిశ్రంబు లనంబరఁగు బహువిధ గీగదోషంబులం బరిత్యజించి పాడుచుఁ దద్గానంబున నిజజనకుం డగు చతురాననుఁ హర్షితహృదయుంగావించియిట్లనియె.

సీ. నిఖిలాబ్జజాండంబు ♦ నిలిచె నెవ్వనిచేత
మహిమతో జలరాశి ♦ మధ్యమమున
నెవ్వనికతమున ♦ నీచరాచరవిశ్వ
ముదయమును బ్రవృద్ధి ♦ నొందుచుండు
నెవ్వనికోర్భాగ్ని ♦ నిది నష్టరూపమై
కలయును నీటిలో ♦ గర్వమడఁగి
యెవ్వనిఁదలఁపంగ ♦ నీప్సితంబులుగల్గు
నెలకొని సర్వదే ♦ హులకు నిలను
నామహామహుఁడే జప ♦ ధ్యానములను
వందనస్తుతులను మాకుఁ ♦ బొందువడును
నిట్టిసూక్ష్మంబులెల్లను ♦ నీక్షచేసి
తెలుపవలయును లోకేశ ♦ జలజనయన. 55

క. ఈకర్మసరణివిడువక
యేకాలము నడపవలయు ♦ నెయ్యదిధరలో
మాకుంగల యధికారము
లోకోత్తరచెప్పవలె వి ♦ లోకించితగన్. 56

వ. అని విన్నవించిన నారదునకుఁ జతురాననుండు సంప్రీతినిట్లనియె. 57

సీ. వినుము కుమార యీ • విశ్వంబులోపల
ధరణితలాకాశ • గిరులయందు
వార్ధినదీద్వీప • వాయుతేజములందు
ధరణీరుహోదక • స్థలములందుఁ
బశుపక్షిమృగకీట • పన్నగంబులయందు
వసుధానిలింప దే • వతలయందు
ఫలపుష్పపల్లవ • పరిమళాదులయందు
విమలకాంచనరత్న • సమితియందుఁ
దిలలయందును దైలంబు • నిలుచుమాడ్కిఁ
సర్వపరిపూర్తితోడుత • సంక్రమించి
వెలయుచుండును వేదాంత • వేద్యుఁ డైన
విష్ణుఁ డఖిలాండమధ్యప్ర • విష్టుఁడగుచు. 58

క. ఆపరమమూర్తి వరనా
భీపద్మము నందు నేను • బృథుతరభక్త్యా
రోపిత నిజహృదయుఁడనై
చూపట్టితి సంభవించి • సురలు నుతింపన్. 59

క. నిలిపితిని సర్వజనములఁ
దలకొలిపితి నందుఁ జెడని • ధర్మము మిగులన్
గలఁచితి నసురల హృదయము
లలయించితి విష్ణువిముఖు • లగు దుర్జనులన్. 60

వ. మఱియు నప్పరమపురుషుం డైన లక్ష్మీవల్లభుండు త్రిజగత్పరిపూర్ణుం డై కర్మాచారసమేతు లగు మహీసురులచేతఁ గ్రతువులయందు శ్రౌషడ్వౌష ట్స్వధాస్వాహాంతంబు లైన మంత్రంబులచేత నాహూయమానుం డై తద గ్నులయందు హుతంబు లైన పురోడాశాదులు భుజియించి క్రతుకర్తలకు వాంఛితంబు లొసంగుచు నతిగహనంబు లగు సంసారంబు లందుఁ బుత్త్ర ధన వధూ పశు బాంధవ గృహాది దుర్మోహంబులం బరిత్యజించి ప్రపన్ను లైన దాసులచేత ననవరతంబును హృదయపయోరుహంబులయందు ధ్యేయుం డై తద్వైగుణ్యంబులు దలఁపక వారికిం బరమపదంబు గృప

సేయునట్లు కర్మజ్ఞాన ప్రతిపాదకంబు లగు వేదంబులు తన్మహాత్ముని పాదాంబురుహంబులకు భూషణంబు లై వర్తించున ట్లగుటం జేసి సేవ్యుండును వంద్యుండును ధ్యేయుండును స్తుత్యుండును దత్పయోరుహలోచనుండ కాని యితరు లిందుల కర్హులు గారు. అమ్మహాతత్త్వంబునే తలంపఁగవలయునని చెప్పి లోకేశుండు మఱియు నిట్లనియె. 61

చ. హరి జగదీశ్వరుండు భువ ♦ నైకనివాసుఁడు సర్వదేవతా
వరుఁడు దయాసమన్వితుఁడు ♦ వారిజనాభుఁడు భక్తలోక దు
ష్కరకలుషౌఘమర్దనుఁడు ♦ కంజదళాయతనేత్రుఁ డిందిరా
ధరుఁడు మనస్సరోజమునఁ ♦ దార్కొని నిల్చును నెల్లకాలముల్. 62

క. శ్రీవరుఁడే దైవంబని
భావంబునఁ దలఁపు నీవు ♦ ప్రత్యక్షం బై
యావనరుహాక్షుఁ డొసఁగును
నీవాంఛిత మెల్ల సతత ♦ నిత్యచరిత్రా. 63

మ. హరి సంగీతవినోదలోలుఁ డగుఁ బో ♦ మత్యంతశీఘ్రమ్ముగా
వరగానంబుల నాత్మసద్గుణకథా ♦ వర్ణ్యంబు లైనట్టి గీ
తరసంబుల్ రసనం జవింగొనెడు మ ♦ ర్త్యశ్రేణి కిష్టార్థముల్
పరిపూర్ణంబులుగా నొసంగును దయా ♦ పారీణుఁ డై వేడుకన్. 64

గీ. సామవేదమందు ♦ సంగీత ముదయించె
నట్టి గీతమునకు ♦ నఖిలజగము
వశమునొందుచోట ♦ వరుస నీకును బొంద
రానిచో టదొకటి ♦ యైనఁగలదె! 65

క. కలదొక్క మంత్రరాజము
కలుషనివారకము ముక్తి ♦ కరమును నగుచున్
జెలువొందును దన్మంత్రము
దెలిపెద వినవలయు సర్వ ♦ దివిజాభినుతా. 66

గీ. సర్వవేదోక్తసన్మంత్ర ♦ సారమయము
సుప్రసన్నత వాంఛితా ♦ ర్థప్రదంబు

# పంచమాశ్వాసము.

చతురకైవల్యసంప్రాప్తి • సాధనంబు
శ్రీమదష్టాక్షరంబు రా • జితచరిత్ర.

క. అష్టాక్షరమంత్రము వి
స్పష్టంబుగ జపముసేయ • జలజాక్షుఁడు దా
నిష్టప్రాప్తియు మఱియు న
నిష్టనివృత్తియు నొసంగు • నిర్మలచరితా.

వ. అని పలికి బ్రహ్మదేవుండు మఱియు నిట్లనియె.

సీ. వినుము పుత్త్రిక పూర్వ • వృత్తాంత మొకఁటి
చర్చింపఁ గుతుకుదే • శరిబ్బినందుఁ
బరిపూర్ణనిత్య శో • భనమున విలసిల్లు
భ్రిమవావతీనామ • పట్టణంబు
ఆపట్టణమున వి • త్తాధికుండై యుండుఁ
బులహుండు నా నొకఁ • భూసురుండు
అతఁడు తద్విత్తమ • త్యంతంబు వృద్ధిమూ
లంబుగం జెంచి త • లంపులోన
ధర్మమంతయు వర్జించి • దానముడిగి
మోహలోభాదిసక్తుఁడు • సాహసమున
దేవతానిందసేయుచుఁ • దెలివి తప్పి
యుండె నొక కొంతకాలంబు • నిండువేడఁ.

వ. అయ్యవసరంబున.

గీ. సుతులచేతఁ గొంత • సతిచేత నొక కొంత
యప్పువారిమీఁద • నడఁగి కొంత
యనలభూపతసఁ • రాదులచేఁ గొంత
చనియెఁ దద్ధనంబు • జనవరేణ్యా.

క. ఆసమయంబున సుతని
ష్కాసితుఁడై పులహుఁడపుడు • ఘనదుఃఖమునన్
ధీసంపద్విరహితుఁడై
మోసంబును బొంది దైన్య • మున నిట్లనియెన్.

ఉ. దానము మాని యెంతయును ♦ ధర్మము సేయక భక్ష్యభోజ్యముల్
గానక కష్టవృత్తి నతి ♦ కాంక్షను నేనిటఁ గూర్చు విత్తముల్
గానఁగరాక వాయుపరి ♦ ఘట్టితతూలము మాడ్కిఁ బోయెనే
వానికినైన దైవగతి ♦ వచ్చినఁ దప్పఁగఁ జేయవచ్చునే. 74

చ. వెనుకకు మోసమయ్యె ♦ నిదె వీక్షణసేయఁగ వార్ధకంబు వ
చ్చెను బలువైన రోగములు ♦ సెందెను నిట్టుదయించె దుఃఖముల్
మనమున నెవ్వనిం దలఁప ♦ మానునొ యాక్రియ నిత్యముక్తుఁడై
ఘనుఁడగు విప్రుచే వినినఁ ♦ గాని యెఱుంగఁగరాదు నిక్కమై. 75

వ. అని యిట్లు పులహుండు పరితాపసక్తుండై పుణ్యతీర్థజలంబుల స్నానము
సేయుచు దేహాభిమానంబు విసర్జించి వన్యాహారంబులు భుజియించుచుఁ
జనిచని. 76

చ. ఖరకరతీవ్రతాపమునఁ ♦ గంపితుఁడై యటఁ గాంచె నమ్మహీ
సురుఁడు విచిత్రరత్న పరి ♦ శోభితనిర్మలసానుమంత ము
త్కరచమరీలులాయ కిటి ♦ గండక భల్లుక బృంద మర్కటీ
హరివరమత్తనాగ శర ♦ భాదిదురంతము మాల్యవంతమున్. 77

వ. అంత నప్పర్వతంబు చేరంజని యావిప్రవరుండు శీతలం బగు నిర్ఝర
జలంబులు గ్రోలి యచ్చట నొక్క మహీజశాఖాగ్రంబున నధోముఖుండై
వ్రేలుచు బ్రహ్మజ్ఞానసమేతుండై బాహ్యంబు మఱచి తపంబు సేయుచున్న
యొక్క యోగపురుషునిం గనుంగొని తద్దర్శనమాత్రంబున శ్రమంబు విస
ర్జించి తద్ధ్యానసమాప్తిపర్యంతంబు నిరాహారుండై గతకాలక్రమ్ముం డెఱుం
గక దినత్రయం బచ్చట నుండ నంత నమ్మునివరుండు ధ్యానంబుఁ జాలిం
చి యతని నవలోకించి తదాగమనవృత్తాంతంబు మనోమార్గంబున నెఱింగి
దరహసితవదనుండై యిట్లనియె. 78

గీ. కష్టవృత్తిఁగోడ ♦ ఘనమైన విత్తంబు
గూర్చి దానమహిమఁ ♦ గొదవపఱిచి
నిజజనంబుచేత ♦ నిష్కాసితుండవై
వెడలవలసె నిట్లు ♦ విప్రవర్య. 79

క. ధనమునకును దానము ఫల
మనయంబును వారిఁ దలంచు • టాయుష్యఫలం
బని యెఱిఁగి యివ్విధంబునఁ
జనసేర్చినవాఁడె జగతి • సర్వజ్ఞుఁ డగున్. 80

క. వినయముఁ జెఱుచును గన్నుల
కును దిమిరకరంబు చెవుల • కును బధిరతఁజే
యును దేహము మఱపించును
జనులకు ధనసంగ్రహంబు • సామాన్యంబే. 81

వ. అని పలికిన యోగివరునకు విప్రవరుం డిట్లనియె. 82

క. గతకార్యంబులు మఱి యా
గతకార్యంబులును యోగ • గతి యతినియతిన్
మతి నెఱుఁగ నేర్చు భావం
బితరులకును గలదె జగతి • నీక్షింపంగన్. 83

శా. స్వామీ నీవు మహానుభావుఁడవు నీ • సందర్శనంబాఁచు నీ
భూమిం బ్రాణుల కాత్మపాపతతులన్ • బుణ్యస్వరూపంబు దాఁ
బ్రేమన్ వర్ధిలఁజేయు నిచ్చు సిరులున్ • బెక్కైన కర్మంబులన్
సామర్థ్యంబునఁ గూలింగఁ ద్రొక్కి నడఁచున్ • సంసారదుఃఖంబులన్. 84

గీ. ఏతపంబు సేయ • నీమనోదుఃఖంబు
మొదలి కడఁగి చనును • మునివరేణ్య!
యిది తలంపులోన • నెంతయు వీక్షించి
యానతీయవలయు • నమరవంద్య! 85

వ. అని విన్నవించిన వసుధాసురేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 86

సీ. నయముగ నచ్యుతా • నంత గోవింద నా
మము లేకమైన నా • మత్రయంబు
అట్టి నామత్రయం • బనెడు వైష్ణవమంత్ర
మనయంబు జపము సే • సిన నరుండు
సంసారవార్ధిసం • జనితదుఃఖవిహీనుఁ
డై విష్ణుపదమున • కరుగుచుండు

నట్లు గావున భక్తి • నలరుచు హృదయంబు
పదిలంబుగా లోనఁ • బాదుకొల్పి
సరణి మీఱంగ విజనదే • శంబునందుఁ
జక్షురాదీంద్రియజ్ఞాన • జనితవస్తు
నిచయసంభవసుఖలేశ • రుచుల నెడలి
తన్మహామంత్రరాజంబుఁ • దలఁపవలయు. 87

క. ఈనామత్రియజపమున
శ్రీనాయకుఁడైన చక్రి • చింతితఫలముల్
పూనిక నీకు నొసంగెడు
దీనావనలక్షణాత్త • దీక్షాపరుఁడై. 88

గీ. గురువుచేత నంది • కొనిన మంత్రము గాని
బయలు ప్రాఁకిచూడఁ • బనికి రాదు
ఇదియుఁ గారణముగ • నేనిచ్చెదఁ బ్రతిగ్ర
హింపు మంత్రరాజ • మిష్ట మలర. 89

వ. అని యోగీంద్రుండు పలికిన యంత నాపులహుం డమ్మహాత్మునివలన న
మ్మంత్రంబు పరిగ్రహించి యప్పర్వతంబునకు వాయవ్యభాగంబునం గలు
గు ద్రోణికామధ్యమంబునకుం జని యచ్చట ఫల పుష్ప సమేతంబు లైన
మహీరుహంబులచేత నావృతం బగు సువర్ణపుష్కరిణీతీరంబున సమాసీనుం
డై హృదయపంకజంబునఁ బుండరీకాక్షుని భవ్యాకారంబు ధ్యానంబు
సేయుచు నామత్రియ మంత్రజపంబు మఱవక జపియించె నయ్యవస
రంబున. 90.

సీ. మకరకుండలయుగ్మ • మణిదివ్యరోచులు
చెక్కుటద్దములపైఁ • జెంగలింప
హారకౌస్తుభమున • నలమి సుస్నిగ్ధమై
తులసికాదామంబు • తొంగలింప
శంఖచక్రగదాసి • శార్ఙ్గయుక్తంబు లై
కరపంకజంబులు • కరము మెఱయ

నభినవవరకిరీ • టాంగదహారాది
దివ్యభూషణములు • దేజరిల్లఁ
బీత నిర్మలవస్త్ర ప • రీతుఁ డగుచుఁ
గంతుశతకోటిసుందరా • కారుఁ డగుచుఁ
బుండరీకాక్షుఁ డచటఁ • దద్భూసురేంద్రు
కడకుఁ జనుదెంచె దేవతా • గణమువొగడ. 91

వ. ఇట్లు పుండరీకనయనుం డైన లక్ష్మీవల్లభుండు పులహునకుఁ బ్రత్యక్షుం డైన యంత నతండు తన్మహాత్ముని దివ్యాకారం బవలోకించి హర్షపులకిత దేహుం డై ప్రణతిపూర్వకంబుగా నిట్లనియె. 92

చ. సరసిజసంభవాదినుత • చంద్ర దివాకరనేత్ర ! సద్గుణా
కర ! కమలాలయాకరయు • గస్థితకుంకుమముద్రితాంగ ! సం
గరతల యాతుధాన బల • గర్వవినాశక ! సర్వభూషణా
పరిమితకాంతిరంజిత ! కృ • పారసముదంచిత ! భక్తవత్సలా. 93

మ. ధనధాన్యంబులు గోలుపోయి నిజపు • త్రభ్రాతృవర్గంబుచే
తను రోషంబున వెళ్ళఁగొట్టఁబడి యా • త్మన్ దుఃఖయుక్తుండ నై
చని నానావిధ తీర్థతోయముల సు • స్నాతుండ నై యిచ్చటన్
గనుఁగొంటిం గమలాక్ష మిమ్ముఁ గృతస • త్కర్మంబునన్ మాధవా. 94

క. భవదంఘ్రియుగళభక్తియు
భవదీయులతోడి చెలిమి • ప్రబలెడు వేడ్కన్
భవమందలి వైరాగ్యము
భవహర కృపసేయవలయుఁ • బన్నగశయనా. 95

వ. ఇట్లు నామత్రయ మంత్రజపప్రభావుం డగు పులహుండు విన్నవించిన యంత లక్ష్మీకాంతుం డగు గోవిందుఁ డతనికి సుస్థిరం బగు సంపదయు ను దానధర్మపరోపకారసమర్థం బగు బుద్ధియును నిశ్చలంబగు నిజపాదాంభోరుహాయుగళభక్తియును గృపసేసి యాసువర్ణపుష్కరిణీతీరంబునను బరమమూర్తి లోకానుగ్రహంబునకు నై మరకతశిలాస్వరూపంబుఁ గైకొని శతకోటిమన్మథాకారుం డై హేమమండపమధ్యంబునఁ గల్పమహీరుహ

చ్ఛాయాసమాశ్రితుం డయ్యె నని చెప్పి కమలసంభవుండు నారదునకు మఱియు నిట్లనియె. 96

సీ. వర్ణితం బగు మాల్య • వత్పర్వతమున వా
యవ్యదిగ్ద్రోణికా • ప్రాంతమందు
నిరుపమహేమపు • ష్కరిణీతటంబున
విమలతత్కాంచన • వేదినడుమ
బ్రాహ్మణోత్తమునకుఁ • బ్రత్యక్షుఁ డై శుభా
కారంబుఁ గైకొని • కమలనేత్రుఁ
డమరభూజచ్ఛాయ • నలరుచునున్నవాఁ
డచటికిఁ జని నీవు • హర్ష మొదవ
వీణ సారించి సంగీత • విద్యచేతఁ
బ్రతిదినంబు సంగీత సం • స్తుతు లొనర్ప
నమ్మహాత్ముండు ప్రత్యక్ష • మగుచు వేడ్క
నిష్టమగు వస్తుసంతతు • లిచ్చు నీకు. 97

వ. అని యిట్లు చతురాననుం డానతిచ్చిన నట్లకాక యని నారదుండు కమలసంభవునకుఁ బ్రణామంబు లొనర్చి మహతి యను వీణ నిజభుజంబున నిడుకొని తద్గదితం బగు హేమపుష్కరిణీతటంబుఁ జేరి యచ్చట నఘమర్షణస్నానంబుసేసి సంధ్యాదినిత్యకర్మంబులు సమాప్తించి తత్తీరంబున సువర్ణవేదికామధ్యంబున మణిమయాకారంబుఁ గైకొనిన లక్ష్మీవల్లభుని సందర్శించి యప్పరమమూర్తికి సాష్టాంగదండప్రణామంబులాచరించి వీణ సారించి యందు రాగాలప్తి రూపకాలప్తిభేదంబునఁ దత్పుండరీకాక్ష గుణపౌరుషసమేతంబు లైన గీతంబులు పాడుచునున్న సమయంబునఁ దద్గీతామృతపాన పరవశుఁ డై యాలక్ష్మీవల్లభుండు నంతసంబున నుప్పొంగి యమ్మునీంద్రున కిట్లనియె. 98

సీ. బ్రహ్మకుమార యీ • పగిది శారదకైన
సంగీత మొనరించు • సరవి రాదు
చతురవీణాదండ • కృతరూపకాలప్తి
వాద్యామృతమునకు • వశము నొంద

హర్షసంయుక్తంబు • లై మదీయాంగక
ప్రకరంబు లెల్లను • బరిణమించె
మెచ్చితినే మైన • నిచ్చెద నడుగంగ
వలయును నీయభి • వాంఛితంబు
ముందు గాఁగల్గు నీకిఁక • ముక్తి సౌఖ్య
మనుచుఁ దత్పుండరీకాక్షుఁ • డానతీయ
ముదముతో నంత నారద • మునివరుండు
కరసరోజముల్ శిరసుపైఁ • గదియఁజేర్చి. 99

వ. ఇట్లనియె. 100

సీ. ఓ పుండరీకాక్ష • యో దయాసాగర
యో రమాధీశ్వర • యోకృపాత్మ
సనకాదియోగీంద్రు • లనయంబు వాయువుల్
కుంభకంబునఁ బాదు • కొల్పి యందుఁ
గుండలి మేల్కొల్పి • నిండు వేడుకతోడ
ద్వాదశాక్షరములఁ • దవిలినట్టి
హృత్సరోరుహమందు • హేమరూపం బగు
మీదివ్యరూపంబు • మోద మలర
ధ్యానమార్గమునఁ దలఁప • నైన యుష్మ
దీయ తేజోమయాకృతిఁ • దెలియ లేని
యట్టిచో సర్వనిత్యుల • రైన మిమ్ము
దర్శనము సేయఁగంటి నే • తత్రిమ్మ్ర లలర. 101

వ. మఱియును సంతతాచారపరాయణు లై కర్మమార్గప్రవర్తకులైన యాజకు లచేత శ్రౌషట్ వౌషట్ స్వాహా స్వధాకారంబులను దత్క్రియావిశేషం బుల నాహూతుండ వై హుతంబు లగు పురోడాశ దధ్యాజ్య సమిధాదిద్ర వ్యంబులచేతఁ దృప్తుండ వై యజ్ఞేశ్వరుండును యజ్ఞపురుషుండును యజ్ఞ భోక్తయు నన సంస్తుతుండ వై తత్కర్మనిష్ఠులకు వాంఛితార్థంబు లొసం గుదువు. దేవా! అట్టి స్థావరజంగమాత్మకం బై నిరర్గళ నిరతిశయ దృష్ట

సంకల్ప వికల్పసముదాయాది గుణసమేతంబై లోచనగ్రాహ్యంబగు నీ విశ్వంబున గుణద్రవ్యక్రియావత్స్వరూపంబున శబ్దమాత్రభేదస్వరూపగతుం డవై తిలగతంబగు తైలంబుచందంబున వృద్ధిశూన్యుండవై వర్తించుచు సర్వజీవాంతఃకరణగతుండవై తద్వ్యాపారంబు లెఱింగి నిశ్చల నిజపాద భక్తిసమేతులైన మహాత్ములకు సాయుజ్యంబుఁ గృపసేయుదువు; పరమ పురుషా! నీవు దయాపరిపూర్ణుండవగుటం జేసి లోకానుగ్రహార్థంబు బోధ్య బోధకభాగవతుండవై ప్రాణిసమూహంబులను గర్మజ్ఞానాచరణరూపంబున సాయుజ్యంబు నొందింతువు; సకలపరిపూర్ణరూప! భవద్గుణంబులు వర్ణింప బ్రహ్మాదులకైనను మనోవాగ్గోచరంబులు కావు. అట్లయినచో నస్మదాదులు మీదివ్యపౌరుషంబులు వర్ణింపఁగలరే యని పలికి నారదుం డిట్లనియె.

సీ. శైలంబులందుఁ గాం • చనమహీధ్రం బన
జలధులందున దుగ్ధ • జలధి యనఁగ
ఫణిసంఘములయందుఁ • బన్నగేశ్వరుఁ డన
మణులందుఁ గౌస్తుభ • మణి యనంగ
దేవతాపతులందు • దివిజనాథుం డన
నరులయందున మహీ • సురుఁ డనంగ
సర్వవేదములందు • సామవేదం బనఁ
గర్మంబులందు యా • గం బనంగ
దినములందున శ్రీవిష్ణు • దినమనంగ
నఖిలభూతచయంబులం • దనల మనఁగ
వస్తువులయందు ఘనమైన • వస్తురూప
మునఁ బ్రవర్తింతు వీరీతి • వనజనయన. 103

గీ. పలుచనై యొక్క రోమకూ • పంబులోన
నుండు మీదేహమునను బ్ర • హ్మాండకోట్లు
తలఁపనైన నశక్యమై • తనరుచోట
వచనముల మిమ్ముఁ బొగడంగ • నుచిత మగునె. 104

శా. వైగుణ్యంబులు పెక్కు గల్గినను దే • వా భూసురుల్ భక్తిచే
భోగాంతశ్శయనుండవైన నిను సం • పూర్ణాత్ములై కొల్చి య

జ్ఞాగారంబులయందు హోమముముఖ క ♦ ర్మాచారముల్ సల్పి త
ద్వైగుణ్యోద్భవ పాపహీను లగుచున్ ♦ వర్తింతు రెల్లప్పుడున్. 105

క. మిముఁ బొగడక తుద నాచరి
తము లగు కర్మములు సంత ♦ తంబును ఫలశూ
న్యములై చనుఁ దత్కర్తకు
నమితం బగు నరకనిలయ ♦ మాసన్న మగున్. 106

గీ. వరుసఁ గర్మతంత్ర ♦ వైగుణ్యములు గల్గు
కర్మపరణి మిగులఁ ♦ గలుషహేతు
వట్ల యగుటఁజేసి ♦ యొప్పైన మీపాద
యుగళభక్తి మాకు ♦ నొసఁగవలయు. 107

వ. అని విన్నవించిన నారదునకుఁ జక్రధరుం డిట్లనియె. 108

క. ఆర్తుండయ్యును మద్గుణ
కీర్తన సేయంగనేర్చు ♦ కృతకృత్యుఁడు మ
న్మూర్తింగలయును సన్నుత
కీర్తిపరిఖ్యాతుఁ డగుచుఁ ♦ గీర్తితపుణ్యా. 109

క. సంగీతామృతధారల
నంగీకృత మైనయట్లు ♦ యజ్ఞాదులచే
తం గరఁగదు సంతోషత
రంగిత మై మన్మనంబు ♦ రమ్యచరిత్రా. 110

చ. జననుత సామవేదమున ♦ సంభవ మయ్యెను గానవిద్య త
జ్జనితము లైన రాగములు ♦ చక్కఁగఁగూర్చి మదీయసద్గుణా
భినవము లైన గీతములు ♦ ప్రేమఁ దలిర్పఁగఁ బాడనేర్చు స
జ్జనుఁడు మదీయుఁ డాతనికిఁ ♦ జక్కనయిత్తును వాంఛితార్థముల్. 111

క. కొంకక కలుషంబులకును
శంకింపక మత్పదాబ్జ ♦ చిరతరభక్తిన్
బంకజభవసుత మద్గుణ
సంకీర్తన సేయవలయు ♦ జగములలోనన్. 112

గీ. సంతతానపాయ ♦ సంపత్కరంబును
సకలధర్మములకు ♦ సాధనంబు
దేవమిళితమత్సు ♦ రావాసహేతువు
కృతము నదియ సుగుణ ♦ కీర్తనంబు. 113

వ. మఱియు శిలాదారు మయంబులైన ప్రతిమావిశేషంబులు నిల్పి యందు మదీయాకారంబు భావించి పూజాది క్రియలొనర్చుటయు మత్ప్రీతిగాయజ్ఞంబు లాచరించుటయు మదర్పితంబులుగ దీనులయెడ దానంబులు సేయుటయును బుణ్య తీర్థంబులయందు స్నానంబును దీర్ఘయాత్రయు మొదలైనయవి జ్ఞానంబునకుఁ గారణంబులు. అట్టి సుజ్ఞానసమేతుండైన మద్భక్తుండు బాహ్యవస్తుమోహంబుఁ బరిత్యజించి ధ్యానయోగంబున స్వసంవేద్యసుఖంబనుభవించుచు నాత్మారాముండై వర్తించునట్లు గావున నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధకర్మంబులఁద్యజించి. 114

చ. వరుస మదీయదాసజన ♦ వర్గములోపల నగ్రియుండవై
సురనరనాగలోకములు ♦ చొచ్చివిశేషములైన తావులం
దిరుగుచు మద్గుణాకలిత ♦ నిర్మలగీతములెల్ల వైణిక
స్వరముల గానముల్ సలుప ♦ సంతసమందుదు నేను భూసురా. 115

వ. అనియీచందంబున లక్ష్మీవల్లభుండానతిచ్చి తొల్లిటి యట్టివిగ్రహంబు ధరియించి సువర్ణవేదికా మధ్యంబున నిలిచెనంత నారదుండును బ్రహ్మానందసంపన్నుండై యాపుండరీకాక్షవిగ్రహంబునకుఁబ్రణామం బాచరించి జీవన్ముక్తుండై హరినామస్మరణంబు సేయుచు విష్ణుభక్తిపరిపూరితాంతరంగుండై కర్మయోగంబుఁబరిత్యజించి జ్ఞానమార్గంబున సంచరించుచునుండె నని నారాయణమునీంద్రుం డీప్రకారంబున నారదు జన్మవృత్తాంతంబు సెప్పినవిని శౌనకుండిట్లనియె. 116

క. వేదానధికారులకును
మొదంబున నాచరింప ♦ ముఖ్యము లగు త
ద్వేదోక్తము లగు కర్మము
లాదరమున నానతిమ్ము ♦ హర్షంబొదవన్. 117

వ. అని పలికిన శౌనకునకు నారాయణమునీంద్రుం డిట్లనియె. 118

క. దానంబును సత్యము సం
తానస్థాపన మనంగ • ధరలో నివియే
మానవులకు వేదోక్తము
లై నియతము లాచరింప • నగు ధర్మంబుల్. 119

క. దానమునఁ గల్గు పుణ్యము
దానముననె కీర్తినిలుచు • దర్పితు లెల్లన్
దానముననె వశులగుదురు
దానమునకు నధికమైన • ధర్మము గలదే. 120

క. సత్యంబున సిరి నిలుచును
సత్యంబున విష్ణులోక • సౌఖ్యముగలుగున్
సత్యవ్రతుఁ డగు మనుజుని
బ్రత్యహము నుతింపుదురు సు • పర్వగణంబుల్. 121

వ. మఱియుఁ దనయుండును దటాకంబును వనంబును నిక్షేపంబును దేవతాల
యంబును బ్రహ్మప్రతిష్ఠయుఁ గృతియును ననఁగ సప్తసంతానంబు లనం
బరఁగు నందుఁ దత్తత్ప్రకారంబులు సెప్పెద నాకర్ణింపుము. 122

క. వినుతి యొనర్పఁగ నిజకుల
వనితాగర్భంబునందు • వైభవ మెసఁగన్
దనయునిఁ బడయఁగ వలయును
మునుకొని పితృవర్గ ఋణవి • మోచనమునకై. 123

క. తనయుఁడు చేసిన పుణ్యం
బున నరకనివాసు లైనఁ • బొందుదురు మహా
ఘను లై పితృవర్గంబులు
జనసుత సురలోకదివ్య • సౌధచయంబుల్. 124

క. తనయవిహీనుఁడు పుణ్యం
బున నధికుండైన లోక • పూజితుఁ డైనన్

జను నంతకుని పురంబున
కను బంధుసమేతుఁ డగుచుఁ • గోరిక లెడలన్. 125

గీ. విప్రులాత్మవంశ • వృత్తంబు విడనాడి
శూద్రసతుల యందు • సుతులఁ బడసి
కాలసూత్రమందుఁ • గాలకింకరమర్ది
తాంగు లగుచు దుఃఖ • మందువారు. 126

వ. అట్లు కులకాంతాసముత్పాదితు లైన తనయులచేత నాచరితంబు లైన యజ్ఞాదితంత్రంబులచేతను బుణ్యతీర్థంబులందును నిత్యనైమిత్తిక కామ్య కారుణ్య పైతృకంబులచేతను దర్పణోదకంబులచేతను బితృపితామహాదులు తృప్తలై స్వర్గసుఖానుభవంబు సేయుదురు. మఱియు నట్టి పుత్త్రులు, ఔరసుండును, క్షేత్రజుండును, దత్తుండును, క్రీతుండును ననఁ జతుర్విధంబులఁ బ్రవర్తింతు రందు స్వసంభవుం డౌరసుండును, బరసంభవుండు క్షేత్రజుండును, హోమపూర్వకంబుగా గృహీతుండు దత్తుండును, క్రయలబ్ధుండు క్రీతుండును నగుఁ దత్క్రీతుండును దేహక్రీతుండును ధర్మక్రీతుండును నన ద్వివిధంబగు నందు మూల్యరూపంబునఁ గ్రీతుండు దేహక్రీతుండును ననన్యగతికుం డై యన్నాదులచే రక్షితుండు ధర్మక్రీతుండు నగు నిట్లు పూర్వతనయభావరూపంబున నుత్తరోత్తరసంతానరూపతనయులఁ బరిగ్రహింపవలయు మఱియును. 127

గీ. న్యాయరూపముననుఁ బ్రాప్త • మైనయట్టి
విత్తమున నప్రమత్తుఁ డై • వేడ్కతోడఁ
దద్వ్యయంబున కాత్మసం • తాప ముడిగి
వరతటాకములు నిలుప • వలయు నెచట. 128

క. ధరణి తటాకము నిలిపిన
నరుఁ డఘనిర్ముక్తుఁ డగుచు • నవయౌవనవి
స్ఫురితశరీరుం డగుచును
వరుణాలయమందు నిలుచు • వైభవ మెసఁగన్. 129

క. అరయఁ దటాకముననుఁ గో
ఖురములు తటమందు నిలువ • గోలోకమునన్

బరిపూర్తిని విహరించును
బరికింపఁగఁ దత్తటాక • పాలకుఁ డనఘా! 130

క. పూర్తాదులు గావించిన
కీర్తిసమన్వితులు జగతిఁ • గృతపుణ్యులచేఁ
గీర్తితు లగుచును భవరో
గార్తిం ద్యజియించి నిలుతు • రమరపురమునన్. 131

వ. మఱియును దాదృగ్విధతటాకంబు లుత్తమంబులును మధ్యమంబులును సా
మాన్యంబులు ననఁ ద్రివిధంబులం బరఁగు నందుఁ జత్వారింశ ద్గోకర్ణపరి
మాణ జలసమేతం బుత్తమంబు వింశతివిష్కుప్రమాణ పయఃపూరితంబు
మధ్యంబును దశప్రాదేశమాత్రప్రమాణ సలిల సంయుక్తంబు సామాన్యంబు
నగునట్టి తటాకంబులయందు జానుదఘ్న సలిలసమేతంబు వారుణలోకప్రా
ప్తియు నితంబపరిమాణ జలపూరితంబు గోహత్యాది పాతకనివృత్తియును
గక్షదఘ్న పయస్సంయుక్తంబు సురాపానాది కలుషచయ నివారకంబును
బురుషపరిమాణ పానీయసముజ్జ్వలంబు బ్రహ్మహత్యాది నాశకరంబును గజ
దఘ్నకీలాలదర్శనీయంబు విష్ణుమందిర నివాసకారణంబును నై పితృమాతృ
వంశజు లైన కులసంభవులకు స్వర్గలోకనివాసకరంబగుఁ దత్తటాకజఫలి
తంబు లైన మూల శాక ధాన్యాదులు దానంబుచేసిన లక్ష్మీపుత్రపౌత్రి
కాంతాదిలాభంబులు గలుగు నందు. 132

క. అలయికతోడుత మనుజుఁడు
ఫలపరిమితతత్తటాక • పానీయంబుల్
చెలువలరఁ గ్రోలిరేఁ గర్తకుఁ
గలుగును దేవేంద్రసదన • ఘనసౌఖ్యంబుల్. 133

క. ఘనసంపత్ప్రాప్తికమ
య్యును సంతతి నిగుడుకొఱకు • నొగి స్వర్గంబం
దును నిలయము గలుగుటకును
వనములు దలకొలుప ధాత్రి • వలయు మునీంద్రా. 134

క. కలకొలఁది సూపసంఖ్యను
ఫలపుష్పసమేతరమ్య • పాదపములచే

నిలుపంగవలయు వనములు
గలిమియు సంతతియుఁ గీర్తి ♦ గలిగెడుకొఱకుః. 135

వ. మఱియును సహకారంబులు నదియును నారికేళంబులు ముప్పదియును జంబీరంబులు పండ్రెండును మాతులుంగంబు లిరువదిమూఁడును ఖర్జూరంబు లిరువదియును జంబూవృక్షంబులు ముప్పదియును దాలద్రుమంబు లేఁబది యును గపిత్థంబులు పదునాకండును దాడిమంబు లిరువదియును దింత్రిణీ భూజంబులు పదియును గదళీశతంబును బిల్వంబులు పదియాఱును హింతా లంబు లిరువదియును నశోకంబులు పదియాఱును నామలకంబులు నలువది యును శ్రీచందనపాదపంక్తిఁ బొకకోటియు వటంబులు నాల్గును నశ్వత్థంబు లెనిమిదియును బున్నాగ కురువింద కరవీర మల్లికా వకుళ పాటల శతప త్రజాతీ కుంద చంపక తులసీ మరువక ప్రియంగు ప్రముఖ తరులతావిశే షంబులు పాదుకొల్ప నది వర్ణింపనం బరఁగు నట్టి వనంబు ఫలోద్భవ ప ర్యంతంబు పాలితంబై కర్తకు స్వర్గలోకంబు నిచ్చు నంత 136

క. వనములుదలకొల్పిన య
మ్మనుజుఁడు దివిజాధినాథు ♦ మందిరమునసం
జనితకుతూహలముననిలు
చును భూషావళులచేత ♦ శోభితముగఁ జుః. 137

గీ. వేదరహితుఁడైన ♦ వృత్తిహీనుండైనఁ
బతితుఁడైనదుష్ట ♦ భావుఁడైనఁ
దెలివిఁదద్వనప్ర ♦ తిష్ఠఁగావించిన
వాంఛితములనొందు ♦ వర్ణితముగ. 138

వ. మఱియు నిధిప్రకారంబు చెప్పెద నాకర్ణింపుము. 139

సీ. అరిగుగానరువది ♦ యంగుళంబులభూమి
గర్తంబుగాఁజేసి ♦ క్రమముతోడ
నందునీవారము ♦ ఖ్యారణ్యకములైన
పంచధాన్యంబులు ♦ పంచరత్న
ములుహరిద్రయుగవ్య ♦ మును సప్తధాన్యముల్
వేదమంత్రంబులఁ ♦ బాదుకొల్పి

సంఖ్యచిన్నము సహ ♦ స్రము శుద్ధహేమంబు
తామ్రపాత్రాంతస్థి ♦ తంబు చేసి
యివ్వ లవ్వల నెవ్వరు ♦ నెఱుఁగనట్లు
తమము వదలిన యర్ధరా ♦ త్రంబునందు
నదియుఁ దద్గర్తమధ్యము ♦ నందు నిల్పి
పుణ్యుఁ డందును స్వర్గోప ♦ భోగములను. 140

క. నిధి నిలిపిన ఘనపుణ్యుం
డధికమహాకలుషరహితుఁ ♦ డై తుది నిలుచుౝ
విధు సూర్యులు గలకాలం
బధిగత పరమార్థుఁ డగుచు ♦ నమరపురమునౝ. 141

గీ. ఎంతకాలంబు నిక్షేప ♦ మీధరిత్రిఁ
బరులచేఁ బడకుండును ♦ బదిల మగుచు
నంతకాలంబుఁ దత్కర్త ♦ హర్ష మొదవ
స్వర్గలోకంబు నందుండు ♦ సత్యచరిత. 142

క. ఆ నిక్షేపముఁ గైకొని
మానవుని కులస్థుఁ డెల్ల ♦ మహిఁ గర్తకు సం
తానము లై మనుచుఁదురు
మానవపతు లైన సర్వ ♦ మానితు లైనౝ. 143

వ. మఱియు దేవాలయప్రతిష్ఠావిశేషంబు లెఱింగించెద. 144

క. విష్ణుప్రతిష్ఠ చేసిన
వైష్ణవుఁడు ధరిత్రిలోన ♦ వైభవముల వ
ర్ధిష్ణుం డై తుదఁ బొందును
విష్ణునివాసంబు లోక ♦ విశ్రుతుఁ డగుచుౝ. 145

క. అగణితధర్మప్రద మగు
సుగతికిఁ జెడనట్టి తెరువు ♦ శోకాదులకుం
బగ వాంఛితార్థఫలదము
జగతిౝ విష్ణుప్రతిష్ఠ ♦ సామాన్యంబే. 146

క. అతులితపాషాణ విని
ర్మితమగు సదనమున భక్తి ♦ మెలఁగుచు విష్ణు

ప్రతిమాప్రతిష్ఠ చేసిన
మతిమంతుం డరుగు మోక్ష ♦ మార్గంబునకున్. 147

చ. హరునిఁ బ్రతిష్ఠసేసిన మ ♦ హాత్ములు తద్వరరూపయుక్తులై
హరునిపురంబుఁ జేరి ప్రమ ♦ దావళిలోన సుఖింతు రిందిరా
వరుని బ్రతిష్ఠసేయు గుణ ♦ వర్ణితు లెల్లను విష్ణు దివ్యమం
దిరవరసౌధజాలములఁ ♦ దీనుతులై విహరింతు రెప్పుడున్. 148

గీ. వేడ్క బ్రహ్మ ప్రతిష్ఠఁ గా ♦ వించు నరుఁడు
వైభవంబున దేవతా ♦ వర్ణ్యుఁ డగుచు
భూతలంబున ధనధాన్య ♦ పూర్తిఁ బొంది
యంతమందున సుఖియించు ♦ నమరపురిని. 149

వ. మఱియు భూసురోత్తముల కుపనయన వివాహాదికర్మంబు సేయుటయును స్వవిత్తమూలంబున విప్రరక్షణంబును దదాపద్విమోచనంబును బ్రాహ్మణునకు నుపకరణపూర్వకముగా గృహనిర్మాణంబును ననసివియు బ్రహ్మప్రతిష్ఠలనంబరఁగు నిట్టిబ్రహ్మప్రతిష్ఠలు సేసిన సుజనులు విష్ణుసదనప్రాప్తులగుదురని నారాయణుండు మఱియు నిట్లనియె. 150

మ. మతిలోనం దలఁపంగ సర్వజనస ♦ మ్మాన్యంబులై యిందిరా
పతిలోకస్థిరసౌఖ్య కారణములై ♦ భవ్యంబులై లోకవి
శ్రుతసంపజ్జయదంబులై భువనసం ♦ స్తుత్యంబులై మెచ్చుటన్
గృతిమూలంబునఁ గాదె నిల్చుటలు స ♦ త్కీర్తుల్ దిగంతంబులన్. 151

క. క్షితిమీఁద సప్తసంతతు
లతిరయమున నిలుపునరుల ♦ కబ్బినఫలముల్
గృతినాయకునకుఁ గలుగును
మతిఁదలఁపఁగ జగతిఁ గృతియె ♦ మాన్యంబనఘా. 152

చ. వలనుగఁ దత్కృతీశ్వరుని ♦ వంశజు లెల్లను గోటిజన్మని
ష్ఫలవివిధప్రసిద్ధ కలు ♦ షంబులఁ బాసి మహానుభావులై
పొలుపుగ రత్నభూషణవి ♦ భూషితులై విహరింతు రెప్పుడున్
నలినదళాక్షు మందిరము ♦ నం బరిపూర్ణమనోరథాత్ములై. 153

వ. అని యిట్లు నారాయణమునీంద్రుండు సప్తసంతానప్రకారంబులు సెప్పిన

సంతుష్టమనస్కుండై శౌనకుండు మఱియు నిట్లనియె. 154

మ. హరిరూపంబులు వేదజాలములు త ♦ ద్వ్యాపారముల్ సూటితోఁ
బరఁగించున్ గరిమంబు లేక కుమతుల్ ♦ భావించి దుష్ప్రజ్ఞులన్
దఱచై తద్గ్రథితార్థమధ్యసరణిం ♦ దరికొంచి దుర్మార్గసం
చరులై మోక్షము నొందలేరు ఘనతన్ ♦ సంసారనిర్మగ్నులై. 155

ఉ. ఆనుక శత్రుపౌరుషము ♦ లొందనకుండినఁ దన్నిహంతృస
న్మానసనాథకీర్తులు ది ♦ నంబును వృద్ధిఁ బొంద వట్లనే
జ్ఞానముచేతఁ గర్మములు ♦ సంక్షయమందెడుచోట వేదముల్
జ్ఞానమహాత్మ్యముం దెలుప ♦ సన్నుతిసేయును గర్మయోగమున్. 156

సీ. వేదాంతవేద్యుని ♦ విశ్వసంపూర్ణుని
సద్గుణాధారుని ♦ సత్యచరితుఁ
బద్మజపద్మారి ♦ పద్మాప్తవంద్యునిఁ
బరమయోగీంద్రహృ ♦ త్పద్మనిలయు
నఖిలలోకశరణ్యు ♦ నాదిత్యశతకోటి
నిర్మలకాంతి స ♦ న్నిభశరీరుఁ
గమలాలయానాథుఁ ♦ గరుణాసమన్వితు
నంబుజదళనేత్రు ♦ నమరసేవ్యు
దివ్యభూషావిభూషితు ♦ దేవదేవు
శంఖచక్రాబ్జవరగదా ♦ శార్ఙ్గహస్తు
నాదిమూర్తిని నఖిలవి ♦ ఖ్యాతచరితు
విష్ణుఁ దలఁపుము మునివర్య! ♦ వేడ్కతోడ. 157

క. సత్యముఁ జెప్పెద హరియే
నిత్యం బన్యంబు మాని ♦ నీ వా విభునిన్
అత్యంతభక్తితోడుత
నిత్యము మదిఁ దలఁపు మనఘ ♦ నియతుఁడ వగుచున్. 158

క. ఏవేమైనను మఱవక
భావంబునఁ దన్నుఁ దలఁచు ♦ భక్తుల కెల్లన్
శ్రీవిభుఁ డొసఁగును దయతోఁ

కైవల్యము భూసురేంద్ర ♦ క్రమ మొప్పంగన్. 159

క. నిత్యుం డవ్యయుఁ డమలుం
డత్యంతము చక్రహస్తుఁ ♦ డారాధ్యుఁడు జగతిన్
సత్యంబిది సత్యంబిది
సత్యంబిది మునివరేణ్య ♦ సంశయరహితా. 160

ఉ. వృత్తివిహీనుఁ డైన నతి ♦ విశ్రుత ఘోర దురంతపావకా
వృత్తిసమేతుఁ డైన నప ♦ విత్రమనస్కుఁడు నైనవిష్ణుధ
ర్మోత్తర మెవ్వఁ డేనివిను ♦ నూర్జితభక్తిని వాఁడుభూమిలో
నుత్తముఁడై యభీష్టములఁ ♦ బొందును విష్ణుదయాప్రపూర్ణుఁడై. 161

వ. అనియిట్లు నారాయణ మునీంద్రుండు శౌనకునకు వైష్ణవధర్మంబు లుపదేశించి నతండు సంశయంబు మాని లక్ష్మీవిభుండు వేదాంతవేద్యుండని యెంచి తద్విష్ణుభక్తిసమేతుం డై యమ్మహాత్మున కభివందనం బాచరించి నిజాశ్రయంబునకుం జనియె. 162

క. దీనావనసత్వరసత
తానంతశయాన రాక్ష ♦ సాధిపదళనా
శ్రీనాథ కౌస్తుభాంకిత
నానావిధవిభవపూర్ణ ♦ నతసురభూజా. 163

పృథ్వీవృత్తము.
జయాసురవరాంతకా ♦ జయరమానమాలింగితా
జయప్రకటసాహసా ♦ జయసమస్తలోకేశ్వరా
జయాశ్రితసురద్రుమా ♦ జయసుదర్శనాలంకృతా
జయక్షితిరమాధిపా ♦ జయముకుందరంగేశ్వరా. 164

గద్య. ఇది శ్రీ హనుమత్కటాక్షలబ్ధ వరప్రసాద సహజసారస్వత చందగ్రినామాంక రామ విద్వన్మణికుమార అష్ట ఘంటా వధాన పరమేశ్వర హరిభట్టారక విరచితం బైన మత్స్యపురాణ ఖండం బగు విష్ణుధర్మోత్తరంబు నందుఁ బంచమాశ్వాసము సంపూర్ణము.

# శుద్ధపత్రిక.

| పుట. | పద్యము | ఒప్పు. | పుట. | పద్యము | ఒప్పు. |
|---|---|---|---|---|---|
| | | 1 ఆ | 41 | 32 | దహియించి |
| 2 | 7 | మత్కృతంబయి | 45 | 51 | ఆయువు |
| 3 | 12 | గంభీరునకుఁ | ,, | ,, | ఫలంబుల్ |
| 4 | 18 | వేదార్థము | 52 | 87 | సంపతిలునిజే |
| 5 | 20 | సుమనోరసమ్ముల | | | 3 ఆ |
| ,, | 21 | లెడపక | 72 | 55 | అతఁడు బ్రహ్మజ్ఞాని |
| 12 | 58 | తఱోర్ణ | | | ర్యై యనవరతంబు |
| ,, | ,, | గుణాంశ | 73 | 58 | ఋణంబులుదీర్ప |
| 22 | 103 | నాల్గి | 74 | 61 | మరుండేయని |
| 23 | 110 | వీనివృత్తాంత | 76 | 74 | పలితంబులయ్యె |
| 24 | 115 | బాదుగ | 77 | ,, | బెండ్లియాడెద |
| 28 | 136 | ఏనెల్లట్టుల | ,, | ,, | బాలురెల్లను |
| 32 | 154 | బెరయం | 84 | 107 | జడప్రజ్ఞల్ |
| | | 2 ఆ | 85 | 115 | మాహాత్మ్యము |
| 33 | 4 | బోష్య | | | 4 ఆ |
| ,, | 5 | నుద్భిజ్జంబు | 95 | 11 | నలకూబరాదికాకార |
| 34 | 9 | యంత్యకాలమునందుఁ | 108 | 87 | ముక్తికినిదానము |
| | | దేహంబు | | | 5 ఆ |
| 39 | 23 | తద్భాసక్రారాస్తోద | 139 | 52 | అట్టిలక్ష్మీశు |
| 40 | 28 | రాత్రిప్రస్ఫుటకల్పవ | | | |
| | | హ్నిఘనకీలా | | | |

మఱియుంగల ముద్రాప్రమాదమ్ములఁ జదువరులు సవరించుకొందురుగాక!